# ఏరిన ముత్యాలు

* అందరూ ధనవంతులు కాలేరు కానీ భగవంతుడు తమకు ఇచ్చినదానితో తృప్తిపడే అందరూ సంతోషంగా ఉండగలరు.

– జె.పి. వాస్వాని

* తన భుక్తికోసం పని చేసేందుకు మనిషిని సృష్టిస్తూ పనిచేయకుండా భుజించేవారు దొంగలని దేవుని ఉద్దేశ్యం.

–మహాత్మాగాంధీ

* సంకోచం లేకుండా ఇవ్వడం, విచారించకుండా ఓడిపోవడం, నీచత్వం లేకుండా సంపాదించడం నేర్చుకోవాలి.

–జి. సాండ్

* మానవాళిని పట్టి పీడిస్తున్న కష్టనష్టాలకు, బాధలకు శ్రమకు మించిన దివ్య ఔషధం మరొకటిలేదు.

–థామస్ కార్లైట్

* ఈ ప్రపంచంలో మిమ్మల్ని మీరు సరిదిద్దుకునేందుకు ఒకే ఒక మార్గం ఉంది. అదే మీ అంతరాత్మ.

–ఆల్డస్ హక్స్‌లే

* వివేకబలంతో ముందుకు సాగలేనివాడు బలవంతంగా వెనక్కు తోయబడతాడు.

–హజరత్ అలీ

* ఒక స్వచ్ఛమైన హృదయమే పవిత్రమైన యాత్రాస్థలం.

–వ్యాసుడు

* అన్నిరకాల పూలనుండి తేనెటీగ తేనెను సేకరిస్తుంది. అలాగే బుద్ధిమంతుడు వివేకాన్ని ధర్మగ్రంధాలనుండి గ్రహిస్తాడు.

–భాగవతం

* పరిశ్రమకు ప్రత్యామ్నాయం అన్నదిలేదు.

–గాంధీజీ

* ఆదర్శవ్యక్తి ఇతరులకు సహాయపడడంలో సంతోషాన్ని పొందుతుంటాడు. కానీ ఇతరులనుండి సహాయం పొందడానికి సిగ్గుపడుతుంటాడు.

–అరిస్టాటిల్

* ఆజ్ఞలను జారీ చేయాలనుకున్నప్పుడు ఆజ్ఞలను పాలించడం మొదట నేర్చుకోవాలి.

–భర్తృహరి

* ఒక వ్యక్తి వెంటవుండే పొడవైన నీడే ఒక సంస్థ.

–ఎమర్సన్

సేకరణ: పి.వి. రమణకుమార్

# చతుర కతలు

## రుబ్బురోలు

హఫ్గాన్ దేశంలో ఎన్నో యుద్ధాలనంతరం శాంతి ఏర్పడి, ప్రశాంతి నెలకొంది. ప్రజలు నిశ్చింతగా స్వేచ్ఛావాయువులు పీలుస్తున్న తరుణమది. కానీ రోజులెప్పుడూ ఒకేలా ఉండవు. శాపగ్రస్తమైన ఆ దేశాధ్యక్షుడ్ని గద్దె బుద్ధవిగ్రహాల్ని మందుగుండుతో పేల్చివేస్తున్నారు. ప్రపంచం నలుమూలలనుండీ వస్తున్న విజ్ఞప్తులు వినకుండా పేట్రేగిపోతున్నారు వాళ్ళు.

విస్లాం వినా మరో మతం ఆనవాళ్ళు తమ గడ్డపై కనిపించకుండా ఇతర మతస్థుల దేవతా విగ్రహాలు, కళాఖండాలను కర్కశంగా ధ్వంసం చేస్తున్నారు. ఒకరోజు పాలిబాన్లు



దింపి పాలిబాన్లు దురాక్రమణ చేశారు. పాలిబాన్లు పరమ కిరాతకులు, ముష్కరమూక. అంతేకాదు మతోన్మాదులు. హఫ్గాన్‌లో స్త్రీలు చదువుకోరాదని, బురఖాల్లో ఉండాలని, పౌరులు రేడియోలు వినరాదని, టీవీలు చూడరాదని రకరకాలుగా ఆంక్షలు విధించారు. అంతవరకూ హాయిగా ఆకాశంలో గిరికీలు కొట్టే శాంతిపావురాలు అశాంతికి గురయ్యాయి. పాలిబాన్ల పాలనలో మందిరాలు మసయిపోతున్నాయి. అపూర్వమైన పనిగట్టుకొని హఫ్గాన్ రాజధాని షాబూల్‌లోని సుప్రసిద్ధ మ్యూజియం వద్దకు సైనిక వాహనంలో వచ్చారు. చేతుల్లో తుపాకులు, కత్తులు, సుత్తులు, పలుగు, పారలున్నాయి. మృత్యుదేవతల్లా ముందుకొస్తున్న ఆ ముష్కరుల్ని చూసి మ్యూజియం క్యూరేటరు గుడ్లప్పగించి చూస్తూండిపోయాడు.

“విస్లాంతో సంబంధంలేని ఏవీ ఇక్కడ ఉండడానికి వీల్లేదు”

అంటూ పాలిబాన్లు హుకుం జారీచేశారు.

ఫొటోగ్రాఫర్: మధు  మోడల్: రింకీ

మ్యూజియంలోకి జొరబడి ఎంతో అమూల్యమైన విగ్రహాలు, కళాఖండాలపై బుల్లెట్లవర్షం కురిపించారు. భారీసైజు విగ్రహాలను సుత్తులతో బద్దలుకొట్టారు. పలుగు, పారలతో పెకలించివేశారు. ఇంత జరుగుతుంటే మ్యూజియం క్యూరేటరు ఏమీ చేయలేనివాడిలా ఉంటూనే... గుట్టుచప్పుడు కాకుండా ఓ సాహసోపేత కార్యంచేశాడు. తనవద్దనున్న తాళాలతో అద్దాల బీరువాను తెరిచాడు. లోపల శివలింగం ఉంది. భారతదేశంనుండి వచ్చిన నల్లని రాతి లింగం మెరుస్తూ ఉంది. ఇండియా అంటే క్యూరేటరు ఖాన్‌కి రోమ రోమం నిక్కబొడుచుకుంటాయి. హిందూ సంస్కృతి, సభ్యత అంటే వల్లమాలిన గౌరవం. తన పూర్వీకులు హఫ్ఘాన్‌నుండి ఎండుద్రాక్ష, ఖర్జూరం, బాదంపప్పు అమ్ముకోడానికి వెళ్ళి ఇండియాలో స్థిరపడి కోటీశ్వరులయ్యారు. సంవత్సరానికి ఒకసారి వాళ్ళ మనవలూ, మునిమనవలూ హఫ్ఘాన్‌కొచ్చి సింధూనది పరీవాహక ప్రాంతం విశేషాలు, శాంతిని ప్రేమించే ప్రజల గురించి కథలు కథలుగా చెప్పుకొంటుంటే ఖాన్‌కి భారతీయులమీద, వాళ్లు నివసించే కర్మభూమిపైన ఆరాధన మరింత పెరుగుతూ వచ్చింది. భారతీయులు ఆరాధ్యంగా కొలిచే శివలింగాన్ని సురక్షితంగా ఉంచాలని నిర్ణయించుకొన్నాడు. అద్దాల బీరువాలోని శివలింగాన్ని రెండుచేతుల్తో తీసి నేలపైన పెట్టాడు. తన నెత్తిపైనున్న టోపీని ఆ ఖాళీ జాగాలో ఉంచేసి, అద్దాల బీరువాను బందు చేశాడు.

పాలిబాన్లు ఒక్కొక్క గదినీ పర్యవేక్షిస్తూ ఖాన్ ఉన్న గదిలోకి వచ్చారు. కనిష్కుడు హఫ్ఘాన్‌ని పాలించిన చక్రవర్తి. ఆ సామ్రాట్ బస్ట్‌సైజు విగ్రహం అరనిమిషంలో ముక్కలైపోయింది.

సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి

అని యావత్ ప్రపంచాన్ని శాంతివచనాలతో సమ్మోహనపరిచిన తథాగతుని తల నేలవాలింది. విధ్వంస కాండచేసి వెళ్ళబోతున్న పాలిబాన్లు ఆగి షోకేసులో టోపీని చూసి "ఇదేమిటి? " అని ఖాన్‌ని అడిగారు.

"బుద్ధ భగవానుని శిరస్త్రాణం" అన్నాడు తడుముకోకుండా.

"తక్షణమే తగలబెట్టండి" అని హుంకరించాడు నాయకుడు.

క్షణాల్లో టోపీ మసయిపోయింది. అంతలో వాళ్ళ దృష్టి శివలింగంమీద పడింది.

"ఈ రాయి ఇక్కడుందేమిటి? " అని అడిగాడు.

"ఇది రుబ్బురోలు పాత్రం. మహమ్మదు ప్రవక్త కాలంనాటిది" జంకుగొంకూ లేకుండా సమాధానమిచ్చాడు ఖాన్.

"అచ్ఛా! అందర్‌రఖో" అని ఆర్డరు జారీచేసి సాగిపోయారు మరో ఆలోచన లేని యవనులు.

కైలాసంలోని శివుడు నవ్వుకున్నాడో లేదోగానీ ఖాన్ విలాసాల వెనుక కొంటెనవ్వు తొంగిచూసింది.

**– ఆనందరావ్ పట్నాయక్**

---

# బాకీ

**మా** మిత్రబృందం అంతా చార్మినార్ సెంటర్ దగ్గర మీటయ్యాం. మా గోపీగాడు సిగరెట్లు కొనడానికి కిళ్ళీ బడ్డీ దగ్గరకు వెళ్ళి యథాలాపంగా అక్కడ వేలాడుతున్న సాహితి పత్రిక పేజీలు తిప్పాడు. అందులో నా కథ ప్రచురింపబడ్డట్టు చెప్పాడు. అది నా తొలి కథ. మావాళ్ళు నాచేత పది రూపాయలు పెట్టి సాహితి కొనిపించారు. వరుసగా అంతా నా కథ చదివారు.

కథావస్తువు బావుంది. శైలి బావుంది,



కథనం బావుంది... అంటూ ప్రశంసల వర్షం కురిపించారు. నేను భవిష్యత్తులో మరిన్ని గొప్ప కథలు, గొప్ప నవలలు, గొప్ప టీవీ సీరియళ్ళు, గొప్ప సినిమాకథలు రాసి గొప్ప పేరుప్రఖ్యాతులు గడిస్తాననీ, పెద్దమొత్తంలో పారితోషికాలూ అందుకుంటాననీ భరోసా ఇచ్చి నన్ను మునగచెట్టెక్కించేశారు.

నాకూ నిజమేననిపించింది. నా తొలిప్రయత్నం విజయవంతమవడం నాకు చాలా ఆనందాన్ని కలిగించింది. తొలికథ అచ్చుకావడం, మిత్రుల ప్రశంసలు పొందడం నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. 'ఊయలలూగినదోయి మనసే' అన్నట్టుగా ఆనందడోలికల్లో తేలియాడుతుండగా, 'పార్టీ...పార్టీ' అన్నారు మిత్రబృందం. ఇక తప్పేదేముంది. నాతో కలిపి ఐదుగురం ఉన్నాం. అంతా నిరుద్యోగులం. బడ్జెట్ వీక్ అయినా తప్పదు. ఆనందాన్ని నలుగురూ పంచుకోవాలి.

ఎగ్ పఫ్‌లు, మిర్చిబజ్జీలూ, టీలు, సిగరెట్లు... వెరసి ఎనభై రూపాయలు బిల్లయింది. నా అదృష్టం బావుండి ఆరోజు మా శంభూగాడు లేడు. వాడుంటే మేమంతా కలిసి ఎంత తింటామో వాడొక్కడూ అంత అవలీలగా తినెయ్యగలడు. వాడు లేకపోవడంవల్ల సగం బిల్లు ఆదా అయినట్లే. అందుకు సంతోషించాను. నా కథ చదివిన చార్మినార్ సెంటర్ యజమాని జిలానీ ఉదారంగా అరువిచ్చి నువ్వు గొప్పోడివి భాయ్ అనడంతోపాటుగా పత్రికవాళ్ళు డబ్బులివ్వగానే బాకీ తీర్చెయ్యమన్నాడు.



మర్నాడు ఉదయం పోస్టుమేన్ ఎమ్.ఓ. అని పిలిచేసరికి హుషారుగా బయటకు వచ్చాను. పోస్టుమెన్ రెండు పదినోట్లు, ఓ ఐదు రూపాయల బిళ్ళా చేతిలోపెట్టి పళ్ళికిలిస్తూ నిలబడ్డాడు. ఇక చేసేదేముంది వాడిచేతిలో ఐదు కాసు పెట్టి రెండుపదులూ జేబులో పెట్టుకున్నాను.

చార్మినార్ టీ సెంటర్ జిలానీ బాకీ తీర్చడానికి ఇక కథలు రాయడమా? లేక మా నాన్నగారికి కథలు చెప్పడమా? అన్న అయోమయంలో పడ్డాను.

– విస్సు

# ఆవకాయ-అప్పారావు

రాజారావు, అప్పారావుకి వేరువేరు ఆఫీసుల్లో ఉద్యోగాలు. అయినా ఇద్దరూ స్నేహితులు. రాజారావు కొడుకు పుట్టినరోజు సందర్భంగా అప్పారావు ఫ్యామిలీని భోజనానికి పిలిచాడు. సాయంత్రం బర్త్‌డే పార్టీ ముగియగానే డిన్నర్ మొదలైంది. టేబుల్‌మీద వడ్డించిన ఐటమ్స్ చూడగానే అప్పారావుకి నోరూరింది. అయిటమ్స్ అన్నిటిలోకీ ఎర్రటి ఆవకాయ నూనెలో తేలుతూ ఘుమఘుమలాడుతూ ఉంది. అప్పారావు విస్తరిముందు కూర్చోగానే ముందుగా ఆవకాయ కలిపి లాగించేశాడు. ఆవకాయ అంటే ఇలా ఉండాలి. అబ్బ సూపర్‌గా ఉంది. అసలా టేస్టు పెట్టేవాళ్ళ చేతిలోనే ఉంది. చాలామంది ఇంట్లో చూశాను గానీ ఇలాంటి ఆవకాయను ఇదే మొదటిసారి తింటున్నానని ఆవకాయ అన్నం తిన్నంత సేపూ మెచ్చుకుంటూనే ఉన్నాడు.

రాజారావు భార్య "ఇంకొంచెం వేసుకోండి అన్నయ్యగారూ!" అంటూ జాడీలోనుంచి ఆవకాయ తీసి అప్పారావు విస్తరిలో వడ్డించింది.

"చాలు చెల్లెమ్మా, చాలు. బాగుంది కదా అని ఒక్కరోజు ఎంతని తినగలను. నిజంగా నీ చేతి ఆవకాయ అద్భుతం. రుచికరంగా వంట చేసే భార్య లభించడం నిజంగా మా రాజారావు అదృష్టం" అన్నాడు.

ఆ సమయంలో అప్పారావు భార్య మరోగదిలో భోజనం చేస్తోంది. అందుకే అప్పారావుకి ఫ్రీగా మాట్లాడే అవకాశం కలిగింది. "మా ఆవిడకు ఇలా ఆవకాయ పెట్టడం అసలు చేతకాదు. నేర్చుకోమని ఎన్నోసార్లు చెప్పాను. వింటేగదా!" అన్నాడు.

"పోనీలెండి ఇంతమాత్రానికే అలా బాధపడతారెందుకు. మీకు ఆవకాయ ఇష్టం అని తెలిస్తే నేనే ఓ సీసాడు పంపించి ఉండేదాన్ని. మీరు వెళ్ళేటపుడు ఒక సీసాతో ఇస్తాను. తీసుకెళ్ళండి" అంది.

"అలాగే చెల్లెమ్మా" అని మొహమాటం లేకుండా భోజనాలై వచ్చేటప్పుడు అడిగి మరీ సీసా నిండా ఆవకాయ తెచ్చుకున్నాడు.

అది చూసి అప్పారావు భార్య ఇంటికి వచ్చాక ఇంత ఎత్తున ఎగిరింది. "వెళ్ళిన చోటల్లా మీ ఆవకాయ బాగుందంటూ పొగిడి సీసాలతో తెచ్చుకోకపోతే ఓ రెండువందలు ఖర్చుపెట్టి జాడీ ఆవకాయ పెట్టించుకోవచ్చు గదా. చూసేవాళ్ళంతా ఏమనుకొంటారు? పిసినిగొట్టు అంటారు. అందరి ఇళ్ళకీ వెళ్ళడం, ఆవకాయతో సుష్టుగా భోజనం చేయడం, పదిసార్లు వాళ్ళ ఆవకాయను పొగడడం, వాళ్ళు ఇచ్చింది తెచ్చుకోవడం. అదేమంటే నాకు ఆవకాయ పెట్టడం చేతకాదని చెప్పి ఉంటారు అవునా" అంటూ నిలదీసింది అప్పారావు భార్య పంకజం.

"అబ్బే అలాంటిదేమీ లేదు. నేను ఊరికే మీ ఆవకాయ చాలా బాగుందన్నాను. అలా మెచ్చుకోబట్టేకదా సీసానిండా పెట్టి ఇచ్చారు. మొన్న రమేషువాళ్ళూ, అంతకుముందు మీ బాబాయి కొడుకు సుబ్బారావువాళ్ళూ, మన ఇంటి చుట్టుపక్కలవాళ్ళూ, డాబామీదవాళ్ళూ అడక్కుండానే మా ఆవకాయ రుచి చూడమంటూ ఇస్తున్నారు. అంతా కలిసి ఓ చిన్న జాడీ నిండి ఉంటుంది కదా. ధరలు ఎలా మండిపోతున్నాయో చూస్తున్నావుగా. ఎండు మిరపకాయల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఇక ఆవాల ధర చెప్పనే అక్కర లేదు. -నూనె ధర సరేసరి. ఈ కరవు రోజుల్లో అంత ఖరీదు పెట్టి ఆవకాయ ఏం పెట్టగలం చెప్పు. ఓసి పిచ్చిమొద్దూ... ఆవకాయ బాగుందని మెచ్చుకొంటే చాలు. వాళ్ళే తీసుకెళ్ళమంటూ ఇస్తారు. ఈ సంవత్సరం దీంతోనే సరిపుచ్చుకొందాంలే" అన్నాడు.

'ఆవకాయ రోజులు వస్తేచాలు ఇదే తంతు. ఏమిటో ఈ మనిషి తత్వం? అర్థం కాద'ంటూ పంకజం భర్తమీద విసుక్కొంది.

ఈ సంవత్సరానికి ఆవకాయ ఖర్చు తప్పించిలే అనుకున్నాడు అప్పారావు.



ఆఫీసులో తల వంచుకుని వర్కు చేసుకుంటున్న అప్పారావుని అటెండర్ వచ్చి బాస్ పిలుస్తున్నారంటూ చెప్పాడు. ఈమధ్య అప్పారావు ప్రమోషన్‌కోసం తెగ ప్రయత్నాలు చేస్తున్నాడు. ఈ సంవత్సరంలోగా తనకి ప్రమోషన్ తప్పకుండా రావాలి. ఎలాగైనా బాస్‌ని కాకా పట్టాలనుకున్నాడు. బహుశా ఆ విషయమే మాట్లాడడానికి పిలిచి ఉంటాడనుకుని చేతిలో ఉన్న ఫైల్ పక్కన పడేసి హుషారుగా ఆఫీసర్ గదిలోకి అడుగుపెట్టాడు.

"రావోయి అప్పారావ్. నీతో ఒక పని



పడింది. అది చెప్పటానికి పిలిచా"నన్నాడు.

"చెప్పండి బాస్. మీరే పని చెప్పినా చిటికెలో చేసేస్తాను" అన్నాడు అప్పారావు.

"ఈ పని చేయడానికి నువ్వే సమర్థుడివయ్యా. అందుకే నీకప్పగించాలనుకున్నా"నన్నాడు.

"చెప్పండి సార్" అన్నాడు.

ఆఫీసర్ ఛైర్ వెనక్కి లాక్కుని రిలాక్స్‌గా కూర్చుని అప్పారావుని చూస్తూ,

"మా అమ్మాయీ, అల్లుడు అమెరికానుంచి వచ్చి నెల రోజులైంది. మరో పది రోజుల్లో తిరిగి అమెరికా వెళ్ళిపోతున్నారు. మన ఆంధ్రా ఆవకాయ అంటే వాళ్ళకి చాలా ఇష్టం. మా ఇంట్లో ఎవరికీ ఆవకాయ పెట్టడం తెలీదు. మన ఆంధ్రావాళ్ళు ఆవకాయ పెట్టడంలో ఆరితేరి ఉంటారు. నువ్వు ఎలాగైనా మీ ఆవిడచేత ఒక పెద్ద జాడీడు ఆవకాయ పెట్టించావంటే మావాళ్ళు జాగ్రత్తగా దాన్ని ప్యాక్ చేయించి తీసుకెళతారు. ఆ కారం, ఆవపిండి మామిడికాయల సంగతి మన మగవాళ్ళకి అంతగా తెలీదనుకుంటాను. అవి కూడా నువ్వే ఎలాగైనా తెప్పించి ఆవకాయ పెట్టించు. ఎంత ఖరీదైనా ఫర్వాలేదు. మొత్తం లెక్క చూసి నేనిచ్చేస్తాను. నువ్వయితే ఈ పని తప్పకుండా చేస్తావని బాగా నమ్మకం" అన్నారు బాస్.

అప్పారావుకి గొంతులో పచ్చి వెలక్కాయ అడ్డుపడింది. 'పెద్ద జాడీడు ఆవకాయంటే మాటలా, ఖర్చంతా బాస్ ఇస్తానంటే నాకు భయం దేనికి?' అనుకుని పైకి ఏమాత్రం కనబడకుండా "ఓ అదెంతపనండీ, బజారులో రెడీమేడ్‌గా అన్నీ దొరుకుతాయి. మామిడికా

యలు కొని అక్కడే ముక్కలు కొట్టి తెచ్చేసు కొంటే అన్నీ కలిపేసుకోవడమే. మీకెందుకు మీరు నిశ్చింతగా ఉండండి. రెండురోజుల్లో మీ ఆవకాయ జాడీ రెడీగా మీ ఇంట్లో ఉంటుంద"న్నాడు.

"థ్యాంక్సయ్యా అప్పారావ్" అంటూ ముందే థ్యాంక్స్ చెప్పేశాడు బాస్.

"భలేవారండీ! ఇంతమాత్రానికే, మీరు నాకు చేయబోయే సహాయంలో ఇది ఎన్నో వంతు చెప్పండి. మీ దయవల్ల నాకా ప్రమోషన్ వచ్చిందంటే మీ మేలు ఈ జన్మలో మరిచిపోన"న్నాడు.

"అలాగే అప్పారావ్. నువ్వింతగా చెప్పాలా తప్పకుండా నీ పని పూర్తిచేస్తాన"న్నాడు బాస్. ఆ మాటకే పొంగిపోయిన అప్పారావు ఆ పూటకి పర్మిషన్ తీసుకొని ఇంటికొచ్చి గబగబా రెండుసంచులు తీసుకొని మార్కెట్‌కి బయల్దేరాడు.

అరగంటలో తిరిగొచ్చిన అప్పారావు చేతిలో సంచుల్ని చూసేసరికి మతి పోయినంత పనైంది పంకజానికి. "నిన్ననేగదా ఆవకాయ ఖర్చు తప్పింది అన్నారు. మళ్ళీ ఇంతలోనే ఇంత ఖర్చుపెట్టి ఇవన్నీ ఏమిటండీ" అంది.

"ఇవన్నీ మనకోసం అనుకున్నావా? కాదు పంకజం. మా బాస్‌కి అర్జంటుగా జాడీడు ఆవకాయ రెడీచేయాలి. ఈ ఆవకాయ అమెరికా తీసుకెళతారు. మా బాస్ నన్ను ఆవకాయ చేయించి తెమ్మని ఆర్డర్ జారీచేశారు. పద త్వరగా ఇద్దరం కలిసి తయారుచేద్దాం" అంటూ కారం, ఉప్పు, ఆవపిండి ప్యాకెట్లన్నీ ముందేసుక్కూర్చున్నాడు.

"ఆఫీసర్‌కి అనగానే పరుగెత్తుకుంటూ వెళ్ళి తెచ్చారు. ఇంత ఖర్చుపెట్టి తీసుకెళ్ళి ఇచ్చి డబ్బులు తీసుకొంటే బాగుంటుందంటారా? అదీగాక ఆయన మీ బాస్ అంటున్నారు. డబ్బులడిగితే ఏం బాగుంటుంది చెప్పండి" అంది.

"భలేదానివే పంకజం. ఐదు, పది అనుకున్నావా. వీటన్నిటికీ కలిపి వెయ్యిదాకా ఖర్చు అయ్యింది. ముందు డబ్బు సంగతి అలా ఉంచు. నా ప్రమోషన్ గురించి ఆలోచిస్తున్నాను. ఆవకాయ జాడీ అందించి భేష్ అనిపించుకుంటాను. అలాగే ప్రమోషన్ కొట్టేస్తాను. చూస్తుండు, లాభం లేనిదే ఎవరూ ఏ పనీ చేయరు. రేపు ఈ బిల్లులన్నీ పట్టుకెళ్ళి చూపించానంటే డబ్బులన్నీ లెక్కచూసి ఇచ్చేస్తాడు. నీకా భయం అక్కరలేద"న్నాడు.

ఆ రోజంతా కష్టపడి అప్పారావు భార్య సహాయంతో ఆవకాయ తయారుచేసి మర్నాడు రిక్షాలో పెట్టుకుని ఆఫీసర్ ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

"చాలా థ్యాంక్స్ అప్పారావు. నేను వారం రోజులు సెలవు పెట్టి ఊరువెళ్ళి వస్తాను. రాగానే నీ ప్రమోషన్ గురించి ఆలోచిస్తా"నన్నాడు. జేబులోనుండి బిల్లులు తీసి చూపిస్తుంటే "ఉంచవయ్యా నీ దగ్గర. తిరిగి వచ్చాక చూసుకొందాం" అన్నాడు.

చేసేదిలేక అప్పారావు రాబోయే ప్రమోషన్ గురించి ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"నెలరోజులు గడిచిపోయాయి. ఆవకాయ అమెరికా వెళ్ళిపోయింది. దాని తాలూకు డబ్బులు మాత్రం అప్పారావుకు అందలేదు. వారంలో వస్తానన్న బాస్ తిరిగి ఆ ఆఫీసుకు రాలేదు. జూన్ నెల వచ్చేసింది. పిల్లలకు స్కూళ్ళు తెరిచారు. అప్పారావుకి ప్రమోషన్స్ మాత్రం రాలేదుగానీ పాత ఆఫీసర్ స్థానంలో కొత్త ఆఫీసర్ వచ్చాడు. రూల్స్, రెగ్యులేషన్స్ అంటూ చాలా స్ట్రిక్టుగా ఉన్న ఆఫీసర్ కొరకరాని కొయ్యలా తయారయ్యాడు. ప్రమోషన్ లేవు, గిమోషన్స్ లేవు అనగానే పెద్ద ఎమోషన్‌లో పడిపోయిన అప్పారావు తల పట్టుకొని కూర్చుండిపోయాడు. 'ఆవకాయ పోయింది, ఆఫీసరూ చెప్పా పెట్టకుండా ట్రాన్స్‌ఫరై ఉడాయించాడ'ని ఆవకాయకోసం చేసిన అప్పుని నిదానంగా తీర్చుకున్నాడు అప్పారావు.

**– తాటికోల పద్మావతి**

# చతుర

సంపుటి: 26
సంచిక: 9
అక్టోబర్ 2003

ఎప్పుడూ కోలాహలంగా వుండే ఆ వూరు ప్రస్తుతం భయం నీడలో బిక్కుబిక్కుమంటూ నిశ్శబ్దంగా వుంది. ఏ నిమిషాన ఏమి జరుగుతుందోనని గుండెల్ని గుప్పెట్లో పెట్టుకుని ఉన్నారంతా. వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. కనీసం జనం తమ ఇంటిముందు అరుగులమీద కూడా నిలబడటంలేదు. చీకటి ముసురుకుంటున్నకొద్దీ అందరిలోనూ ఉత్కంఠ...

దానికి కారణం ఏమిటి? ప్రశాంతతకు మారుపేరుగా చెప్పుకునే పల్లెలో... జరిగిన రాక్షసకృత్యాలు ఎలాంటివి?

ఆసక్తికరంగా సాగే చిలుకూరి దేవపుత్ర రచన

**'కక్షశిల'**

ఈ నెల చతుర సమగ్ర నవల



 యంత్రం పొద్దుకూకుతూ ఉంది...

ఊరు ఊరంతా ఎక్కడికో వలసపోయారేమో అన్నంత నిశ్శబ్దం ఆవరించి ఉంది అంతటా.

మామూలుగా ఆవేళప్పుడు అన్ని పల్లెల్లో మాదిరిగానే చిన్నకొత్తపల్లెలో కూడా పశువులమంద ఎర్రదుమ్ము లేపుకుంటూ ఇళ్లకి చేరుకుంటూ ఉండటం,

పెద్దరైతుల దగ్గర పని చేస్తున్న జీతగాళ్లు వరిగడ్డికోసం, పొట్టుకోసం పెద్దపెద్ద జల్లలతో గడ్డిదొడ్లవైపు వెళ్లటం,

ఆడవాళ్లు బోరుబావుల దగ్గర నీటికోసం వరసలు తీరి ఉండటం,

రెడ్లిళ్ల జీతగాళ్లు ఎద్దుల్ని కడగడానికి ఏట్లోకి తోలుకొని పోవటం,

నాగులకట్ట దగ్గర ముసలివాళ్లు దేశంలోని కబుర్లన్నీ చెప్పుకుంటూ ఉండటం,

పదిపన్నెండేళ్ల పిల్లల అంటేసుకునే ఆటలూ

పిల్లా, మేకా, గొడ్డూ, గోదాలతో ఊరంతా ఒకటే కోలాహలంగా ఉంటుంది.

అయితే

చిన్నకొత్తపల్లి ఇప్పుడలా లేదు.

ఏ నిమిషాన ఏమి జరుగనుందోనని గుండెల్ని గుప్పిట్లో పెట్టుకుని ఉన్నారంతా. ఎప్పుడయినా చాలా అవసరమనిపిస్తేనే వాకిట్లోంచి తలుపుతీసి తొంగిచూస్తున్నారు. ఒక్కరూ వీధి మొగలులోనో, కనీసం ఇంటి ముందరున్న అరుగు మీదకొచ్చి నిలబడటం లేదు కూడా.

మధ్యాహ్నం నీడ తిరిగినప్పటినించీ చిన్నకొత్తపల్లిలో ఈ భీతావహ పరిస్థితి నెలకొని ఉంది. గుసగుసలు మాట్లాడేవాళ్లే అంతా. ఒక్కరూ గలగలమంటూ మాట్లాడటం లేదు.

ఎప్పుడూ రద్దీగా ఉండే వీధులన్నీ నిర్మానుష్యమైపోయాయి.

అయితే మిద్దెలపైమాత్రం మనుషులు ఇప్పుడిప్పుడే వంగివంగి ఏవేవో పేరుస్తున్నట్లు అనిపిస్తుంది. అవి మరేవీకావని, రాళ్లూ, బాంబులేనని ఆ ఊరితో ఏమాత్రం పరిచయమున్నా చెప్పెయ్యగలరు.

పగలూ, రేయీ ఎప్పుడూ తెరిపిలేకుండా నాగులకట్టమీద కూచునే ముసలివాళ్లు అయిపులేరు. బోసిపోయివుంది కట్టంతా.

అంతటా ఉద్విగ్న వాతావరణం, ఏ క్షణంలోనైనా రాళ్లవర్షం కురవవచ్చు. ఏ క్షణంలోనైనా బాంబులు పేలవచ్చు.

చీకటి ముసురుకుంటున్న కొద్దీ అందర్లోనూ ఉత్కంఠ.

ఇంతటి భయానక వాతావరణం వెనుక కొంత కథుంది.

చిన్నకొత్తపల్లిలో కొన్ని సంవత్సరాల నుండి పాళెగాళ్ల వంశానికి చెందిన హనుమంతరెడ్డి తిరుగులేని నాయకుడు అక్కడ.

ఎంతటి ప్రభుత్వ ఉన్నతాధికారి అయినా సరే ఆ ఊర్లోకి అడుగుపెట్టాలంటే అతని అనుమతి పొందాల్సిందే. ఒకవేళ అనుమతి లేక ప్రవేశిస్తే ఆ ఉన్నతాధికారికి తన్నులు తప్పవు.

ఇక భూముల ఆక్రమణ విషయానికొస్తే తన పొలాల చుట్టూ ఉన్న భూములకు నీరు పారనీయకుండా చేసి ఆ రైతులవద్దే కారు చవకగా వాటిని కొనేశాడు. మాదిగ ఇనాం, మంగలి ఇనాం భూముల్ని బలవంతంగా తన భూముల్లోకి కలిపేసుకున్నాడు. మొదట 40 ఎకరాలున్న పొలం ఇప్పుడు నూటనలభై ఎకరాలయింది.

మరి నివాసాల సంగతికి వస్తే తనున్న వీధిలోని ఇళ్లన్నిటినీ నామమాత్రపు ఖరీదు పదీ ఇరవై రూపాయలు ఇచ్చేసి కొనేశాడు.

ఇవికాక ప్రజలవద్ద రౌడీ మామూళ్ల వసూళ్లూ, దొంగసారా పక్క రాష్ట్రాన్నించి తెచ్చి అమ్మడం, చేయడం అతిమామూలు వ్యవహారం.

కూలీల విషయానికొస్తే చుట్టుపక్కల ఏ ఊరిలోనూ అంత తక్కువ కూలీ ఎవ్వరూ




ఇయ్యరు. పైగా కూలీల్ని పిలవాల్సి వస్తే వాళ్ల ఇళ్లకి పోయి పిలవరు. గ్రామ పంచాయితికి చెందిన మైకులో పిలుస్తుంటారు. కూలివాళ్లు విని రావాల్సిందే.

ఇన్ని అరాచకాలూ, దౌర్జన్యాలూ భరించలేని ప్రజలు రెండున్నరేండ్ల క్రితం తమ పక్క ఊరయిన మీనమడుగులో సిద్ధారెడ్డిని హనుమంతరెడ్డికి వ్యతిరేకంగా ప్రోత్సహించారు. పైగా అప్పటి ముఖ్యమంత్రికీ, అతనికీ పాత బంధుత్వమేదో ఉన్నదని పుకారు. దానివల్ల పోలీసుల అండ కూడా లభించడంతో కొత్త ముఠాదారుగా సిద్ధారెడ్డి అవతరించాడు. అందులోనూ ఈ నరక కూపంలోకి తల దూర్చవద్దు అని చెప్పేందుకు భార్యకూడా లేదు. ఆమె అప్పటికి రెండేళ్ల కిందట చనిపోయింది. ఉన్నదల్లా ఇరవయ్యేళ్ల కొడుకు సుధాకర్. అతను హైద్రాబాదులో మెడిసిన్ చదువుతున్నాడు.

తను పక్క ఊరిలో ఉండడంకంటే ప్రత్యర్థి ఉన్న ఊర్లో ఉంటేనే తన బలమేదో, తన బలహీనత ఏదో తెలుసుకోవచ్చన్న తత్వం సిద్ధారెడ్డిది. అందుకే చిన్నకొత్తపల్లిలో తన బంధువులదే పెద్ద భవంతి వంటి ఇల్లు ఉంటే దాన్ని కొనేసి అందులోకి మారాడు.

కూలీలను తన మనుషులతో గ్రామపంచాయితీ మైకులో పిలిపించాడు.

హనుమంతరెడ్డి నిలువునా మండిపోయాడు. సిద్ధారెడ్డి కూలికి వెళ్లినవాళ్లని బాగా తన్నించాడు. అట్లా తన్నులు తిన్న కూలీలందరూ సిద్ధారెడ్డి దగ్గరకు పోయి "మీకు అండగా నిలుస్తాం. మీరు ఎదురు తిరిగితే" అని హామీ ఇచ్చారు. దాంతో సిద్ధారెడ్డికి బలం పెరిగిపోయింది.

సరిగా అప్పుడే పంచాయితీ ఎన్నికలు వచ్చాయి. సర్పంచి పదవికి హనుమంతరెడ్డికి పోటీగా సిద్ధారెడ్డి పెదనాన్న కొడుకు నాగిరెడ్డి నిలబడ్డాడు. మంచి మెజారిటీతో గెలుపొందాడు కూడా. ఓటమిని సహించలేని హనుమంతరెడ్డి ఆ తర్వాత రోజునే పేటకిపోయి జీపులో వస్తోన్న నాగిరెడ్డిని దారికాచి చంపించాడు. సిద్ధారెడ్డి హనుమంతరెడ్డి మీద కేసు పెట్టాడు. దాంతో ఊరు రెండు వర్గాలుగా చీలిపోయింది.

ఇప్పటిదాకా ఆ కేసు వాయిదా పడుతూనే ఉంది.

సరిగ్గా ఈ రోజు ఉదయం అనంతపురంలో హనుమంతరెడ్డివాళ్లు వాయిదాకు గాను మేజిస్ట్రేటు కోర్టుకు పోతూ ఉంటే అతని కొడుకు నారపరెడ్డిమీద సిద్ధారెడ్డి మనుషులు దాడిచేశారు. వేటకొడవలి వేటు మెడ దగ్గరగా పడిందికాని ప్రమాదం తృటిలో తప్పిపోయింది.

ఆ విషయం మధ్యాహ్నానికల్లా చిన్నకొత్తపల్లిలో తెలిసింది. ఆ క్షణంనించి ఊరంతా క్షణంక్షణం భయంభయం!

ఉన్నట్టుండి ఆ చీకటిలో అరుపులూ, కేకలూ, అందులోనే బూతులు, రప్‌రప్‌ మంటూ వడిసెలరాళ్ల వర్షం మిద్దెలమీద నించీ మిద్దెల మీదకి దూసుకుపోతున్నాయి. ఇంతలో పెద్ద శబ్దం...

ధాం!! అంటూ పేలిన బాంబు.

★ ★ ★

ఊరిలో ఉన్నంత భయాందోళన వాతావరణం మాలగేరిలో లేదుకాని దాని తాలూకు భయం మాత్రం అంతటా కనిపిస్తోంది.

మాలలందరూ గేరి మొగదలలోకిపోయి భయంభయంగా బిక్కుబిక్కుమంటూ చూస్తూ వున్నారు, దూరంనించి చీకట్లో కనీ కనిపించని ఊరి భయానక ముఖచిత్రాన్ని.

రంగయ్యకి ఇవేమీ పట్టలేదు. బాంబుపేలుడు వినిపిస్తూనే అతనిలో ఉన్న ఆందోళన మరింత ఎక్కువయింది. అందుకు కారణం అతని కూతురు లత. ఆమె కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఎమ్.ఏ సోషియాలజీ మొదటి సంవత్సరం చదువుతోంది. మరి కాసేపటికి ఇల్లు చేరుకోవా

ల్సింది.

ఊర్లో అప్పుడే బాంబులమోత ఎక్కువవు తోంది. "ఇప్పుడు లతమ్మ బస్సుదిగితే ఎట్ల? "

ఆ మాటే తన పెండ్లాం గంగమ్మతోనూ అన్నాడు.

"నిజమేనే ఎట్ల? ఒక పనిచేస్తే? ఊర్లేకి పోకుండా నేరుగా బిడ్జికాడికి మన గేర్లో నించీ సీలు దోవ ఉందికదా. ఆడికి పోయి బస్సును ఆడనే ఆపి మన లతమ్మని తోలు కొచ్చుకుంటే సరిపోతాదిగదే" అంది గంగమ్మ.

ఇంక ఆలస్యం చేయకుండా రంగయ్య నేరుగా బ్రిడ్జివ ద్దకు చేరుకున్నాడు.

ఊర్లో బాంబుల వర్షం ఎక్కువయి నట్టు శబ్దాలు.

రంగయ్య మనసు అతలాకు తలం అయి పోతూ ఉంది.

'ఎవరిది న్యాయం?

ఎవరిది అన్యాయం?

ఏమో ఆ రెండూ తన కెందుకూ

ఊరు చల్లగుండల్లంతే!

సిద్ధారెడ్డి మంచివాడా?

ఏమోతెలీదు,

పోనీ హనుమంతరెడ్డి మంచివాడేనా?

ఎందుకొచ్చిన గొడవ అదీ తెలీదు.

తను అన్నిటికీ దూరం

తనకెపుడూ ఊరు సల్లగుండల్ల

ఊరు సల్లగుంటేనే తను సల్లగుంటాడు తన కుటుంబం సల్లగుంటాది అనుకు న్నాడు.



అల్లంతదూరంలో బ్రిడ్జికి ఆవల ఉండే తాండా గుడిసెలకి అవతల ఉన్న మిట్టమీద బస్సు హెడ్‌లైట్స్ వెలుతురు కనబడేసరికి రంగయ్యకి ప్రాణం లేచివచ్చింది.

బస్సు దగ్గరయ్యేకొద్దీ చెయ్యి ఎత్తితే ఆపుతాడో లేదోనని రెండు చేతుల్నీ బారగా చాపుకొని రోడ్డుకు అడ్డంగా నిలబడ్డాడు.

హారన్ కొడుతూ వచ్చిన బస్సు టక్కున ఆగింది.

డ్రైవరు సీట్లోంచే తిట్టనారంభించాడు.

"బుద్ధుందా లేదా కడుపుకు ఏం తింటావు? " అంటూ.

బస్సు ఇంజను మాత్రం ఆప లేదు.

కండక్టరు దిగివచ్చాడు విపరీతమైన కోపంతో

ఊర్లో జరుగు తున్న కొట్లాటని వివరించాడు రంగయ్య.

అంతా విన్నాక కోపగించుకొన్నం దుకు పశ్చాత్తాపప డుతూనే డ్రైవరుకి తెలిపాడు.

బస్సు ఇంజను ఆగి పోయింది.

బస్సులోంచి ముప్ఫయి మంది ప్రయాణికులు దిగారు.

చివర్లో లత దిగింది.

"పోదాంపద తల్లీ" అనేసి కదిలాడు రంగయ్య.

గోడకి జారగిలబడి కూచుని బీడీని అంటించుకుని నెమ్మదిగా తాగుతూ ఉన్నాడు రంగయ్య.

కంచు తట్టలో ముద్దా, వంకాయ ఊరు మిండి తను కూచున్న చోటికే రావడంతో గబుక్కున లేచి కాళ్లు మొగం కడిగాననిపిం చుకుని తువ్వాలుతో తడిని వత్తుకుంటూ వచ్చి కూర్చున్నాడు. పరధ్యానంగానే తింటు




న్నాడు.

అతని మనసు బాంబుల శబ్దంపైనే కేంద్రీకరించి ఉంది. బాంబుల మోత దాదాపుగా తగ్గిపోయింది. అయితే పూర్తిగా ఆగిపోలేదు.

గంగమ్మ తనూ కంచంలో ముద్దను పెట్టుకుని వంకాయ ఊరుమిండితోపాటూ చింతతొక్కు వేసుకుని రంగయ్య ఎదురుగా కూచుంటూ,

"మన పాప వచ్చేసినాదికదే! ఇంగా ఏంది ఆలోచిస్తా ఉండావు? " అంది.

"అయ్యో! నాయనకిప్పుడు ఊరిమింద చింతమ్మా" అంది లత చాపమీద పడుకుంటూ.

"బాగా చెప్పినావు తల్లీ. నిజంగానే నాకు ఊరిమింద చింత మడి. మనూరు ఎప్పటికీ ఇంతేనా. ఏ చిన్న కొట్లాటవచ్చినా రోసాలతో, మీసాలు పీకేసుకుంటూ ఈ గొంచి కాళ్లు ఇట్ల బాంబులు ఏసుకుంటా ఉంటారా? "

"ఏమీ? నీ ఇంటి మిందకొచ్చి ఏసిరా బాంబులు. ఏమిటికోనబ్బా అంత దిగులూ!" అంది రంగయ్య కళ్లలోకి చూస్తూ.

"ఏందే నువ్వు అట్ల మాట్లాడతావు. ఊరు సల్లగుంటేనేకదా మనం సల్లగుండేదీ" అన్నాడు రంగయ్య.

అయిదు నిమిషాల్లో భోజనం ముగించి వెంటనే బీడీ అంటించుకున్నాడు.

"ఒరే రంగడూ!" అంటూ బయటినించి పిలుపు.

అది కుంటి తిమ్మప్ప గొంతేనని తెలుసు రంగయ్యకి.

"ఓ, ఏం మామా" అన్నాడు కొట్టం బయటికి వస్తూ.

"ఊర్లేకి పోయింటివే ఏమిరా విసేసాలు" అని అడుగుతూనే అరుగు మీద కూచున్నాడు.

నిజానికి ఊర్లో విశేషాలు వినేందుకు అతను రాడని, కేవలం తన దగ్గరున్న మేక మార్కు బీడీల కోసమేనని తెలుసు రంగయ్యకు. అయినా అతను అడగందే బీడీ ఇవ్వకూడదని ముందే నిర్ణయించుకున్నాడు.

"అమ్మయ్య! ఇప్పటికైనా బాంబులమోత పోయినాది లేరా. ఒక పదిమందన్నా సచ్చుంటారా? " అడిగాడు కుంటి తిమ్మప్ప.

అతను వచ్చి ఇంతసేపయినా బీడీ అడగలేదు అంటే నమ్మబుద్ధి కాకుండా వుంది రంగయ్యకి.

ఉన్నట్టుండి ఎగకట్టుకున్న అడ్డపంచెను ఎడంచేత్తో పైకి లాగి డ్రాయరు జేబులోంచి బీడీ కట్టని పైకి తీశాడు తిమ్మప్ప.

"ఒరే అల్లుడూ! ఇగ్గోవాయ్ తీస్కో బీడీలు"

"ఏం మామా ఒకేసారి బీడీ కట్ట! ఏమట్లా? "

"ముందు బీడీ తీసుకోవాయ్ చెప్తా" అంటూ తను బీడీ అంటించుకున్నాడు తిమ్మప్ప.

కాసేపు గుప్పుగుప్పుమని పొగవదలినాక "ఈ పొద్దుపొద్దన్న మీయత్త ఊర్లోకి పోయి వస్తావుంటే దార్లో దొరికినాయంట. ఇంకా తీస్కోవాయ్ అల్లుడూ! పది బీడీలు. తాగు తాగు. ఎప్పుడు ఇస్తావుంటావు పాపము" అంటూ ఇచ్చాడు తిమ్మప్ప.

కుంటి తిమ్మప్ప అంటే కుత్సితం మనిషి కాదు. భోలా శంకరుడే, అందుకే రంగయ్యకి అతనంటే ఇష్టం. నిజానికి కుంటి తిమ్మప్పకి కాలు కాదు కుంటిది, చెయ్యి కుంటిది. చిన్నతనంలో దోగాడుతూ ఉన్న వయసులో తల్లి ఏదో వంట పనిమీద ఉంటే పొయ్యివద్ద జరిగిన ప్రమాదంలో కుడిచెయ్యి మణికట్టు వరకూ కాలిపోయింది. దాంతో అది కాస్తా వంకర అయిపోయింది కూడా. అప్పటినించి కుంటి చెయ్యి తిమ్మప్పగా అయిపోయి రానురాను కుంటి తిమ్మప్పగా మారాడు. ఒంటిచేత్తో కూలిపనులూ అవీ చేసేవాడు అప్పట్లో. ఇప్పుడు వయసు ఉడిగిపోయింది. అతని

పెండ్లాం కూలిఫనులకు పోతుంటుంది. అతనికున్న ఒక్కగానొక్క కొడుకు పెండ్లాంతో పాటూ కర్నాటకలోని భద్రావతి చేరుకున్నాడు. అక్కడ పేపరు మిల్లులో ఉద్యోగం. ఎప్పుడో ఏ ఉగాదికో, సంక్రాంతికో పెండ్లాం పిల్లలతో వచ్చిపోతూ వుంటాడు.

"నీ నేస్తగాడు పొద్దున్న కనబడెరా! వాడేరా! మాదిగోల్ల పిల్లోడు ఈశ్వరిగాడు" అన్నాడు తిమ్మప్ప.

"వాడా వానితో నేను మాట్లాడేది లేదులే మామా!"

"యాలరా... మంచిపిల్లోడేకదా"

"వాడు మంచోడే మామా! ఎవురుకాదనిరి. హనుమంతరెడ్డి గొంచికానికి అంగరక్షకుడు కదా వాడు. అందుకే మాట్లాడను"

"ఎంత నేస్తంగా ఉంటిరిరా! ఆ మాదిగోల్ల పిల్లోనితో నేస్తమేందిరా అని మేము ఎవురన్నా అంటే ఒంటికాలి మింద కొట్లాటకు వస్తావుంటివి కదరా"

"ఆ కాలము పాయెలే మామా! ఇప్పటికీ వాన్ని జూస్తే అంత పానము నాకు. నిజమంటే వాడు బొలే ఎక్కువయినోడు మామా" అన్నాడు రంగయ్య.

అంతవరకూ దూరాన్నించే ఊర్లోని భీభత్సాన్ని చూసిన వాళ్లు ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోతూ ఉన్నారు. కుంటి తిమ్మప్ప భార్య రాగానే రంగయ్యతో మాటమాత్రమైనా వస్తానని చెప్పకుండా జారుకున్నాడు.

★ ★ ★

ఇంట్లోకి రంగయ్య అడుగు పెట్టేటప్పటికి గంగమ్మ గోడవారకి, ఆమెకి కొంచెం దూరంలో లత పడుకుని నిద్రపోతూ వున్నారు. వాకిలికి తడిక అడ్డువేసి వచ్చాడు రంగయ్య.

వాళ్లిద్దరికీ కొంచెం ఎడంగా తనూ పడుకున్నాడు. దీపం వెలుగు కళ్ళమీద పడుతూ ఉంటే దాన్ని ఆర్పేసి మళ్లీ పడుకున్నాడు. ఎంతదొర్లినా నిద్ర రావడంలేదు.

'తిరిగీ తిరిగీ పదేపదే ఈశ్వరిగాడే మతికి వస్తావున్నాడు.

చిన్నప్పుడు చదువుకునేటప్పుడు ఎన్నిసార్లు వానితో బడి ఎగ్గొట్టి తోటలవెంటా, దొడ్లవెంటా, కొండలవెంటా తిరిగినాడు. వానితో సెకెండ్‌షోలకి పోయి హాస్టల్ వార్డెన్‌తో దెబ్బలు తిన్నాడు. ఊరికి వచ్చినా కలసివచ్చేదే. మళ్లీ పేటకిపోతే కలసిపోయేదే. ఇంటినించి తెచ్చుకున్న ప్రతిదీ కలిసి పంచుకునితినేదే. ఈశ్వరిగాడు ఎప్పుడూ చదివేవాడు కాదు. తనమీదే నమ్మకమెక్కువ. పరీక్షలో తన ఆన్సర్‌షీట్ చూసి రాసేవాడు. ఇద్దరూ తొమ్మిదో తరగతి తప్పారు. దాంతో వాళ్లింట్లోవాళ్లు ఇద్దర్నీ చదువు మాన్పించేశారు. ఈశ్వరి తండ్రి మారెప్ప తన పెద్ద కూతురి పెండ్లికిగానూ హనుమంతరెడ్డి గొంచికానితో ఏడువేల రూపాయిలు అప్పుచేశాడు. ఎట్లాగా ఈశ్వరి చదువుకొనేదేమీ లేదు కాబట్టి అతన్ని హనుమంతరెడ్డి దగ్గర జీతానికి కుదిర్చినాడు. అట్లా కుదిర్చినరోజున ఏటిగట్టున తనతో ఎంతసేపు చెప్పుకుని ఏడ్చాడో ఇప్పటికీ గుర్తుంది' తన ఆలోచనల్లో మునిగిపోయాడు రంగయ్య.

పోయిన పంచాయితీ ఎన్నికలవరకూ రోజుకు ఒక్కసారి అయినా ఈశ్వరితో మాట్లాడకపోతే ఏదో వెలితిగా వుండేది రంగయ్యకి.

ఆ ఎన్నికల్లో సిద్ధారెడ్డిపైనా అతని తమ్ముడు నాగిరెడ్డిపైనా ఈశ్వరితో దాడి చేయించాడు హనుమంతరెడ్డి. ఈశ్వరి కేసులో ఇరుక్కున్నాడు.

అసలే కొట్లాటలన్నా, గలాటాలన్నా అతిగా భయపడిపోయే రంగయ్య ఈశ్వరితో పూర్తిగా మాటలు మానేసుకున్నాడు.

మాలగేర్లోనూ ఐదారు కుటుంబాలు సిద్ధారెడ్డి వైపున్నాయి. వాళ్లెవ్వరితోనూ తన కుటుంబంలో ఎవరూ మాట్లాడకూడదని రంగయ్య ఆదేశం.

'కుంటి తిమ్మప్ప మామ ఎందుకు ఈశ్వరిగాని గురించి జ్ఞాపకం చేసినాడా' అని





అనుకుంటూనే కళ్లు మూసుకున్నాడు రంగయ్య.

ఆ తర్వాత ఎంతోసేపటికిగానీ నిద్ర పట్ట లేదు.

★ ★ ★

"ఊర్లోకి పోలీసోల్లు వచ్చినారంట. నిన్న రేతిరి కొట్లాట జరిగిందానికి" కుంటి తిమ్మప్ప చెప్పాడు రంగయ్యకి. పోలీసులు వస్తారని ముందే ఊహించాడు రంగయ్య. మారుమాట్లాడకుండా 'ఊ' అన్నాడు బీడీ తాగుతూనే.

అప్పటికే బాగా పొద్దెక్కింది. ఎందుకో నిరుత్సాహంగా ఉంది. ఎక్కడికీ వెళ్లాలనిపించడంలేదు. గంగమ్మ పొద్దున్నే ఇంత సంగటి ఉడకేసి సెనగ విత్తనాల ఊరిమిండి నూరి తను ఇంత సద్ది కట్టుకుని అంకంపల్లి అంజనయ్య తోటలో కలుపు తీసేందుకు పోయింది.

కాలేజీలో ఏదో సర్టిఫికేట్ తెచ్చుకోవాలంటూ లత కూడా అనంతపురానికి ఫస్ట్‌బస్సుకే వెళ్లిపోయింది.

'తనూ చేన్లోకి పోయివుంటే బాగుండేది. ఆ గుట్లూనట్లూ రెండుమూడు ఉండాయి. దాన్లని పీకేస్తే ఇంకా కొంచెం భూమి కలిసి వస్తుంది. ఎందుకో చానా సోమరి అయిపోతున్నాడు తను ఈమధ్య. అనవసరమైన ఆలోచనలు తలలో ముసురుకుంటున్నాయి. 'ఊర్లో ఎవరి జోలికీ పోకూడదు. ఎవరు ఎట్లా పోతే తనకేం' అని అనుకుంటాడు. కాసేపు 'ఈశ్వరిగాడు ఏమి ఇట్లయి పాయె... నా ప్రాణానికి ప్రాణంగా ఉండేవాడు అట్ల శత్రువు కాకుండా ఇట్ల మిత్రుడు కాకుండా పాయెనే. ఊరెందుకు ఇట్లా అయిపోయింది. ఊ అంటే కొట్లాటలు, ఆ అంటే బాంబులు విసురుకునేది. మనుషులంటే ఉత్త పంతాలూ పట్టింపులేనా. సర్దుకోనిపొయ్యేది లేదా? చదువురాని మొరటోళ్లయితే ఏందోలే మొరటుతనంతో కత్తులు దూసుకుంటూ ఉంటారు అనుకోవచ్చు. ఆ పక్క హనుమంతరెడ్డి స్కూల్ ఫైనలు చదువుకుండాడు. ఈ పక్క సిద్ధారెడ్డి పియుసీ పాసయినాడు. మళ్లీ వీళ్లంతా ఆ గాంధీ మహాత్ముడు చెప్పిండే ఒక్క చెంప కొడితే ఇంకొక చెంప చూపియ్యల్లనే అహింసా సిద్ధాంతాన్ని వినిండేవాళ్లే' అలా సాగుతున్నాయి రంగడి ఆలోచనలు.

కుంటి తిమ్మప్ప బీడీ గుప్పుగుప్పుమంటూ పీలుస్తూనే రంగయ్య ఎదురుగా కూచున్నాడు.

"ఒరే రంగడూ! టీ నీళ్లన్నా తాగొద్దాం రారా నాగేశప్ప హోటలికి పోయి" అన్నాడు తిమ్మప్ప.

"ఇంటికి తడిక అట్ల అడ్డమెయ్యి మామా! పోదామి" అన్నాడు రంగయ్య లేస్తూ.

ఆగేర్లో చిన్నపిల్లలూ ముసలోళ్లూ తప్ప ఎవరూ ఇళ్లవద్ద లేరు. అంతా కూలికి పోయారు. ముసలాళ్లు మాత్రం ఇళ్లముందర గింజలు ఎండబోసుకుని కోళ్లూ పశువులు వాటిని ముట్టకుండా చేతిలో పొడుగ్గా ఉండే కర్రలు పట్టుకొని ఇంటిముందర వుండే చెట్లనీడలలో కూచుని ఉన్నారు.

రంగయ్య నెత్తికి వల్లి చుట్టుకుని బయల్దేరాడు హోటలుకి. వెంట తిమ్మప్ప నడుస్తూ వున్నాడు.

★ ★ ★

మాలగేరిని ఆనుకుని వున్న వంక దాటుతూనే ఊరు మొదలవుతుంది. అక్కడే నాగేశప్ప కొట్టం హోటలుంది. ఈతాకుతో వేసిన కొట్టం అది. చుట్టూ గోడలకు బదులు కడప బండలు నాటారు. లోపల హోటల్లో టేబుళ్లూ, బెంచీలు అవీ కడప బండలతోనే అమర్చారు. కొట్టానికి ముందువైపు గోడ కట్టకుండా కందికట్టెతో దడి కట్టారు. కొట్టానికి బయటివైపు వున్న దడిలో రెండు సత్తుగ్లాసులు గుచ్చి వుంటాయి. అవి మాలమాదిగల కోసమే అక్కడ వుంచారు. అవి అంటరానివాళ్లవి కాబట్టి ఎవరూ ఎత్తుకుపోరు. మాలమాది

సచిత్ర విచిత్రం

# ఎగిరే రెక్క




పైలెట్ లేకుండానే సోలార్ పవర్‌తో ఎగిరే అతి పెద్ద విమానాలు వినువీధిలో సంచరించే రోజులు అతి త్వరలో రానున్నాయి. భూమినుంచి 25, 30 కిలో మీటర్ల ఎత్తులో ప్రయాణించే విమానాలు విరామం లేకుండానే ఏకబిగిన నెలల తరబడి ప్రయాణం సాగిస్తూనే ఉంటాయి. 65 వేల సిలికాన్ సోలార్ సెల్స్ శక్తితో ఇవి పయనిస్తాయి. వీటిపేరు 'హెలియోస్'. ఇది చూడ్డానికి ఎగిరే ఓ రెక్కవలే కనిపిస్తుంది. కాలిఫోర్నియాలోని మోన్‌రోవియాలో 'ఎయిర్ విరోన్‌మెంట్ ఇన్‌స్టిట్యూట్' వారిచేత ఇవి రూపొందించబడ్డాయి. హెలియోస్ పైలెట్లు ఎయిర్ కండిషన్డ్ ట్రక్కులో కూర్చుని డస్క్‌టాప్‌లోని కీబోర్డ్ సహాయంతో ఈ విమానాలను కంట్రోల్ చేస్తూ ఉంటారు. హెలియోస్ ఫ్లయింగ్‌వింగ్‌లకు 1:5 కెడబ్ల్యు మోటార్లు 14 ఏర్పాటు చేయబడ్డాయి. ప్రతి మోటార్‌ని ఒకప్రొపెల్లర్ తిరిగేలా చేస్తుంది. ఈ విమానం మొత్తం సోలార్ పవర్‌తో నడుస్తుంది. లిథియన్ బేస్‌డ్ బేటరీతో ఉండి రాత్రిపూటకూడా దిగడానికి వీలుగా ఉంటుంది. దీని బరువు 750 కేజీలు. ఖరీదు 15 మిలియన్ డాలర్లు. మరింత ఆధునికమైన విమానాల తయారీకి ఇవి తోడ్పడతాయంటున్నారు శాస్త్రజ్ఞులు.

గలు వాటిల్లో టీయో, కాఫీయో తాగేసి నాగేశప్పతో నీళ్లు పోయించుకుని శుభ్రప రిచి వాటి స్థానాల్లో వాటిని గుచ్చేసి వెళ్లి పోతూ వుంటారు. తక్కిన కులాలవాళ్లంద రికీ అక్కడ స్టీలుగ్లాసులు వుంటాయి.

రంగయ్య, తిమ్మప్పలు నాగేశప్ప హోట లుకి చేరుకున్నారు.

అప్పటికే హోటలు బాగా రద్దీగా వుంది. కొంతమంది మిరపకాయ బజ్జీలు తింటు న్నారు. ఇంకా కొందరు పూరీ, కూరా తింటు న్నారు. మరికొందరు కాఫీలు తాగుతూ ఉన్నారు.

"సావుకారీ! రెండు టీలు ఇయ్యి" అంటూ కేకపెట్టాడు తిమ్మప్ప బయటినుంచే.

నాగేశప్ప తొంగిచూడలేదు.

మళ్ళీ ఒకసారి పిలిచాడు తిమ్మప్ప.

"ఎవురదీ? " అంటూ ఒక బట్టతల బయ టికి వచ్చింది. నల్లగా నిగనిగలాడుతూ ఉంది. బనియను పొగచూరి వుంది. చారల లుంగీ కట్టుకొని వుంది ఆ ఆకారం. ఆ ఆకారం పేరే నాగేశప్ప. చిత్రంగా చూశాడు అతను వాళ్లిద్దరివైపు.

"ఏరా తిమ్మగా! అంతేటు అరుస్తా వుండావు. కొంచెం వుండల్లవాయ్! మీరి ద్దరూ వచ్చిందేది చూసినానులే. గొంతులో నరాలన్నీ తెంచుకొని అరుస్తావుండాడు పాపం" అన్నాడు నాగేశప్ప.

"ఈ సావుకారికి మనమంటే ఎంత తాస్కారం సూడీ! వాళ్ళంత దుడ్లు ఇచ్చే వాళ్ళు మనం బోకిపెంచెలు ఇచ్చేవాళ్ళమా"

"ఉండు మామా! ఊరికే యాల అరు స్తావు ఇస్తాడులే టీ. బొలే ఆత్రమబ్బా నీకి. ఆకులేకి పెడ్తావా? బోకిలేకి పెడ్తావా? అనే వానివి సూడి నువ్వు" అంటూ చిరుకోపంతో మందలించాడు రంగయ్య.

"సర్లేవోయ్ అల్లుడూ, నీమాట ప్రకారమే కానీ" అంటూ దోవకేసి చూశాడు తిమ్మప్ప. అల్లంత దూరాన వస్తున్న పోలీసులు కని పించారు.

"ఒరే రంగడూ! అట్ల జూడీ! పోలీసోళ్ళు వస్తా వుండారు" అన్నాడు తిమ్మప్ప.

నలుగురు పోలీసు కానిస్టేబుళ్ళూ, ఒక హెడ్ కానిస్టేబులూ హోటలు దగ్గరికి వచ్చారు. రంగయ్యనీ, కుంటి తిమ్మప్పని ఎగాదిగా చూశారు. లోపలికి అడుగు పెట్ట బోతూ, "వార్నీ ఈ పొద్దేమి బొలే రష్‌గా వుందే మీ హోటలు? " అన్నాడు హెడ్డు.

"రాండ్రి సారూ! లోపలికి రాండ్రి" అన్నాడు నాగేశప్ప. అతని గొంతులో ఎంత వినయముండాలో అంత వినయాన్ని పలి కించాడు.

"ఎట్ల వచ్చేది. కూచోనేకే చోటులేదే. ఆ తినేవాళ్ళ భుజాలమీదకు బోవాల్సిందే... కానీలే. తినేది అయిపోయినోళ్ళు బయటికి వస్తారుకదా! అప్పుడు వస్తాములే" అన్నాడు హెడ్డు కొట్టానికి ఒకపక్కగా నిలబడుతూ.

"సార్! అంతదంకా ఇద్దో..." అంటూ లోపలినుంచి చిన్న బెంచీని తెచ్చి అక్కడ వేశాడు. ముగ్గురు మాత్రమే కూర్చోడానికి వీలుంది అందులో. అయితే అక్కడ అయి దుగురు వున్నారు. అయినా సర్దుకుని కూచున్నారు అంతా.

కుంటి తిమ్మప్పకి పోలీసులంటే చెప్పలే నంత భయం. వెంటనే అక్కడినుంచి పరు గుతీద్దామా అన్నట్లుగా వున్నాడతను. అందుకే "ఒరే రంగడూ మళ్ళావద్దాం పదరా" అన్నాడు గొణుగుతున్నట్టు.

రంగయ్య ఒప్పుకోలేదు. "ఎట్లా అయిన నిదానం అయింది తాగే పోదా"మన్నాడు.

"నాకి పోలీసోళ్ళంటే బొలే భయంరా" రహస్యంగా అన్నాడు.

"పోలీసోళ్ళకి ఇప్పుడు ఎవరితోనూ పని లేదు మామా. నువ్వు ఊరికే భయపడ మాకు. వాళ్ళు నిన్నూ, నన్నే పట్టుకోవాలను కుంటే పాముపుట్టలో దాక్కున్నా ఇడిసిపె ట్టరు" అంతే రహస్యంగా అన్నాడు రంగయ్య.

"ఇది బొలే కంత్రీ నా కొడుకు ఊరు రమేష్. ఊ అంటే రాళ్ళూ, ఆ అంటే బాంబులు మిద్దెలమీదనుంచి వేసుకునేదే" అన్నాడు హెడ్ కానిస్టేబులు వరదయ్య. అతన్ని చూస్తే నల్లరాతి విగ్రహం జ్ఞాపకానికి వస్తుంది. అటూఇటూ తిప్పినప్పుడు కళ్ళూ, నవ్వినప్పుడు గుబురుమీసాల చాటు పళ్ళూ తెల్లగా కనిపిస్తుంటాయంతే.

"ఏమో సార్! నేనెప్పుడూ ఇలా ఊర్లోకి రాలేదు. పగటిపూట కూడా బాంబులు వేసుకుంటారా? "అనుమానంగా అడిగాడు రమేష్. అతనికి ఇరవై రెండేళ్ళుంటాయి. మొహంలో ఇంకా పోలీసుతనం అలవడలేదు. అందుక్కారణం అతనికా ఉద్యోగమొచ్చి పోయిన జనవరికి సంవత్సరం దాటివుంటుంది.

"నువ్వింకా పిల్లకాకివయ్యా. నీకింకా ఉండేలు దెబ్బలంటే ఏమిటో తెలవ్వు. ఈ చుట్టుపక్కల ఇలాంటివే మరికొన్ని ఊర్లున్నాయి. అయినా బాంబులు వేసుకొనేకి పగలూ, రాత్రీ అనే తేడా ఏముంటుంది చెప్పు? ఎప్పుడు పౌరుషాలు పొంగితే అప్పుడు మీసాలు పీకేసుకుంటా మిద్దెలమీద కుచేరి రాళ్ళూ, బాంబులు వేసుకునేదే" అన్నాడు హెడ్ తన గుబురు మీసాల మీదుగా రమేష్‌ని ఓరకంటితో చూస్తూ.

"ఏం సార్! రమేష్ భయపడుతున్నట్లు ఉండాడే" అన్నాడు బక్క కానిస్టేబులు. అతని పేరు జకరయ్య. తలలో ఏమాత్రం మెదడు అన్న పదార్థం లేకుండానే బతికేస్తూ ఉంటాడు. అతనికి తెలిసిందల్లా ఒక్కటే... తనకు ముందున్నవాడు ఏ పని చేస్తే తనూ అదే చేయడం. అందుకే అతన్ని బకరయ్యా అని స్టేషనులో అందరూ అంటుంటారు.

"అబ్బే! నాకేం భయంలేదు జకరయ్యన్నా. మీరంతా ఉన్నారుకదా" ఆ పక్కనే నిలుచున్నవాళ్ళు (రంగయ్య, తిమ్మప్పలు)తనని తక్కువగా అనుకుంటారని భయమేసింది రమేష్‌కి.

రంగయ్య, తిమ్మప్పలకి మరొక పని లేనందువల్ల పోలీసుల మాటల్నే వింటూ ఉన్నారు.

"ఓకే... డోంట్ ఫియర్" అన్నాడు హెడ్ భరోసా ఇస్తూ. అతనికి వచ్చే కొన్ని ఇంగ్లిష జంటపదాల్లో డోన్ట్ ఫియర్ అన్నది ఒకటి అని అక్కడున్న పోలీసులందరికీ తెలుసు రమేష్‌తోసహా.

రెండు గ్లాసుల్లో టీ తెచ్చి "రేయ్ రంగడూ, తిమ్మడూ పట్టండ్రా మీ లోటాలు" అంటూ వాళ్ళచేతుల్లో అప్పటికే రెడీగా వున్న సత్తు లోటాల్లోకి టీ పోసేసి... పోలీసులవైపు తిరిగి, "సార్! లోపల జాగా ఒక్క నిమిషంలో ఖాళీ అయితాది. లోపలికి వచ్చి కూకుందురు. కొంచెం ఏమనుకోకుండా దయతో ఓపిక పట్టల్లసార్" అంటూ వినయాన్ని ఒకింత అదనంగా ఒలకపోసి వెళ్ళిపోయాడు నాగేశప్ప.

"ఓకే ఓకే డోంట్ వర్రీ. ఇక్కడ మాకేం పీకే పనిలేదు. మాది తిక్క నాకొడుకుల డిపార్టుమెంటు. రాత్రి బాంబులు ఏసుకుండారనీ, పికెట్ అనీ పంపారు. ఈడ ఏం చేసేది [illegible]ము" అన్నాడు వెంకటేశ్వర్లు. అతను హెడ్ కానిస్టేబులుకంటే వయసులోనూ, సర్వీసులోనూ ఎక్కువే. టెస్టులు పాసవనందువల్ల కానిస్టేబులుగానే ఉండిపోయాడు. అతనికి ఉన్న బండెడు సంసారం అతన్ని ఏ టెస్టునూ పాసవనీలేదు.

ఎంత సీనియర్ కానిస్టేబులు అయినా హెడ్డు అయిన తన అనుమతి లేకుండానే డిపార్టుమెంటుని తక్కువ చేస్తూ మాట్లాడ్తాడా. అందుకే హెడ్డుకు కోపమొచ్చి "ఏందప్పా వెంకటేశ్వర్లూ... మరీ నువ్వు ఇట్లయిపోతే ఎట్లా? మన డిపార్టుమెంటు ఎట్లాదన్నా కానీలే, ఊర్లో వాళ్ళముందర అట్లనకూడదు. ఇంత సీనియరువే. నీకు నేను నేర్పించల్లనేమప్పా" అంటూ చివాట్లు పెట్టాడు.




వెంకటేశ్వర్లుకి తక్కిన ముగ్గురు కానిస్టే బుళ్ళ ముందర పరువు తీసేసినట్లు అనిపించింది. మొహం మాడ్చుకుని "మాకు తెల్దులే సార్. అందుకే మీ మాదిరి హెడ్డు కానిస్టేబులు కాలేక పోయిండేది. మీరు మాకందరికీ పెద్దకదా. మీ మాటే విన్నలమడి. ఈ పొద్దుపొద్దున్నే నాగులకట్ట ముందర మీరు అనిండే మాటలే ఇక్కడ నేను అనింది. అవేం నా సొంతమాటలా" అన్నాడు. తన బాణం సరిగ్గా గుచ్చుకున్నదో లేదోనని ఓర కంటితో హెడ్డు మొగాన్ని గమనిస్తూ ఉన్నాడతను.

వరదయ్య నిజంగానే తెలివయినవాడు. వెంటనే వెంకటేశ్వర్లు వీపుమీద ఆత్మీయంగా చరుస్తూ, "ఇగ్గో ఏమండీ కానిస్టేబుల్స్. జకరయ్యా, రామయ్యా, రమేష్. మిమ్మల్నే నండీ... మీకే చెప్తావుండేది. వెంకటేశ్వర్లు నాకంటే ఒక సంవత్సరం సీనియర్ తెలుసా. నాకూ ఇతనికీ చానా స్నేహముంది. నేను కొత్తగా జాయిన్ అయింది ఎక్కడనుకున్నారు? వెంకటేశ్వర్లు ఉన్న స్టేషనులోనే అబ్బో, అప్పుడు ఎన్నెన్ని విషయాలు చెప్పినాడో నాకు. ఆనాటినుంచి ఉన్న పరిచయంతోనే నేను అట్ల మాట్లాడుతూ ఉంటాను. అంతేకదా వెంకటేశ్వర్లూ' ' అన్నాడు.

ఎందుకొచ్చిన గొడవ ఈ నల్లమొగమువానితో అనుకుని, "ఏం సార్! మీరు భలేవారే నాకట్లాటివన్నీ ఏంటివీ లేవు" అంటూ నవ్వాడు వెంకటేశ్వర్లు.

ఈ విషయంనుంచి అందర్నీ ఎట్లా డైవర్టు చేయాలా అని ఆలోచించి ఎదురుగా ఉన్న తిమ్మప్ప, రంగయ్యలని అడిగాడు హెడ్డు.

"మీరు హరిజనులా? "

"అవును సార్" అన్నాడు రంగయ్య.

రమేష్‌కి ఒకటే ఆశ్చర్యంగా వుంది.

"సార్ సార్. వాళ్ళు హరిజనులని అంత కరెక్ట్‌గా ఎట్లా కనుక్కున్నారు సార్" అంటూ అడిగాడు హెడ్డుని. హెడ్డు గర్వంగా రమేష్‌వైపు ఓసారి చూసి,

"యూ సీ మిస్టర్ రమేష్. మనం ఇలా పల్లెల్లో డ్యూటీలు చేస్తేనే కొన్ని కొత్తవిషయాలు తెలుస్తాయి తెలుసా! అసలు మన పట్నంలో ఏం తెలుస్తుంది. ఇంతకీ వాళ్ళిద్దర్నీ హరిజనులని నేను ఎట్లా కనుక్కున్నానో చెప్పు" అన్నాడు.

"అది తెలీకనే కదా ఆశ్చర్యపోతా వున్నాను. వాళ్ళ మొహాలు చూశా... ఇక్కడ అందరి మొగాలున్నట్లే వీళ్ళ ముఖాలూ వున్నాయి. పోనీ బట్టలంటేనా అవీ అంతే ఎవురి బట్టల్లోనూ పెద్ద తేడా లేదు"

"అయ్యా రమేషూ! నీ ఆశ్చర్యపోవడాలు కొంచెం ఆపుతావా? కొంచెం వాళ్ళు టీ తాగుతున్న గ్లాసులు చూడు" అన్నాడు అందాకా గమ్మున ఉన్న కానిస్టేబులు రామయ్య.

"ఆ చూస్తిని"

"అవి ఎట్లున్నాయి? "

"మరి సత్తులోటాలతో వాళ్ళకెందుకు టీ ఇచ్చినాడు ఈ హోటలోడు? వాళ్ళు హరిజనులు కాబట్టి. వీళ్ళని లోపలికి రానియ్యరు కనుక వాళ్ళ లోటాలు సపరేట్‌గా ఉంటాయి. బయటే ఉంచేస్తారు"

"అవును సారూ! ఆ సారు చెప్తా వుండేది కరెక్టు. మా ఊర్లో మాలమాదిగోళ్ళని అట్లే చూస్తారు సార్! రచ్చకట్ట దగ్గర మేం కూసో కూడదు. పెద్దకులాల ఇండ్లకాడ పేడనీళ్ళు ఏసిండే చోటు కూడా మేం తొక్కకూడదు" అంటూ చెప్పుకుపోతూ వున్నాడు రంగయ్య.

ఈ పోలీసోళ్ళతో ఇంతింతసేపు మాట్లాడితే ఎట్ల అని కుంటి తిమ్మప్ప మెల్లగా భుజం దగ్గర గీరాడు.

సత్తు లోటాల్లోని టీ తాగేశాక, కడిగేసి కందికట్టి దడిలో పెట్టేసి డబ్బులు ఇచ్చేసి వెళ్ళిపోయారు.

పట్నంలో పుట్టిపెరిగిన రమేష్‌కి అంటరా



నితనం అంటే ఏమిటో ఇప్పుడు కొంచెం అర్థమయింది.

"సార్! ఒకవేళ మనలో ఎవరైనా హరిజనులు ఉంటే లోపలికి రానియ్యరా" అన్నాడు రమేష్. అతని అనుమానం అర్థమయింది హెడ్డుకు. అక్కడవున్న అయిదుగురిలో జకరయ్య, రమేష్‌లే హరిజనులు. అందుకే అట్లా అడుగుతున్నాడనిపించింది.

"మనం పోలీసులం రమేష్. మనం ఏ కులమైనా ఆ నా కొడుకు మనల్ని ఏం అనకూడదు" అంటూ ధైర్యం చెప్పాడు హెడ్డు.

"సార్! ఖాళీ అయింది రాండ్రిమడి" అని నాగేశప్ప పోలీసుల్ని లోపలికి ఆహ్వానించాడు.

★ ★ ★

మధ్యాహ్నం 2 గంటలవుతోంది.

పంచాయితీ ఆఫీసులో మకాం పెట్టిన పోలీసులకి ఇరువర్గాలనుంచీ మాంసం, కోడి కూర, బిరియానీలూ, వేపుడులూ, నాలుగు క్యారియర్లలోనూ, మందూ, సోడాలూ నాలుగు బుట్టల్లోనూ అక్కడికి చేరాయి. వీటికితోడూ కింగ్‌సైజ్ గోల్డుఫ్లేక్ సిగరెట్ పెట్టెలు అరడజను ఉన్నాయి.

మందును చూడగానే ఆనందతాండవమాడాయి వాళ్ళందరి మనసులూ.

అయిదు నిమిషాల్లో ఒక టేబులు ముందు కుర్చీలు వేసుకుని గ్లాసులో మందు సోడా కలుపుకుని తాగడం ప్రారంభించారు.

"చూస్తివా పోలీసోని పవరు" అంటూ హెడ్డు, రమేష్‌ని అడిగాడు. హెడ్డుకు జ్ఞానోపదేశం చెయ్యాలనే తపన ఎక్కువ. తనకి ఎన్నో విషయాలు తెలుసు, ఎన్నో అనుభవాలు ఉన్నాయి. వాటిని బయటికి చెప్పుకోవాలంటే వినేందుకు మనుషులు కావాలి. తన అదృష్టంవల్ల రమేష్ దొరికాడు. ఎంత జ్ఞానోపదేశమైనా చెయ్యొచ్చు. కింగ్‌సైజు సిగరెట్టును అంటించుకుని పొగను విలాసంగా గాల్లోకి ఊదుతూ చెప్పుకుపోతున్నాడు అతను.

రమేష్ ఊ... ఆ అనకుండా గ్లాసులో మందు గటగటా తాగేసి, ప్లేట్లోని చికెన్ ముక్కల్ని కసాపిసా నమిలేస్తున్నాడు. అతనికి తెలుసు తను ఏం మాట్లాడకున్నా హెడ్డుగారి క్లాసు పీకుడు ఆగదని. అయినా తనకి ఆ మాటలు ఎంతో కొంత ఆసక్తిగా ఉంటాయి కాబట్టే అందుకు అనుగుణంగా తల ఆడిస్తూ ఉంటాడు.

"నిజానికి జకరయ్యా మనట్లా వాళ్లం అర్బన్ స్టేషన్‌లో ఉండకూడదప్పా. రూరల్ స్టేషన్‌లో అయితేనా మనం ఆడింది ఆట పాడింది పాట" అన్నాడు వెంకటేశ్వర్లు. మాట్లాడ్డం అయిపోతూనే గ్లాసులోని చివరిబొట్టు కూడా నోట్లోకి వంపుకున్నాడు.

"బాలే బాగా చెప్పినావన్నా! మనిద్దరం ఇంతకుముందు పనిచేసిన ఊరు అదీ... అదేంది ఆర్. కొత్తపల్లా! ఆ దాంట్లో ఎట్లుండె. వానాలి వానెక్క ఏమిదుడ్లు! ఏమి కతా! ఇదిగో రమేషూ నువ్విట్ల అర్బన్ స్టేషనులో పనిచేస్తే పూర్తి అర్భకునివై పోతావు. అవును నేను జెప్పేది నిజం నాయినా!" అన్నాడు జకరయ్య సీసాలోని మందును గ్లాసులోకి పోసుకుంటూ. రమేష్ సోడా కొట్టి ఇచ్చాడు అతనికి. మత్తుకళ్లతో ఒక్కసారి రమేష్‌ని చూసి "థ్యాంక్స్ అప్పయ్యా!" అన్నాడు.

"అవును రమేషూ! జకరయ్య చెప్పిందేది వాస్తవమే! అయితే ఒకటిలే. మనం ఏ ఊర్లో ఉన్నా ఆ ఊర్లో ఇస్పేటాకులు అంటే ప్లేయింగ్ కార్డ్సు క్లబ్బులు ఉండల్ల, మట్కావుండల్ల, ముండల కంపెనీలు ఉంటే ఇంకా మంచిది. మేమిద్దరం ఆర్. కొత్తపల్లిలో ఉన్నెప్పుడు సుగ్గికాలమనుకో దుడ్లకు కొదవేలేదు"

"అట్లనానా!" అన్నాడు రమేషు.

"సుగ్గి కాలమా! ఊరికే సుగ్గికాలమా! బంగారం పొగ ఎగురుతాండె" అంటూ వెంకటేశ్వర్లు గ్లాసులోని ద్రవాన్ని మరొక





సారి సిప్ చేశాడు.

"ఇప్పుడూ ఉన్నాం పనికిమాలిన దరిద్ర స్టేషనులో. ఏముంది ఈడ. నెలప్పుడు వచ్చే జీతం రాళ్లు తప్పా ఒక్క పైసా ఆదాయం యాడినించన్నా వస్తావుందీ. పైగా ఇట్లా పికెట్ డ్యూటీలూ" అన్నాడు హెడ్డు.

అందరూ మైకంలో ఉన్నారు. అప్పుడు మొదలుపెట్టారు భోజనాలు చేయడం. మైకం ఎక్కువ కావడంతో ఎవరూ కడుపు నిండుగా భోంచేయలేకపోయారు. అన్నం, కూరలూ సగానికి పైనే మిగిలిపోయి నాయి. చేతులు కడుక్కని కుర్చీలోనే నిద్రకుపక్రమించాడు హెడ్డు. తక్కిన నలుగురూ కిందనే బెడ్‌షీట్లు పరుచుకుని శరీరాల్ని వాటిమీద పారేశారు. పడుకున్నదే తడవుగా గుర్రుపెట్టి నిద్రపోనారంభించారు.



సాయంత్రమవుతూవుంది.

ఊర్లో మళ్ళీ ఉద్రిక్తత చోటుచేసుకుంటూ వుందన్న విషయం అర్థమైపోయింది రంగయ్యకి. పోలీసు పికెట్ ఉండటంతో ఎవరూ బాంబులు విసురుకోరు అన్న ధీమా కూడా ఉంది. ఈ పోలీసోళ్ల పుణ్యమా అని ఏమీ జరగకుండా వుంటే మేలు.

కుంటి తిమ్మప్ప ఒక కొత్త విషయం మోసుకుని వచ్చాడు. అది తెలుసుకుని రంగయ్య నివ్వెరపోయాడు. ఆ కొత్త విషయం ఏమిటంటే పోలీసులు వుండడం వల్ల మీరు బతికిపోయినారని హనుమంత రెడ్డి మనుషులు అవతలివాళ్లని అన్నారనీ, దాంతో రోషం పొడుచుకువచ్చి సిద్ధారెడ్డి మనుషులు బాంబులు వేయడానికి సిద్ధమైనారనీ.

"ఈ విషయానికి ఏమన్నారంట పోలీసోళ్లు" అడిగాడు రంగయ్య.

"వాళ్లకెట్ల తెలుస్తుంది అసలు. బాగా తినీ, తాగీ గుర్రుపెట్టి నిద్దరపోతావుంటే పంచాయితీ ఆఫీసులో"

★ ★ ★

"సార్! సార్!! ఊర్లో గలాటా మొదలయిండాది" అంటూ ఓ ముసలివాడు వచ్చి చెప్పేవరకూ హెడ్డుకు మెలకువ రాలేదు.

హెడ్డు లేచిందే తడవుగా తక్కిన పోలీసుల్ని లేపాడు. గబాగబా అందరూ నిద్రమత్తు వదిలించుకుని తుపాకులు తీసుకుని పంచాయితీ ఆఫీసు బయటికి వచ్చారు.

ముసలివాడు తన పని అయిపోయినట్టుగా పంచాయితీ ఆఫీసు వరండాలో బీడీతాగుతూ ఒక మూలలో కూర్చుని ఉన్నాడు.

అప్పటికే పొద్దు మునిగిపోయి వుంది. చీకట్లు నెమ్మదినెమ్మదిగా ముసురుకుంటున్నాయి. కొట్లాట నెమ్మదిగా మొదలవుతూ వుంది. రాళ్ల వర్షం ఒకవర్గం వాళ్లు కురిపించగానే, అవతలి వర్గంవాళ్లు మరింత వేగంగా రాళ్ల వర్షాన్ని కురిపించడం మొదలుపెట్టారు.

"రేయ్! ఎవర్రా అదీ...రాళ్ళు విసురుకుంటావుండేది? ఈడ పోలీసులమున్నామన్న

భయమన్నా లేకుండా" అంటూ గర్జించాడు హెడ్డు కానిస్టేబులు.

ఆ మాటలు వాళ్ళకెవరికీ వినబడేట్టు లేవు. అట్లా రాళ్ళవర్షం వెలిశాక వెంటనే అవతలి వర్గంవాళ్లు బాంబులు వేయడం మొదలుపెట్టారు. ఇవతలి వర్గంవాళ్లేం తక్కువ తినలేదు. వెనువెంటనే బాంబులు విసిరేస్తున్నారు.

బాంబుల మోతతో దద్దరిల్లిపోతూ ఉంది ఊరంతా.

కానిస్టేబుళ్లలో వణుకు ప్రారంభమైంది. రమేష్‌కి వళ్లంతా ఒకటే చెమటలు పట్టేశాయి. ఎప్పుడెప్పుడు అక్కడినించి వెళ్ళిపోదామా అని కాచుకున్నాడు.

అక్కడ పరిస్థితిని చూస్తుంటే పొరపాటున కూడా తమకు అదుపు కాదన్నవిషయం తేలిపోయింది పోలీసులకి.

"సార్! మనం కాల్పులు జరుపుదామా!" అన్నాడు జకరయ్య హెడ్డుతో.

"నీకేమయినా తిక్కపట్టిందా? గాల్లోకి కాల్పులు జరిపితే ఆ బాంబుల చప్పుళ్లలో ఈ తుపాకీ చప్పుళ్లు ఎవరికి వినిపిస్తాయి" అని అంటున్నాడో లేదో వాళ్లకి దగ్గర్లో ఒక బాంబు పడింది.

'ఢాం!!!'

అంతే...

"ఇక్కడ ఉండేది డేంజరరేయ్ పదండి పోదాం మనం ఛస్తే కూడా మాట్లాడిచ్చే దిక్కులేదు" అన్నాడు హెడ్డు.

అట్లా హెడ్డు నోట్లోనించి మాట రావడమే ఆలస్యం అందరూ బ్రిడ్జివైపు వేగంగా పరిగెత్తడం ప్రారంభించారు.

వరండాలోని ముసలోడు నోరు వెళ్ళబెట్టుకుని వాళ్లనే చూస్తున్నాడు.

బాంబుల మోత మరీ ఎక్కువయి దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.

★ ★ ★

పొద్దున్నే రంగయ్య లేచేటప్పటికే కొట్టంబయట పేడనీళ్లు వేస్తూ గంగమ్మ, బోరింగు నించి నీళ్లు తెస్తూ లతా కనిపించారు. కట్ట మీదే కూచుని బీడీ అంటించుకుని వీధి నంతా ఒకసారి పరకాయించి చూశాడు.

ఏడెనిమిదేండ్ల వయసున్న పిల్లలు ఇద్దరు గోలీలు ఆడుతూ వుంటే తక్కిన ఆరుమంది పిల్లలూ వాళ్ల ఆటని గమనిస్తూ ఉన్నారు. వాళ్లు వేసుకున్న చొక్కాలన్నీ ఎక్కడో ఒక చోట చిరిగి వున్నాయి. నిక్కర్లూ అంతే.

అందరూ వంటలకి ఎసర్లు పెట్టినందు వల్ల కొట్టాలలోనించి పొగలు వస్తున్నాయి. అక్కడ అందరూ ఆవేళకే వంట చేసుకుని, తిని, ఇంత చద్దికట్టుకుని కూలికి పోతారు.

ఏడెనిమిది కుటుంబాల వాళ్లు మాత్రం సొంతపొలం వున్నందువల్ల తమ పొలంలో ఏ పనులూ లేనప్పుడు కూలి పనులకి పోతుంటారు. సొంత పొలం వున్న వాళ్లలో రంగయ్య కూడా ఒకడు.

"ఈ పొద్దన్నా అనంతపురానికి పొయిరా కూడదా? మన చేనికి ఆ రైతువారి పట్టా ఒకటీ వస్తే ఆ తనకా బ్యాంక్‌లో ఇంత అప్పు జేయొచ్చు" అంది పేడనీళ్లు చల్లుతూనే గంగమ్మ మొగుడిని ఉద్దేశించి.

"ఊ ఊ" అన్నాడు.

"అన్నిటికీ ఊ ఊ అంటూ ఉండేదే. అన్నీ అర్థాబర్థము జేసేస్తావుండేదే. యా పనీ పూరాజేసేది లేదా... అది మీతాత కొనిండే చేనే... తాత పాయె, తండ్రిపాయె. ఈ కొడుకు ముసలోడు కూడా అయ్యె. ఈ పొద్దుటికీ ఆ అయిదెకరాల చేనికీ పట్టా చేపిచ్చుకోలే. ప్రతి ఏడాది పంట పండకుండా పోతే కరువు దుడ్లు సర్కారు వాళ్లు అందరికీ ఇస్తారు. చేనికి పట్టా లేదని చెప్పి ఒక్క బొట్టన్నా ఇయ్యాలా. ఆ పట్టా కాగితమొక్కటీ తెచ్చుకోని వుండివుంటే ఎట్లో ఒకట్ల ఆ కరువుదుడ్లు మన చేతికి వస్తావుండె కదా!" అంది గంగమ్మ. ఆమెకు చేను గుర్తుకు వచ్చినప్పుడల్లా పట్టా గుర్తుకువస్తుంది. పట్టా గుర్తుకు వచ్చినప్పుడల్లా చేజారిపోయిన కరువు ధనం, బ్యాంకులో తీసుకురాలే





కపోయిన అప్పు గుర్తుకువస్తుంటాయి.

గంగమ్మ మాటలు రంగయ్యకి మామూలే అయినా అందులో ఎంతో నిజం ఉందని తెలుసు.

తన తాత జిల్లేడుకుంట శ్రోత్రియం భూమిని కొన్నాడు. అయితే అప్పట్లో శ్రోత్రియం భూములకు పట్టా తెచ్చుకోవాలంటే నెల్లూరు సెటిల్మెంట్ ఆఫీసులోనే తెచ్చుకోవాల. తన తాతతోపాటూ శ్రోత్రియం భూమిని కొన్నవాళ్లల్లో మాలవాళ్లే కాకుండా మాదిగలూ, బోయ, కురువ, ఈడిగలు ఏభైమందిదాకా వున్నారు. అందరూ కలిసి అప్పట్లో నెల్లూరులోని సెటిల్మెంటు ఆఫీసుకు పోయి రైతువారి పట్టాలకోసం బాగా పోరాడినారు. నెల్లూరులోనే ఉన్న భూషణరావు అన్న అడ్వకేటుకు తమకేసుల్ని అప్పగించి కొంత డబ్బు ఫీజుకింద ముట్టచెప్పి వచ్చారు. అంతేకాదు తమ దగ్గరున్న విక్రయ పత్రాలనూ, భూమిశిస్తు రసీదులనూ అన్నీ అడ్వకేటుకి అందజేశారు. అదంతా జరిగిన ఆర్నెల్లకల్లా భూషణరావు గుండెపోటుతో మరణించాడు. వీళ్ల భూములకి సంబంధించిన పత్రాలూ, శిస్తురశీదులూ ఏమయినాయో ఎవరికీ అర్థంకాలేదు. ఒకసారి రంగయ్య తాత నెల్లూరుకు వెళ్ళి భూషణరావు ఇంట్లో వాకబుచేశాడు. భూషణరావుకి భార్యాబిడ్డలు లేనందువల్ల అతని దాయాదుల పరమైంది మొత్తం ఆస్తి. దాంతో ఏం చేయలేక రంగయ్యతాత తిరిగి వచ్చేశాడు. అక్కడితో రైతువారి పట్టాల విషయమై అందర్లోనూ నిరుత్సాహం ఆవహించింది.

"పట్టా రాకుంటేనేమి? మన భూముల్ని ఎవడు గుంజుకుంటాడురా!" అన్న ధీమా ఆ తర్వాత వాళ్లని నెల్లూరు సెటిల్మెంటు ఆఫీసువైపు వెళ్ళకుండా చేసింది.

రంగయ్య ఒక ఏడాది కిందట అనంతపురానికి లతకోసం పోయినపుడు పేటలో తనతోపాటు చదువుకున్న మిత్రుడు వేణు బస్టాండులో కనిపించాడు. అతను కలెక్టరాఫీసులో పనిచేస్తున్నట్టు మాటల సందర్భంలో చెబుతూ అప్పట్లో నెల్లూరు సెటిల్మెంటు ఆఫీసు తీసివేసి, దానికి సంబంధించిన అన్ని విషయాలూ ఆయా కలెక్టరాఫీసులకి మార్చినారని, ఇప్పుడు సంయుక్త కలెక్టరే సెటిల్మెంటు ఆఫీసరుగా కూడా వుంటాడని చెప్పాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు అనిపించింది రంగయ్యకి. తన భూమి విషయం అంతా ఏకరువు పెట్టాడు వేణుతో. "ఏం ఫర్వాలేదురా, తప్పక రైత్వారీ పట్టా అవుతుంది" అన్నాడు వేణు.

తమకు పట్టాలు మంజూరు అయినట్లేనని ఊర్లోని రైతులందరికీ చెప్పాడు రంగయ్య.

ఆ మరుసటిరోజే కలెక్టరుకు అర్జీ రాసుకుని రైతులందరితో సంతకాలు చేయించి శ్రద్ధగా దగ్గరుండి ఇచ్చి వచ్చారు, వెంటనే రైతువారి పట్టాలు మంజూరు చేయమని. ఆ మరుసటి రోజు మధ్యాహ్నంనుండి ఎదురుచూస్తూనే ఉన్నారు. ఏరోజు అయినా తమకు పట్టాలు మంజూరు చేస్తున్నట్టు ఉత్తర్వులు వచ్చేస్తాయని.

ఎంతకీ పట్టాలు రాకపోయేసరికి వారం కిందట ఏభై మంది రైతులూ మళ్ళీ అనంతపురానికి పోయి అర్జీ ఇచ్చారు. సరిగ్గా అప్పుడు కనిపించాడు వేణు. "మీరు ఇట్లా భూమిపట్టాల కోసం ఎన్నిసార్లు అర్జీలు ఇస్తారు. మీవి అసైండు భూములు కాదు, మాకు పట్టాలు ఇవ్వండి అని అర్జీ పెడితే వెంటనే మంజూరు చేసి ఇచ్చేదానికి. మీవి కొన్నభూములు. వాటికి రైతువారి పట్టా మంజూరు చేసేదానికి చట్టం ఒకటి ఉంది. మీ విక్రయ పత్రాలూ, పన్నుకట్టిన రసీదులూ దాఖలుచేసుకుని మీ హక్కూ, అనుభవం రుజువు చేసుకుంటే మీ పేరిట రైత్వారీపట్టా మంజూరు అవుతుంది" అంటూ చెప్పాడు వేణు. విక్రయ పత్రాలు లేనివాళ్లు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసులో నకళ్లు కోరితే సరి



అని సలహా కూడా ఇచ్చాడు అతను.

★ ★ ★

అప్పటికే చీకటి పడుతూ వుంది.

పడమటి ఆకాశంలో ఉన్న మబ్బుతునకలు అప్పటికింకా కాషాయరంగును వీడలేదు.

కొంగలు బారులుతీరి ఆకాశంలో చెరువు వైపు వెళ్ళి పోతున్నాయి.

వేమారెడ్డి గడ్డిదొడ్డి వాళ్ల ఇంటి వెనకాల కొద్దిదూరంలో ఉంది. అతి పెద్దదయిన గడ్డివాములున్న దొడ్లలో వేమారెడ్డి గడ్డివామి ఒకటి.

గడ్డి వామిలోంచి వేరుశెనగపొట్టును లిక్కితో పెద్ద జల్ల (గంప)లోకి తోడుతూ వున్నాడు నల్లప్ప. ప్రతి సాయంత్రం అతను చేసేపని అదే. పొద్దు ఉన్నప్పుడే ఎద్దుల్ని తోలుకుపోయి ఏట్లో కడుక్కునిరావడం, ఇంటికి వస్తూనే వాటిని గాటిపట్లకి కట్టేసి పొట్టు జల్లని గడ్డివామిలో నింపుకుని ఆ ఎద్దులకి మేతవేయడం. ఇదీ అతని సాయంత్రకార్యక్రమం.

నల్లప్ప నల్లగా ఉంటాడు. వయసు ఇరవై ఐదు దాటి ఉంటాయి. చిన్నప్పటినించి కాయకష్టం చేసిన శరీరమయినందువల్ల, కండలు తిరిగి చమట పట్టడంవల్ల నిగనిగ మంటూ మెరుస్తూ ఉన్నాయి. పొట్టమీద బిగుసుకుపోయిన కండరాల నొక్కులు నేర్పు కలిగిన శిల్పి చెక్కినట్టు ఉన్నాయి. నూనూగు మీసకట్టు. వంకీలు తిరిగిన జుల పాల జుట్టు. దాన్ని బంధిస్తూ మాసిపో యిన తెల్లటి వల్లి అతనిలోని యౌవ్వనాన్ని మరింత ఎక్కువ చేస్తున్నట్టు ఉంటుంది. నల్లప్ప నల్లటి మొగంలో తెల్లటి కళ్లు. నల్లటి బండ పెదవులు. నవ్వితే బయట పడే చక్కటి పలువరస. అతన్ని చూస్తే పిల్లోడు అంటే ఇట్లానే ఉండాలి అనిపి స్తుంది ఎవరికైనా.

ఈ పాటికి అతను జల్లలోకి పొట్టుతోడి వుంటే ఎప్పుడో నిండిపోయివుండేది. అయితే అతను పొట్టుతోడే సాకుతో అక్కడ వున్నాడని తెలుస్తుంది కొంచెం గమనిస్తేగ నుక. రెండుసార్లు లిక్కితో పొట్టును తోడడం. వెనక్కి తిరిగి చూడటం. రెండు సార్లు మళ్లీ తోడడం అటూఇటూ చూడటం. ఎవరన్నా తన వెనకాల వస్తున్నారేమోనని అడుగుల సడి వినడం.

అతని చూపుల వెతుకులాట తనకోసరమే నని పార్వతికి మాత్రమే తెలుసు.

"ఏయ్ దొంగా... నా కోసరమేనా నీ దొంగచూపులూ" అంటూ నల్లప్పని వెనక నుంచి చప్పుడు కాకుండా వచ్చి వాటేసు కుంది పార్వతి.

ఆమె స్పర్శకు పరవశించాడు నల్లప్ప. అయితే తను అంతసేపు అనుభవించింది ఎంత నరకం!

"నువ్వు వస్తావని రోజూ నేను ఈడ బయపడుకుంటా ఎదురుచూసేది పొట్టు జల్లనింపే సాకుతో" అంటున్న నల్లప్ప గొంతులో ఎంత అదురు వుందో పార్వతి గమనించకపోలేదు.

నల్లప్పది ఒక చిత్రమైన పరిస్థితి! పార్వతి వచ్చేదాకా రాలేదే ఇంకా రాలేదే ఇంకా రాదో ఏమో అనీ, తీరా వచ్చాక ఎందుకు వచ్చిందా, ఎవరన్నా చూస్తే తన ప్రాణాలు గాల్లో కలిసిపోవా అనిపిస్తూ వుంటుంది.

"ఎట్లో ఇంట్లో వాళ్ల కండ్లు కప్పి వచ్చి నాను లేరా" అంటూ నల్లప్పని మరింత గట్టిగా వాటేసుకున్నది.

పార్వతి పెద్ద అందగత్తె కాదుకానీ, గొప్పింటి పిల్లకావడం, అందులోనూ చదువు కున్న పిల్ల కావడంతో మాటల్లోనూ, నవ్వు ల్లోనూ, ముద్దులు మూటకట్టే పెదవుల్ని తిప్పడంలోనూ, తన పెద్దపెద్ద కళ్లతో చూపుల వల విసిరే నేర్పు వుండడంలోనూ ఆమె గొప్ప సౌందర్యరాశిగా అనిపిస్తుంది. నల్లప్పకయితే ఇంక దేవతా స్త్రీమాదిరే అని పిస్తూవుంటుంది. ఎప్పుడూ లంగా, వోణీతో ఉండే ఆ పిల్ల మాదిరి మాలగేర్లోనే ఎవురూ లేరని అతని అభిప్రాయం.

నల్లప్ప తన పదహారవ ఏటనించీ వేమా రెడ్డి ఇంట్లో జీతానికి ఉన్నాడు. పార్వతిని ఏడేళ్లవయసునించీ చూస్తూనే వున్నాడు. అయితే పార్వతి ఎప్పుడైతే పైటలు వేయడం మొదలుపెట్టిందో అప్పటినించి ఆమెవైపు కన్నెత్తి చూసేవాడు కాదు అతను. అనంతపురంలో పదవ తరగతి అయిపోతూనే ఆడపిల్లకి ఎక్కువ చదువు మంచిదికాదని ఇంటికి తీసుకొచ్చేశాడు వేమారెడ్డి. వెంటనే ఆ పిల్లకి పెండ్లి చేసే యాలని చాలా తాపత్రయపడ్డాడు కూడా. ఎందుకోగానీ ఆరేడు సంబంధాలు వచ్చినా అవి కుదరలేదు.

తన కళ్లముందరే కండలు తిరిగిన యువకుడు తిరగడం చూస్తూ వుంది పార్వతి. అతని కులం తక్కువదని తెలుసు. అది అంటరాని కులం అని తెలుసు. అయినా అతన్ని పలకరించమని వయసు తరుముతూ వుంది. తనవైపు పొరపాటున కూడా కన్నెత్తిచూడని అతన్ని ఆకట్టుకోమని




మనసు ఊరిస్తూవుంది. అందుకే అనవస రంగానే అతన్ని పలుకరించింది. పెద్ద అవ సరమున్నట్టు ఏదో ఒక పనిని కల్పించి చెప్పింది. అయినా అతను ఎంతో విన యంగా దించిన తల ఎత్తకుండా సమాధా నమిస్తాడు. చెప్పిన పని చక్కగా చేస్తాడు.

దాదాపు మూడు నెలలు అతన్ని ఏదో ఒక విధంగా వెంటాడింది. మాటలతో వేటా డింది. చేతలతో వేధించింది.

అయినా నల్లప్ప భయం నల్లప్పది. ఎక్కడ ఎవరు చూస్తారో ఏం చేస్తారో. ప్రాణమే తీయవచ్చు లేదా కీళ్లు విరిచేయ వచ్చు.

చివరికి ఒకనాడు సందెవేళ నల్లప్ప ఏటి నించి ఎద్దుల్ని తోలుకొని వచ్చి గాటిపట్లకు కట్టేస్తున్న సమయంలో.

పార్వతి గట్టిగానే చెబుతోంది. "కరెంటు పోయిందిరా నల్లప్పా! అంగడికి పోయి అగ్గి పెట్టె కొనక్కరా.పో"

"వస్తున్నానమ్మా" అంటూనే ఎద్దు మెడకి తలుగు తగిలిస్తూ వున్నాడు. అగ్గిపెట్టె తెచ్చేందుకు డబ్బులు ఇచ్చే నెపంతో నల్ల ప్పకి చాలా దగ్గరగా వచ్చి నిలబడింది. వెనక్కి జరగబోయాడు అతను. కదలనీయ కుండా నల్లప్ప చేతిని వడిసిపట్టుకుంది పార్వతి. షాక్ తిన్నట్టు బిత్తరపోయి చూశాడు అతను. పార్వతి కళ్లల్లోకి నేరుగా అతను చూసింది నిజానికి అప్పుడే. పశు వుల కొట్టంలో మసక వెలుతుర్లో ఆమె మొగం అతనికి ఏదో అద్భుతంగా అనిపిం చింది. అదే అదనుగా అతన్ని కరుచుకు పోయి "నువ్వంటే నాకెందుకో ఇష్టంరా నల్లప్పా!" అంది పార్వతి.

ఆ పిల్ల చర్యకు బిగదీసుకుపోయి శిల మాదిరి అయిపోయాడు నల్లప్ప. 'తను కల కంటున్నాడా లేక నిజమంతా కలయ్యిందా? రెడ్డోల్ల పిల్ల తనని ఇష్టపడతావుందా? అమ్మయ్యో ఇది ఎవురికన్నా తెలిస్తే ఎట్లా?' అనుకున్నాడు.

"గడ్డివామి దగ్గర ఉంటా... నువ్వు ఎట్లా ఆడికి వస్తావు కదా! ఆడే మాట్లాడుకుందాం" అంది పార్వతి అక్కడినించి వెళ్ళిపోతూ. మెల్లగా కదలిక వచ్చింది నల్లప్పలో.

దడదడలాడుతున్న గుండెలతో యాంత్రి కంగా పొట్టు జల్ల తీసుకుని గడ్డివామివైపు అడుగులేశాడు. అందాకా జరిగిన సంఘటన నించి తేరుకోలేకపోతున్నాడు.

అతను గడ్డివామి చేరేటప్పటికి అక్కడే వున్న చింతచెట్టు కింద కూచుని ఉంది పార్వతి. వరిగడ్డి వామికి ముందు జొన్న చొప్ప వామి ఉండటంవల్ల చెట్టుకింద ఉన్న మనుషులు కనబడరు.

ఆమె పక్కనే కూచున్నాడు నల్లప్ప. అతన్ని తన ఒళ్లోకి లాక్కోబోయింది పార్వతి. భయపడి లేచి నిలబడ్డాడు అతను. తను ఎందుకు భయపడుతున్నదీ చెప్పాడు. ఇదంతా తెలిసిందంటే తన ప్రాణాలు తీస్తారని చెప్పాడు.

అన్నీ విన్నాక "ఎవురికీ తెలీదు లేరా! మనిషి చూస్తే పులి మాదిరి ఉండావు. మాటలు చూస్తే పిల్లిమాదిరి 'మ్యావ్ మ్యావ్' మంటూ ఉండాయి. సిగ్గులేదా? కన్నెపిల్ల నీకోసం వచ్చి కాచుకోనుంటే ఆడం గలోని మాదిరి ఏందేందో చెప్తావుండావే" అంటూ నల్లప్పని ఉడికించింది పార్వతి. అతనికి లేని ధైర్యాన్ని మాటలతో నూరిపో సింది.

అసలే వయసులో ఉన్న పిల్లోడు...

పార్వతి దగ్గరకొచ్చి నిలబడుతూనే అల్లు కుపోయినాడు. ముద్దులతో పార్వతిని ముంచెత్తినాడు. పార్వతి ఆశించిన దాని కంటే ఎక్కువ ఉక్కిరిబిక్కిరి అయిపో యింది. కాసేపు ఈ లోకాన్ని మరిచిపోయి నారు.

గత ఆరు నెలలుగా ఇదీ వాళ్లిద్దరి పరి స్థితి.

దినదినగండం నూరేళ్ల ఆయుష్షు మాదిరి వుంది నల్లప్పకి. ఏ క్షణాన్నయినా, ఎవర



యినా తమన్ని చూడవచ్చు. అదే జరిగితే ఇక అంతే తన పని...

★ ★ ★

మాదిగ గేరి అంతా కోలాహలంగా వుంది.

గేరి మధ్యలో ఉన్న మారెమ్మ గుడి పక్కనే ఉన్న కొట్టానికి రంగురంగుల కాగితాలు అంటించి బాగా ముస్తాబు చేశారు. పేటనించి తెప్పించి షామియానా వేశారు. పెద్ద బోర్డుమీద నల్లటి పెయింట్ పూసి దానిమీద గుండ్రంగా 'మాదిగ దండోరా కార్యాలయం' అంటూ రాయించారు. ఆవరణ అంతా పేడతో అలికి ముగ్గులు పెట్టి ఆ ముగ్గుల్లో రంగులు అద్దారు.

ఆ రోజు ఎవరూ కూలికి పోరాదనీ, మాదిగలందరికీ ఎంతో ముఖ్యమైన దినమనీ, అంబేద్కర్ జయంతి సందర్భంగా మాదిగలంతా ఒకే మాట మీద నిలబడి, ఒకే బాటలో ప్రయాణించాలనీ అంతకు ముందు రోజు రాత్రే పెద్దన్న పదిమంది యువకులతో పాటు ఇంటింటికీ పోయి చెప్పి వచ్చాడు.

అందుకే ఎవరూ కూలికి పోలేదు ఆ రోజు. మగవాళ్లంతా మారెమ్మ గుడికట్ట మీద కొందరూ, ధ్వజస్తంభం కట్టమీద కొందరు కూచుంటే మరికొందరు మాదిగ దండోరా ఆఫీసు ముందరే వేసి వున్న షామియానా కింద వున్న కుర్చీలలో కూచున్నారు.

"ఇంకా ఏమిటికి ఆలస్సెము తొందరగా ఆఫీసు తెరవండి! అమిటిపొద్దు మీరిపాయె" అన్నాడు ఒక ముసిలాయన. గోచీకంటే కొంచెం ఎక్కువ వున్న గుడ్డను గోచిపంచె మాదిరి కట్టుకున్నాడు. అతని గడ్డం, మీసాలు పూర్తిగా నెరిసిపోయి వున్నాయి. అతను నవ్వితే శిథిలమైపోయిన కోట బురుజుల్లాగా దవడన కింద రెండూ, పైన రెండూ ఉన్నాయి పళ్లు.

"ఈ ముసిలోనికి సూడరా! లడ్డు తినాలని ఎంత ఆత్రమయిందో. ఆఫీసు తెరిసేది అంటే ఏమనుకోనిండాడో. ఊరికే తలుపులూ, కిటికీలూ తెరిసేది అనుకుండాడేమో. ఇగ్గో తాతా! నువ్వు, నేను ఈ ఆఫీసు తెరీగూడదు. ఈ పొద్దు మొదటి రోజు కదా. కృష్ణారావు మాదిగ అనే గొప్పాయన ఉండాడు. ఆయప్ప మన రాష్ట్రంలోని మాదిగ దండోరా సంఘానికి పెద్ద అంటే ప్రెసిడెంటు అన్నమాట. అట్లా ఆయప్ప ఇప్పుడు అనంతపురాన్నించీ జీపులో ఈటికొస్తాడు. ఈడ మీటింగు పెట్టి మనందరికీ ఈ ఆఫీసు ఏమిటికి తెరుస్తావుండారో చెప్తాడు. అప్పుడు మీటింగ్ అయినాక లడ్డు పంచుతాము" అన్నాడు వీరన్న అనే యువకుడు.

"అట్లనా ఈరిగా! నాకు తెల్దులే నాయనా! ఇగ్గో ఒగమాట... నాకు పెద్దోన్నని లడ్డు ఎట్లా ఇస్తారు గానీ, అప్పయ్యప్పయ్యా! ఇగ్గో ఆడ ఆడుకుంటావుండారే నా బిడ్డ కొడుకులు ఇద్దరూ ఆ పక్కనే నా కొడుక్కొడుకులు ముగ్గురూ ఆనాయాండ్లకి లడ్డు ఇచ్చేది మర్చిపోవద్దంద్రప్పా!" అంటూ ముసిలాడు సానునయంగా చెప్పాడు.

"అబ్బ! ఈ ముసిలోనిది ఎంత సోర్తం జూడీ" అనుకుంటూ నవ్వుకుని ఈ గేర్లో నీ మనమండ్లకే కాదు, ఎవుర్నీ పిల్లాకంత మనిషిని కూడా ఇడిసిపెట్టేది లేదులే తాతా! అందరికీ పంచుతాం లడ్డు" అంటూ నవ్వుకుంటూ అక్కడినించి కదిలాడు.

ముసిలోడు చాన్నాళ్ల తర్వాత తను తినబోయే లడ్డును ఊహించుకుని నోట్లో లాలాజలం ఊరగా, తృప్తిగా గుటక వేశాడు.

మీటింగుకి అవసరమయ్యే టేబుళ్లూ, కుర్చీలు ఊర్లోని ఎలిమెంటరీ స్కూలునించి హెడ్మాస్టర్ని అడిగి తీసుకువచ్చాడు పెద్దన్న.

★ ★ ★

మాలగేర్లోనించి జీపు వస్తుంటే నల్లప్ప కుంటి తిమ్మప్పలు ఆ జీపులో ఉండేది కృష్ణారావు మాదిగేనన్న విషయాన్ని పసిక





ట్టారు. అంతే ఉరుకుల పరుగులమీద జీపుని వెంబడించారు.

పది గంటలు అవుతుంటే జీపు మారెమ్మ గుడి ముందర ఆగింది. పిల్లాపెద్దా, ముసలీముతకా అంతా జీపుని చుట్టేశారు.

కృష్ణారావు మాదిగ జీపులోంచి దిగుతూనే వినయంగా చిరునవ్వుతో అందరికీ నమస్కరించాడు.

అప్పటికే తెచ్చి పెట్టుకున్న లిల్లీపూల దండలు వేశారు వీరన్న, పెద్దన్నలు.

అప్పుడు చేరుకున్నారు నల్లప్ప, కుంటి తిమ్మప్పలు అక్కడికి. కార్యాలయాన్ని ఆవిష్కరించాడు కృష్ణారావు మాదిగ.

అయిదు నిమిషాల్లో సభ ప్రారంభమయింది.

అప్పుడు వచ్చాడు ఓబిళేసు. నిజానికి ఓబిళేసు మీటింగు కోసరం రాలేదు. పొద్దు మీరిపోయిందికదా ఇంట్లో బువ్వన్నా తిందామనుకొని వచ్చాడు. ఇంటికి తలుపువేసి ఉండడంతో మీటింగ్‌కి రాక తప్పింది కాదు.

కృష్ణారావు మాదిగ ఉపన్యాసం మొదలయింది. మాదిగ దండోరా ఉద్యమం ఎట్లా ఆవిర్భవించింది. దానికి గల చారిత్రక సందర్భం అన్నీ మెల్లమెల్లగా సాగిపోతున్నదల్లా ఉన్నట్టుండి అక్కడున్న యువతనంతా ఊపేసే స్థాయికి చేరుకుంది. మాదిగ దండోరా లక్ష్యాలను అతను చెబుతుంటే అందరూ చప్పట్లు చరిచారు. ఎప్పటికైనా ఏబీసీడీలు సాధించి తీరుతాం. మాదిగల సత్తా ఏమిటో చూపిస్తాం. అంటూ ఉంటే మళ్లీ అంతటా కరతాళ ధ్వనులు... మనము ఎవ్వరికీ తీసిపోము, మాదిగలే ఈ దేశచరిత్రను తిరగరాసేది అంటూ ఉపన్యాసాన్ని ముగించాడు కృష్ణారావు మాదిగ. ఈసారి చప్పట్లే కాదు ఈలలు కూడా యువతరం నించి వచ్చాయి. ఓబుళేసుకు భలే నచ్చాయి ఆ మాటలు.

నల్లప్ప, కుంటి తిమ్మప్పలు ఒకరి మొగాలు ఒకరు చూసుకున్నారు. అక్కడ ఉన్న యువకులు కొందరు "ఈ మాలోళ్లకు ఇక్కడ ఏమి పనో" అన్నట్టుగా వాళ్లిద్దర్నీ చూస్తున్నారు.

కృష్ణారావు మాదిగతోపాటు వచ్చిన జిల్లా నాయకులు డేవిడ్ మాదిగ, శ్రీనివాస్ మాదిగ, సుధాకర్‌లు కూడా మాదిగ దండోరా పుట్టుక గురించి దాన్ని విజయవంతం చేయాలంటే మాదిగలు ఎట్లాంటి త్యాగాలు చేయాల్సి ఉంటుంది అన్న విషయం మీదే తిరగేసి మరగేసి అదే విషయాన్ని మాట్లాడారు. అంతటితో ఊరుకోలేదు అందరూ చెప్పిన విషయంలో మరొకటి వుంది. అదేమిటంటే మాదిగలకు ముందునించి అన్యాయం చేస్తున్నది మాలలే అన్నది.

ఆ విషయం వచ్చినప్పుడల్లా నల్లప్ప, కుంటితిమ్మప్పలు చాలా ఇబ్బందిపడుతూ ఉన్నారు. పైగా ఆ మాటను సహించలేకపోతున్నారు.

మీటింగ్ అయిపోయాక అందరికీ లడ్డులు పంచుతుండగా, మెల్లగా నల్లప్ప, కుంటితిమ్మప్ప జారుకున్నారు అక్కడినించి.

ఇదంతా గమనిస్తూ ఉన్న వీరన్న పక్కనే ఉన్న తిరుపాలుతో అన్నాడు, "ఈ నాయాండ్లకి ఈ పొద్దు రాత్రికి నిద్దరరాదు"

"ఎందుకు మనమంతా లడ్డు తింటుండా మనా?" అన్నాడు తిరుపాలు అమాయకంగా మొగంపెట్టి.

"ఎంత తిక్కలంజికొడుకు రా నువ్వు. నీకెప్పుడు తిండేరా"

"మరేందో చెప్పువాయ్.. ఊరికే తిట్టేదొకటీ వచ్చు ఈనా కొడుక్కి"

"అది కాదురా. మనం మాదిగ దండోరా సంఘం పెట్టకుండామా. అంత మాత్రం సంఘం మాకులేదే అననీ, నిద్రరాదని చెప్తున్నాను" అంటూ వివరించాడు వీరన్న.

"దానిదేముందీ ఈడ జూసినారుకదా! ఆడ పోయి ఆలోచన చేస్తారు. రేపోమాపో మాల మహానాడు కార్యాలయాన్ని తెరు

స్తారు" అన్నాడు తిరుపాలు.

"ఏంది... మాలోల్లు... సంఘం పెట్టు కుంటారు..." అంటూ బీడీని ఒక దమ్ము లాగి పొగను గాల్లోకి ఊదుతూ "అబద్ధం రారేయ్! మాలోడు అంటే ఏమనుకుండా వురా. మా నాయన ఎప్పుడూ అంటావుం టాడు మాలోని తెలివి అంటే అది నక్క తెలివే అని. అందుకే సామెతవుంది జూడి మాదిగోన్ని మాట్లాడిచ్చి కొట్టల్లంట, మాలోన్ని మాట్లాడియ్యకనే కొట్టల్లంట. వాన్ని ఒక మాట మాట్లాడిచ్చినామా 150 కథలు చెప్తాడు. అంత తెలివి ఉందికాబట్టే ఈ పొద్దు ఈ ఏబీసీడీ వర్గీకరణ వద్దంటా వుండేది. లేకుంటే ఎట్లా నాయాళ్లన్నా వద్దం టారా? అట్లా ఏబీసీడీలు లేకపోతే మాది గోళ్ల ఉద్యోగాలన్నీ వాళ్లే కొట్టేయవచ్చని"

"అట్టనా నాకివన్నీ తెలనే తెల్దుకదలే. నువ్వు పదిదంకా చదువుకుండావు కాబట్టే ఎన్ని విషయాలు తెల్సురా. అదే నేను జూడీ ఏబీసీడీల కోసం పోరాడేది అంటే అ ఆ ఇ ఈలను వద్దంటారేమో అనుకున్నా చాన్నాళ్లు" అన్నాడు అమాయకంగా మొగం పెట్టి.

"ఇంకా మేలులేరా మాదిగదండోరా అంటే దండోరా ఏసేవాళ్లే అందులో ఉండారన లేదు" అన్నాడు నవ్వుతూ వీరన్న.

★ ★ ★

మరో రెండు రోజులకు లతకు యూనివ ర్సిటీలో క్లాసులు మొదలవుతాయి.

రంగయ్య పేటకి పోయాడు. గంగమ్మ కూలికిపోయింది. ఇంట్లో లత ఒక్కతే ఉండి పోయింది. అందుకే ఏం చేయాలో పాలు పోవడంలేదు. పాత పత్రిక ఏదో దొరికితే దాన్నే శ్రద్ధగా చదువుతూ కూచుంది.

నల్లప్ప, కుంటి తిమ్మప్పలు మాదిగ గేరి నించి వచ్చి రంగయ్య ఇంటిముందు మాట్లా డుకుంటూ నిలుచున్నారు.

"ఉండు చిన్నాయనా నీళ్లు దప్పికగొ న్నాను. లతమ్మ నడిగితే ఇన్ని చన్నీళ్లు ఇస్తాంది" అంటూనే "బుజ్జమ్మా! ఇన్ని నీళ్లు ఇయ్యి తల్లి!" అడిగాడు నల్లప్ప. కొట్టం బయటేవున్న వేపచెట్టు నీడలో కూచున్నారు ఇద్దరూ.

నీళ్లు తెచ్చి ఇచ్చింది లత.

ఎక్కడినించి వస్తున్నారని అడిగింది లత. అంతా చెప్పుకొచ్చాడు నల్లప్ప.

"మంచిదే కదా బావా! మాదిగ దండోరా కార్యాలయాన్ని తెరిసేది" అంది లత.

"ఈ మాదిగ దండోరా ఏందో, ఆ మాల మహానాడు ఏందో. లతమ్మా! నాకయితే గోడ అడ్డం పెట్టినట్లే వుందమ్మా" అన్నాడు కుంటి తిమ్మప్ప.

కారంచేడు, నీరుకొండ, చుండూరులలో దళితులపై అగ్రవర్ణాల భూస్వాములు జరి పిన దాడులవల్ల దళితులంతా ఒక్కటయినా రనీ, దాంతో దళిత ఉద్యమం మొదలయిం దని... దళితులంటే మాల, మాదిగలే. ఈ రెండు కులాలు కలిసి అగ్రవర్ణ దురాగతా లను ఎదిరించవచ్చుననే ధైర్యమొచ్చిందనీ, ఒక దశలో మాల, మాదిగల మధ్య పెండ్లిల్లు కూడా జరిగాయనీ, అయితే మాల వాళ్లు రిజర్వేషను సదుపాయాన్ని ఎక్కువగా ఉపయోగించుకుంటున్నారన్న పాయింటుతో మాదిగ దండోరా ఉద్యమం మొదలయి ఏబీసీడీలుగా వర్గీకరణ జరగాలని దండోరా నాయకులు పట్టుపట్టారనీ, దీన్ని వ్యతిరే కిస్తూ ఏబీసీడీల వర్గీకరణ సరయింది కాదనే ఉద్యమం మాలల్లో మొదలయింది. దాని పేరే మాలమహానాడు అంటూ వివ రించింది లత.

"అయితే బుజ్జమ్మా! మనం మాలమహా నాడు కార్యాలయాన్ని మొదలుపెడదాం" అన్నాడు ఉత్సాహంగా నల్లప్ప.

"ఈ విషయంలో మాదిగ వాళ్లకున్నంత పట్టు మన వాళ్లకి లేదులే బావా? నిజానికి మనవాళ్లు ఉద్యోగాల విషయంలో మాది గలు అనుకున్నంత గొప్ప స్థాయికి ఎవరూ




# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:
**చతుర**
'ఈనాడు' కాంపౌండ్,
హైదరాబాద్ 500 482.






**ఈ** శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్త పడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

అక్టోబర్ చతుర నవల కక్షశిల

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

పోలేదు. అంత తీరని అన్యాయం ఏదీ జరగలేదు. చూద్దాం ప్రభుత్వం ఏమి నిర్ణయిస్తుందో. వాళ్లలో నాకు బాగా కనిపించేది ఏమిటంటే తమిళ పులుల్లో అంటే ఎల్‌టిటిఇ వారికున్న తెగింపు, పట్టుదల కనబడుతుంది. ఏబీసీడీల వర్గీకరణ విషయంలో చాలామంది ప్రాణత్యాగం చేయడానికి కూడా సిద్ధపడ్డారు. మనవాళ్లు ఎప్పుడు చేస్తారు చెప్పు అట్లాంటి త్యాగాలు? మనదంతా పచ్చగున్న చోట తిని, వెచ్చగున్న చోట నిద్దరపోవడమే"

మాదిగలకంటే తన కులాన్ని తక్కువ చేస్తే ఎప్పుడూ ఒప్పుకోలేని నల్లప్ప "అట్లేమీ కాదు బుజ్జమ్మా! నేను ఒప్పుకోను. మన వాళ్లు ఎట్లా త్యాగాలు చేయడానికైనా వెనుదీయరు" అన్నాడు.

"ఎట్లా? వేమారెడ్డి గొంచికాని ఇంట్లో జీతం మానేశా? " అంది లత వస్తున్న నవ్వును ఆపుకుంటూ.

"నీకన్నీ అంతేలే బుజ్జమ్మా! నగుతావు. మాదిగోళ్లకంటే మనోళ్లే ఎక్కువ త్యాగం చేస్తారంతే" అంటూ తన మొండివాదనని కొనసాగించాడు నల్లప్ప.

"నువ్వు ఊరికే వాదించద్దురా! ఆ పాప బాగా సదువుకునిండే పిల్ల. పట్నంలో ఇట్లాటివన్నీ ఎన్ని జూసిందో" అంటూ బీడీ అంటించుకున్నాడు కుంటి తిమ్మప్ప.

నల్లప్పకి లత అంటే చాలా ఇష్టం. అందరి మాదిరి 'లతమ్మా' అని కూడా పిలవడు 'బుజ్జమ్మా!' అంటూనే పిలుస్తుంటాడు. లత కూడా తను పోస్టుగ్రాడ్యుయేషన్‌లో చేరినా అతన్ని బావా అంటూ పిలుస్తుంది. అతని అమాయకపు వాదనలో నిజాయితీ కనిపిస్తుంది ఆమెకు.

"నువ్వు మొండిగా మాట్లాడద్దు బావా! మాలకీ, మాదిగకీ జీవన విధానంలోనే తేడా వుంది. మాలవాళ్లు మనరాష్ట్రంలో ఎక్కడ ఉన్నా ఒకే కులవృత్తి కలిగి వున్నారా అనడిగితే లేదనే చెప్పుకోవాలి. కొన్ని చోట్ల నేత పని చేస్తారు. కొన్నిచోట్ల గంపలూ, తడికెలూ అల్లుతారు. కొన్ని చోట్ల ఇండ్లు కడతారు, మరికొన్ని చోట్ల వ్యవసాయ కూలి పనులు చేస్తారు. ఇట్లా ఒక వృత్తి అంటూ మన కులానికి వుందా? పొట్టపోసుకోనికి ఏదో ఒక పని చేస్తుండడంవల్ల అది వంశ పారంపర్యంగా కొనసాగదు. కేవలం బతుకు తెరువే ముఖ్యమవడంతో ఎవరి తెలివికొద్దీ వాళ్లు బతకడం నేర్చుకొన్నారు. అదే మన అనైక్యతకి దారి తీసింది. మరి మాదిగవాళ్లకు అట్లాకాదు. చెప్పులు కుట్టడం, డప్పుకొట్టడం వాళ్ల ప్రధానవృత్తిగా వుంది. ఆంధ్రదేశంలో ఉన్న మాదిగలందరూ ఆ పనులే చేస్తారు. ఇప్పుడిప్పుడు కొందరు ఇతర ఉద్యోగాల్లో ఉండి ఉండవచ్చు అది వేరే సంగతి. వృత్తిపట్ల ఉన్న ఐక్యత కూడా వాళ్లని ఏకం చేసింది. అందుకే వాళ్లు మాదిగదండోరా ఉద్యమాన్ని అంత పటిష్టంగా నిర్మించుకున్నారు.

"నువ్వు జెప్పిండేదాంట్లో శానా నిజముందనిపిస్తాందమ్మా" అన్నాడు కుంటి తిమ్మడు బీడీ పొగ వదుల్తూ.

నల్లప్పకి లత మాటలు నచ్చలేదు. లేచి నిలుచున్నాడు "ఎద్దులకీ గడ్డి ఎయ్యాల. బుజ్జమ్మా వస్తా" అని చెప్పేసి అక్కడనించి వెళ్లిపోయాడు.

నల్లప్ప వెళ్లినవైపే చూస్తూ వుండిపోయింది లత.



హనుమంతరెడ్డి ఇంటి ఆవరణలో గన్‌మేన్‌లు ఇద్దరు చెట్టుకింద సిగరెట్ తాగుతూ ఉన్నారు. వాళ్ల గురించి అటు హనుమంతరెడ్డిగానీ అతని కొడుకు నారపరెడ్డిగాని పట్టించుకోరు. చూసి చూడనట్టు ఉండిపోతారు.

అక్కడికి కొంచెం దూరంలో ఉన్న గదిలో హనుమంతరెడ్డి, నారపరెడ్డితోపాటు వాళ్ల అతి దగ్గర బంధువూ, నారపరెడ్డికి బావ అయిన వేమారెడ్డి సమావేశమై సీరియస్‌గా

మాట్లాడుకుంటున్నారు.

వరండా మెట్ల దగ్గరే కూచుని అంతదాకా మాదిగ గేర్లో జరిగిన దండోరా మీటింగు విషయాన్నే ఆలోచిస్తూ వున్నాడు ఓబుళేసు. అక్కడికి వచ్చినవాళ్లకి ఎన్ని విషయాలు తెలుసు? ఇన్నాళ్లు తను పుట్టింది కేవలం గొంచికాళ్లకాడ జీతగాడిగా ఉండేందుకనే అనుకున్నాడు. పెద్ద కులమోళ్లంతా తమని హీనంగా చూడటం అతి మామూలు విషయంగా అనుకున్నాడు. అయితే ఈ పొద్దు తెలిసింది ఇదంతా పెద్ద కులమోళ్లు చేసిన కుట్ర అని. అయినా తనేం చేయగలడు? ఈ ఊబిలోనించి ఎట్ల బయటపడగలడు?

"రేయ్! ఓబిళేసూ!" అంటూ లోపల్నించి హనుమంతరెడ్డి వేసిన కేకకి ఉలిక్కిపడిలేచాడు.

"వత్తున్నా గొంచికాడా!" అంటూ వెళ్లాడు.

వాళ్లు వున్న గది బయటే హనుమంతరెడ్డికి కనబడేలా నిలబడ్డాడు. ఆ నిలబడడంలో వినయం ఉంది. విధేయత ఉంది. అణగారినతనం ఉంది.

"యేరా! మీ మాదిగ్గేర్లో ఏందో మీటింగు జరిగిందంట గదవాయ్" అన్నాడు వేమారెడ్డి.

"అవును గొంచికాడా! మాదిగ దండోరా అనే సంగం మన రాట్రంలో ఉందికదా గొంచికాడా! దాని ఆఫీసుని ఒకటి మా మాదిగ్గేర్లో తీసినారు గొంచికాడా"

"ఏం వాయ్! మాకు తెలియకుండా సంఘం పెట్టేంత పెద్దోల్లు అయిపోయినారేంరా" అన్నాడు నారపరెడ్డి.

"అది ఏం సంగతో గొంచికాడా. మాలోల్లకి గవర్నమెంటు వాళ్లు అయిన ఉద్యోగాలన్నీ ఇస్తావుండారనీ మా కులమోళ్లంతా ఒకటై అంటరాని కులాల్ని ఏబీసీడీలుగా బాగాలు చేసి అందరికీ సమానంగా రిజర్వేషనులు ఉండేటట్లు చెయ్యాల్లని మాదిగ దండోరా అని సంఘం ఏర్పాటు చేసినారు గొంచికాడా"

"అవులే... అవులే. తెల్సులేవాయ్! ఇదంతా మాలోల్ల మింద దాడిలే! అందుకే ఆ నాయాళ్లు ఈ ఏబీసీడీలే వద్దని అంటూ మాల మహానాడు పెట్టుకుండారుకదా" అన్నాడు హనుమంతరెడ్డి.

"ఇగ్గోలే! ఓబుళేసుగా! ఇప్పుడే చెప్తావుండా మీ మాదిగదండోరా ఏబీసీడీల వర్గాకైతే ఫర వాలేదు. ఒకవేళ కూలీరేట్లు పెంచమనో, గుడిలోకి పోతామనో ఉద్యమాలు చేస్తే మీ మాదిగోళ్ల కొంపలన్నీ గోరీలయితాయిరో ఏమీ? ఈ మాట తెలియజెప్పు మీ దండోరా పెద్దోళ్లకి" అన్నాడు ఆవేశంగా నారపరెడ్డి.

"సరే గొంచికాడా! ఆడ ఆ నాయాండ్ల సంగతి నేను జూసుకుంటాలే గొంచికాడా"

"ఏమేం మాట్లాడినర్రా ఆడ" అడిగాడు వేమారెడ్డి.

అంతా చెప్పాడు. అయితే అగ్రవర్ణాల పెత్తనం మీద మాట్లాడిన మాటల్ని మాత్రం చెప్పలేదు.

ముగ్గురూ శ్రద్ధగా విన్నాక ఓబుళేసుని వెళ్లిపొమ్మన్నారు.

వేమారెడ్డి కొంచెం తలపంకించి "మామా! ఇదీ మనమంచికే తెలుసునా. మాలోల్లకీ మాదిగోల్లకీ ఒద్దిక చెడి పోవడం మనకి ఎప్పుడూ మంచిదే. మాదిగగేర్లో మాదిగదండోరా ఆఫీసు తీసినారంటే మాలోల్లతో పరోక్షంగా వైరమున్నట్లే. పైన హైదరాబాదు స్థాయిలో ఉండే వైరమే ఇక్కడా పొడసూపుతుంది. ఇట్లా మార్పు మనం ఆహ్వానించదగ్గదేకదా" అన్నాడు.

కాసేపు ముగ్గురూ మౌనంగా ఉండిపోయారు.

"మామా! టీ తెస్తునా" అనడిగింది నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ నారపరెడ్డి భార్య హనుమంతరెడ్డిని ఉద్దేశిస్తూ.

"తీసకరామ్మా" అన్నాడు.

మూడు కప్పులు వచ్చాయి

ముగ్గురూ టీ తాగుతూ ఉన్నారు.





"కరెక్టేరా నీ ఆలోచన వేమారెడ్డి! బాగా చెప్పినావ్!" అన్నాడు టీ కప్పు పక్కన పెట్టేస్తూ హనుమంతరెడ్డి.

నాగులకట్ట దగ్గర బస్సు ఆగింది.

బస్సులోంచి దిగేవాళ్లు ఎక్కువ ఏం లేరు కానీ వాళ్లని దిగనీయకుండా డోరుకు అడ్డంగా నిలుచున్నారు అందాకా బస్సు కోసం కాచుకున్న పాతికమంది ప్రయాణికులు. ఇబ్బందిపడుతూ, తోసుకుంటూ ప్రయాణికులు దిగేశారు. చివరిగా దిగిన వాళ్లలో గోపి, రామచంద్రలు ఉన్నారు.

గోపి తెల్లటి టీషర్టు, నల్లని ప్యాంటు వేసుకుని ఉన్నాడు. ఆంధ్రప్రదేశ్‌లోని ఒక ప్రముఖ పత్రికకి విలేఖరి అతను.



నల్లగా ఉన్నాడు. పెట్టుకున్నది దళసరి అద్దాలైనా గోల్డు ఫ్రేం అయినందువల్ల హుందాగా కనిపిస్తూ ఉన్నాడు. వయసు 40 ఏళ్ళ లోపు ఉండవచ్చు వెంట్రుకలు అక్కడక్కడా తెల్లగా కనిపిస్తున్నాయి. మీసాలు మాత్రం నల్లగా ఒక్క నెరసిన వెంట్రుక లేకుండా ఉన్నాయి. కొంచెం బట్టతల ఉన్నా అందంగానే ఉన్నట్లు అనిపిస్తోంది. అతనితోపాటు ఉన్న మనిషి రామచంద్ర కెమేరా భుజానికి వేలాడేసుకున్నాడు. చామనఛాయ ఒంటి రంగు, మొహంలో ప్రశాంతత, కళ్ళల్లో కాంతి ఎప్పుడూ నవ్వుతూ ఉండే పెదాలూ, ఉంగరాల జుత్తూ అతన్ని మంచి అందగాడిగా గుర్తించేలా చేస్తున్నాయి. బూడిద రంగు షర్టుని తెల్ల ప్యాంటులోకి టక్ చేసుకుని ఉన్నాడు. నిజానికి అతడు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. సోషియాలజీ మొదటి సంవత్సరం చదువుతున్నాడు. అయితే అతను ప్రస్తుతం గోపికి కెమెరామెన్‌గా ఇక్కడ అడుగుపెట్టాడు. గోపికి రామచంద్ర బంధువు కాదూ, స్నేహితుడూ కాడు. గోపి తమ్ముడు రాఘవ క్లాసుమేట్ రామచంద్ర. ఫ్యాక్షనిస్టుల గురించి తెలుసుకోవాలనే తపన అతనికి ఎక్కువ. అందుకు కారణం అతను ఈమధ్యనే కథకుడయ్యాడు. రెండు కథలు ఒక ప్రముఖ పత్రికలో అచ్చు అయ్యాయి కూడా. అంతే కాదు ఎం.ఎ. పూర్తి అవగానే సీమ ఫ్యాక్షనిస్టులు అన్న అంశంమీద డాక్టరేట్ చేయాలని అతని కోరిక. ఆ విషయమే గోపితో ఒకసారి అన్నాడు. అందుకే రామచంద్రని ఇప్పుడు వెంటబెట్టుకువచ్చాడు. "అక్కడ నీ గురించి ఎవరైనా అడిగితే కెమేరామెన్‌ని అని చెప్పు లేకపోతే లేనిపోని చిక్కులు" అని ముందుజాగ్రత్తలు చెప్పి తీసుకువచ్చాడు గోపి.

"కాఫీ తాగి పోదామా రామూ!" అడిగాడు అక్కడే ఉన్న కొట్టం హోటల్ని చూస్తూ.

"సరే అన్నా" అన్నాడు రామచంద్ర.

హోటల్లోకి ఇద్దరూ అడుగుపెట్టారు.

బస్సు డ్రైవరూ, కండక్టరూ అక్కడ టీ తాగుతూ ఉన్నారు. వాళ్ళతోపాటు మరో నలుగురు దేశ రాజకీయాల్ని చర్చిస్తున్నారు. వాళ్ళు ఆ ఊరివాళ్ళే.

"మీది ఈ ఊరేనా సార్" అడిగాడు డ్రైవర్ గోపిని ఉద్దేశించి.

"కాదండీ... మాది అనంతపురం. మేం

# మరిన్ని ముత్యాలు

* ఎక్కడ సంపద పెరుగుతుందో అక్కడ మానవ విలువలు నశిస్తాయి.

  – గోల్డ్‌స్మిత్

* అవసరమే మార్గాన్ని సూచిస్తుంది.

  – లాటిన్ సామెత

* విద్య శరీరానికి వ్యాయామం, మనస్సుకు శరీరం వంటిది.

  – ఎపెక్యూరస్

* నేరస్తులను తయారుచేసే చట్టాలను బోలెడు చేస్తాం. తరువాత వారిని శిక్షించటానికి కాసిన్ని చట్టాలు తెస్తాం.

  – టక్కర్

* మానవుడు నీతి నిజాయితీలతో ఉండడం కష్టం. అంతకన్నా పేదవాడుగా ఉండిపోవడమే ఉత్తమం.

  – నెపోలియన్

* ప్రతి తరం తన తండ్రులపై తిరుగుబాటుచేసి తాతలతో స్నేహం చేస్తుంది.

  – వర్డ్స్‌వర్త్

* జరిగిన మంచిని మరువకు, చేసిన మంచిని గుర్తుచేయకు.

  – షరాన్

* నీకు ఏది జరగకూడదనుకుంటావో దానిని ఇతరులకు చేయొద్దు.

  – కన్‌ఫ్యూషియన్

* నిత్యానుష్ఠానంలో లేని ధర్మం నిరుపయోగం.

  – అరవిందుడు

* ఉపద్రవాలన్నింటినీ అనల్పంగా భావించు, అయితే అనల్పాలను మాత్రం ఉపద్రవాలుగా భావించవద్దు.

  – క్వెంటిన్‌క్రిస్ట్

* భిన్నత్వంలో ఏకత్వాన్ని అన్వేషించడమే విజ్ఞానం.

  – స్వామి వివేకానంద

* మోసం అనేది చాలీచాలని దుప్పటిలాంటిది. ముఖం కప్పుకుందామనుకుంటే కాళ్ళూ కన్పడతాయి.

  – స్కాట్

* మంచి సలహా ఏదో... చెడు సలహా ఏదో తెలుసుకోగలిగినపుడు అసలు నీకు సలహాయే అవసరం లేదు.

  – రోజర్‌డెలిన్

సేకరణ: **దాసరి వెంకట రమణారావు**

జర్నలిస్టులం... ఈ ఊర్లో కొంచెం పని ఉండి వచ్చాం" అన్నాడు గోపి. మూలలో వున్న టేబుల్ పక్కనున్న బెంచీమీద కూచు న్నారిద్దరూ.

"అట్లనా... ఈ పల్లెలో కూడా మీకు న్యూస్ దొరుకుతుందా? " ప్రశ్నించాడు కండ క్టరు.

"అరే! ఏందన్నా. ఎంత అమాయకంగా అడుగుతున్నావు వాళ్ళకి. అంతలేంది ఈ ఊరికి వస్తారా? " అని డ్రైవరు తనకున్న విషయ పరిజ్ఞానాన్ని కండక్టరుకి ప్రదర్శించి చూపాడు.

"ఈరోజు రంజానుకదా. మీరేంది ఈ పొద్దు డ్యూటీలో ఉన్నారు" అడిగాడు గోపి.

"లేదు సార్. నిన్న చంద్రుడు కనబడలే దని ఈరోజు పండగ చెయ్యలే. అందుకే డ్యూటీకి వచ్చినా" అన్నాడు డ్రైవరు.

టీ తాగుతూనే డ్రైవరూ, కండక్టరూ సిగ రెట్లు వెలిగించుకుని వెళ్ళిపోయారు.

గోపీ, రామచంద్రల ముందుకు టీలు వచ్చాయి. తాగుతూ ఉన్నారు.

"డ్రైవరు ముస్లిం అని ఎట్ల కనుక్కుంటి వన్నా. అతనికి గడ్డంలేదు, నెత్తిమీద టోపీ లేదు" అడిగాడు రామచంద్ర.

"ఏముందీ వెరీ సింపుల్... ఎంత అమా యకంగా అడుగుతున్నావ్ వాళ్ళకి" అన్నాడు ఆ వాక్యాన్ని బట్టి.

"అందులో ఏముందీ... ఎవరైనా అట్లే కదా అంటారు"

"అట్లా అనం... ఎంత అమాయకంగా అడుగుతున్నావు వాళ్ళని అని అంటాం"

"వాళ్ళకి బదులు వాళ్ళని అంటాం"

"అయినా అర్థంకాలేదు"

"కొంచెం పరిశీలనగా చూడాల రామూ! వాళ్ళ భాషలో ద్వితీయా విభక్తిలేదు, అంటే నిను అన్నమాట. నిన్, నున్, లన్, కూర్చి గురించి కదా ద్వితీయా విభక్తి అంటే... అందుకే వాళ్ళని అనడానికి బదులు వాళ్ళకి అంటారు.

'నిన్ను తంతాను' అన్నమాటను 'నీకు తంతాను' అని అంటారు. 'మమ్మల్ని గెలవ లేవు' అన్నమాటను 'మాకి గెలవలేవు' అంటారు. అట్లా పసిగట్టాను అతన్ని ముస్లిమ్ అని" అన్నాడు గోపి నవ్వుతూ.

"అమ్మో మీకు తెలుగుమీద మంచిపట్టే ఉందే... మీరు ఎం.ఏ.లో తెలుగు లిటరే చరా? "

"కాదు... ఎమ్మెస్సీ జియాలజీ... అంటే భూ విజ్ఞాన శాస్త్రమన్నమాట... ఆ తర్వాత ఆసక్తికొద్దీ జర్నలిజం కోర్సు చేశాను. ఎంత చెడ్డా తెలుగు జర్నలిస్టుని కదా భాషమీద పట్టు లేకుంటే ఎట్లా అని తెలుగు లిటరే చరు కూడా కొంత చదువుకున్నా... అట్లే భాషాశాస్త్రాన్ని కూడా" అన్నాడు ఖాళీ టీ గ్లాసుని టేబుల్ మీద ఉంచుతూ.

"బావుంది మీ విశ్లేషణ. మీవెంట రెండు రోజులు తిరిగితే చాలన్నా! అటు జర్నలిజం, ఇటు తెలుగు భాషమీద సాధికారత రెండూ సంపాదించవచ్చు. నాకు కథలు రాసేందుకు కూడా బాగా ఉపకరిస్తుంది"

"అది సరేగానీ... నువ్వు జ్ఞానతృష్ణతో ఇక్కడ ఎక్కువ ప్రశ్నలు వేయద్దు. మనం వెళుతున్నది పులి గుహలోకి. గమ్మున ఉండల్ల... నువ్వు కెమేరామెన్‌వి అంతే. నేను ఫొటోలు తియ్యమన్నచోటల్లా క్లిక్‌మని పిస్తూ ఉండల్ల అంతే... అసలే ఇక్కడ వాతావరణమంతా ఫ్యాక్షన్ వాసనతో నిండి ఉంటుంది" అన్నాడు గుసగుసగా.

సరేనన్నట్టు తల ఊపాడు. తను టీ తాగడం పూర్తయిన వెంటనే లేచి నిల్చు న్నాడు వెళ్ళేందుకు.

"ఎక్కడికీ అప్పుడే లేచావు. కూచోవయ్యా బాబూ! నేనింకా సిగరెట్టు కాల్చుకోవల్ల... నీకు అలవాటుందా. ఇంద తీసుకో" అంటూ కింగ్ సైజు సిగరెట్టును తను ఒకటి తీసు కుని పాకెట్టును రామచంద్రవైపు తోశాడు గోపి.

"ఎప్పుడన్నా మనసు బాగోలేకపోతే ఒకటి

తాగుతానన్నా. అంతేగానీ అలవాటులేదు"

"అయితే ఇప్పుడు మనసు బావుందా? తాగవా? "

"ఊహూ..."

"ఊహూ అంటే మనసు బాగోలేదనా? తాగననా? "

"మనసు బాగుంది. కాబట్టి తాగనని" నవ్వుతూ అన్నాడు రామచంద్ర.

'ఓకే ఓకే' అంటూ సిగరెట్టు తాగుతూ ఉండిపోయాడు గోపి.

కాసేపు మౌనంగా ఉండిపోయారు ఇద్దరూ.

వీళ్ళకి కొద్దిదూరంలో కూర్చున్నవాళ్ళ రాజకీయచర్చలు సాగిపోతూనే ఉన్నాయి.

ఉన్నట్టుండి గోపికి ఒక సంగతి చెప్పాలనిపించింది.

"మన ప్రాంతంలోని పాత ఫ్యాక్షనిస్టుల గురించి తెలుసా రామూ? "

"లేదన్నా! ఇప్పుడిప్పుడే కదా నాకీ విషయంలో ఆసక్తి కలిగి అధ్యయనం చేయడం మొదలు పెట్టింది"

"పాత ఫ్యాక్షనిస్టుల్లో ఎవరి గురించి చెప్పాలంటే... ఆ... ఉరవకొండ ప్రాంతంలోని ఒక ఫ్యాక్షనిస్టు గురించి చెబుతాను. పేర్లెందుకుగానీ... 'ఏ' అనేవాడు 'బీ' అనేవాడికి అప్పట్లో అంటే ఏభైయ్యేళ్ళ కిందట అన్నమాట. ఏడువందల రూపాయలు అప్పిచ్చినాడు. ఆ తర్వాతకాలంలో ఇద్దరూ ఫ్యాక్షనిస్టులు అయినారు. 'ఏ' తనకి రావాల్సిన బాకీ డబ్బు రాబట్టుకొనేకి శతవిధాలా ప్రయత్నించినాడు. అయినా 'బీ' బాకీ తీర్చనేలేదు. చివరికి 'ఏ' ఏం చేసినాడు... గుత్తి కోర్టులో దావా వేసినాడు. అయినా 'బీ' కోర్టుకు హాజరుకాలేదు. దావా డిక్రీ అయింది. 'బీ' అనేవాడు బాకీ చెల్లించనేలేదు. 'ఏ' అనేవాడి అర్జీమీద కోర్టు 'బీ'కి అరెస్టువారెంటు జారీచేసింది. అప్పుడు 'బీ' ఏం చేసినాడూ... ఆ వారెంటు తెచ్చిన అమీన్‌కి పదో ఇరవయ్యో చేతిలోపెట్టి పంపించేశాడు. ఇట్లా ఒకటి రెండుసార్లు జరిగింది కూడా. దాంతో 'ఏ'కి కోపమొచ్చి ఆ అమీన్‌ని పట్టుకొని 'ఏరా మిండ్లకు పుట్టిన నా కొడకా. ఇట్లా పనిచేస్తావా? ' అని నోటికొచ్చినట్లు తిట్టినాడు. దాంతో ఆ సారి అమీన్ 'బీ'కి నిజంగానే వారెంటు జారీచేశాడు. దాంతో ఎట్టకేలకు 'బీ' గుత్తి కోర్టుకు రాక తప్పలేదు. డబ్బు కూడా వెంటనే కోర్టుకు కట్టేసినాడు. ఆ డబ్బును కోర్టు 'ఏ'కి హ్యాండోవర్ చేసింది. 'ఏ' పంతం నెగ్గింది. పరమానందభరితుడైనాడు. అంతే... ఆ డబ్బులో ఒక్క పైసా కూడా ఇంటికి తీసుకుపోలేదు. అక్కడే కోర్టు హాల్లోనే ఆ నోట్లకట్టల్ని అన్నిట్నీ వెదజల్లిపోయినాడంట"

"అంత డబ్బునా? "

"అవును మరి. అప్పట్లో ఏడువందలు అంటే... వడ్డీ కలుపుకుని ఏ వెయ్యో అయివుంటుంది. ఇప్పుడు లక్ష రూపాయలతో సమానమేమో మరి. అదీ మరి పాత ఫ్యాక్షనిస్టులంటే..." అంటూ సిగరెట్టు తాగడం అయిపోతూనే లేచాడు గోపి.

బిల్లు చెల్లించేటప్పుడు "హనుమంతరెడ్డి గారి ఇంటికి ఎట్లపోవల్ల" అనడిగాడు హోటలతన్ని.

అలా అడుగుతుంటే అందాకా మాట్లాడుకుంటున్నవాళ్ళు కూడా గోపివైపు అదోమాదిరి చూశారు. రామచంద్ర అన్నీ గమనిస్తూ ఉన్నాడు.

ఏఏ సందులు తిరిగి వెళితే హనుమంత రెడ్డి ఇల్లు వస్తుందో గుర్తులు చెప్పాడు హోటలతను.

నెమ్మదిగా హోటల్లోంచి బయల్దేరారు ఇద్దరూ.

వాళ్ళిద్దరూ సందుల్లో పడి నడుస్తుంటే పిల్లలూ, ముసలోళ్ళూ, గింజలు ఆరబోస్తున్న ఆడవాళ్ళూ ఎగాదిగా చూస్తున్నారంతా. ఒక కంట ఇదంతా గమనిస్తూనే ఏమెరగనట్టు వెళుతున్నారు.




రెండో సందుచివర మలుపు తిరుగుతుంటే సెంట్రల్ జైల్ గోడలంత ఎత్తుగా ఉన్న ప్రహరీ, దానిమీద ఇనుప ముళ్ళ తీగతో కట్టిన కంచె ఉండడం చూసి,

"ఇదే అయి ఉంటుంది రామూ" అన్నాడు గుసగుసగా గోపి.

"అవునన్నా" అన్నాడు రామచంద్ర ఆ ప్రహరీగోడని పరిశీలిస్తూ.

సెంట్రల్‌జైలు గేటు మాదిరిగానే అక్కడో గేటు ఉంది. దానిముందు బలిష్టమైన శరీరాలు కలిగి చేతుల్లో బరిసెలూ, మొలలో బాకులూ ఉన్న ఇద్దరు మహాకాయులు ఉన్నారు. పెద్దపెద్ద మీసాలతో ఆ ఇద్దరి చూపులూ ఈ ఇద్దరిపైనే ఉన్నాయి.

గోపి నేరుగా వాళ్ళ దగ్గరికి పోయి, "మేము పత్రికా విలేఖరులం. హనుమంతరెడ్డిగార్ని కలవాలి" అంటూ విజిటింగ్ కార్డు ఇచ్చాడు ఒకడికి.

అతను చాలా నిర్లక్ష్యంగా గోపినీ, రామచంద్రనీ ఒకసారి కిందినుంచి పైదాకా చూసి...

"ఇక్కడే ఉండు లోపలికి పొయ్యొస్తా... నేను చెప్పేవరకూ లోపలికి రాకూడదు. ఏమి? " అంటూ తన కరకు కంఠంతో ఆజ్ఞాపిస్తున్నట్టు చెప్పేసి 'జాగ్రత్తగా చూసుకో వీళ్ళిద్దర్నీ' అన్నట్టు తన సహచరుడివైపు ఒకసారి చూసి పెద్ద ద్వారానికి ఉన్న చిన్నతలుపు తీసుకుని లోపలికి పోయాడు.

పదినిమిషాల తర్వాత వచ్చాడు 'లోపలికి పోండి' అన్నట్టు తల ఆడించాడు.

హుషారుగా లోపలికి వెళ్ళడానికి అడుగు లేస్తుంటే...

"ఇగ్గో... మా గొంచికాడు వచ్చేవరకూ వరండాలోనే కూకోండి. సర్రుమని లోనికి పోతే గొంచికానికీ కోపమొస్తాది... ఏమీ? " అన్నాడు కరకు కంఠం మనిషి.

"రామూ నువ్వు నవ్వనంటే ఒకమాట చెప్తా. దేవుడు ఇతర జంతుజాలానికి ఎందుకు మాటలు రాకుండా చేశాడా అని అనుమానం ఉండేది ఇన్నాళ్ళూ. వీడు మాట్లాడిన తర్వాత అర్థమైంది. గాడిదకి మాటలు వస్తే అచ్చం ఇట్లే వుంటుందికదూ" గొణుగుతున్నట్టు అన్నాడు గోపి.

నవ్వు రాకుండా ఉండేందుకు బాగా అవస్థపడ్డాడు రామచంద్ర, "అన్నా! జోకు వేసి నవ్వొద్దు అనడంకన్నా భయంకరమైన శిక్ష ఏదన్నా ఉంటుందా? "

తలుపు దాటగానే పెద్ద ఇల్లు. చెట్లకింద సాయుధులైన ఇద్దరు గన్‌మెన్‌లు, మరొకవైపు పెద్ద వేపచెట్టుకింద గుసగుసగా మాట్లాడుకుంటున్న ప్రైవేటు సైన్యం, వాళ్ళ పక్కనే బరిసెలూ, వేటకొడవళ్ళూ ఉన్నాయి.

ఇద్దరికళ్ళూ ఆ చుట్టుపక్కల ఉన్న ఆవరణని ఒక్కసారి అలవోకగా గమనించి ఎదురుగా ఉన్న ఇంటిని చూశాయి. అది మామూలు ఇల్లుకాదు. అతి పెద్ద భవనం. పాత పద్ధతుల్లో కట్టిన భవనం అది. ఇంటికి పైపైపు నాలుగైదు ఇటుకలు పట్టేంత కన్నాలు ఉన్నాయి. శత్రువు తమ ఇంటిమీదికి దాడిచేసేటప్పుడు ఆ కన్నాల లోంచి తుపాకులతో గుళ్ళవర్షం కురిపించడానికి అట్లా చేశారని అర్థమైంది గోపికి. తమను ఈ పాటికి ఆ కన్నాలగుండా హనుమంతరెడ్డి ముఖ్య అనుచరగణం అంతా ఎప్పుడో చూసి ఉంటారన్న విషయాన్ని కూడా ధృఢం చేసుకున్నాడతను.

నెమ్మదిగా నడుస్తూ అక్కడే వరండాలో వేసివున్న కుర్చీల దగ్గరికి చేరుకున్నాడు.

"మా గొంచికాడు వస్తాడు కూకోండి" అంటూ వినయంగా కుర్చీలని చూపించాడు ఓబులేసు.

కుర్చీలలో కూచున్న కాసేపటికి మంచి రుచికరమైన టీని అందమైన కప్పుల్లో అందించాడు ఒక పరిచారకుడు.

టీ తాగడం అయిపోతూనే "అయ్యా! తమరు లోపలికి రావల్లంట" అన్నాడు ఓబులేసు.



టక్కున ఇద్దరూ లేచి లోపలికి వెళ్లారు. వాళ్లతోపాటు మొదటి గదివరకూ వెళ్లి, వాళ్లని ఎడమవైపు వెళ్లవలసిందిగా చెప్పాడు.

బయటి వాతావరణానికే జడుసుకున్న రామచంద్రకి లోపలికి వెళుతున్నకొద్దీ పులి గుహలోకి ప్రవేశిస్తున్నట్టుగా అనిపిస్తోంది.

మధ్యగదిలో ఎక్కువ వెలుతురు సోకని గదిలో కూర్చుని ఉన్నారు హనుమంతరెడ్డి, నారపరెడ్డిలు.

"మీరిద్దరూ జర్నలిస్టులేమప్పా? !" అడిగాడు హనుమంతరెడ్డి.

అవునంటూనే తనని మాత్రమే జర్నలిస్టుగానూ, రామచంద్రని ఫొటోగ్రాఫర్‌గానూ పరిచయం చేశాడు గోపి. అంతంతమాత్రమే ఉన్న వెలుతుర్లోనే హనుమంతరెడ్డినీ, అతని కొడుకు నారపరెడ్డిని తేరిపారజూశాడు.

ఆదేశాలివ్వడానికే పుట్టినట్టున్న అతని గొంతు, పురితిరిగిన తెల్లని మీసకట్టు, వీటన్నిటికీ తోడు సూటిగా చూసే కళ్లు, అతని పక్కనే కూచున్న నారపరెడ్డి అచ్చం తండ్రి మాదిరే ఉన్నాడు. ఒక్క జుట్టూ, మీసాలు మాత్రం నల్లగా ఉంటాయంతే.

"ఏమి అట్ల నిలబడితిరి కూసోండి... ఈడ మనమంతా ఒకటే. మాకు పేపరోల్లంటే బొలే గౌరవం" అంటూనే తలని పక్కకి తిప్పి "ఇద్దో ఏమ్మా! టీ పంపమ్మా" అన్నాడు కోడల్ని ఉద్దేశించి హనుమంతరెడ్డి.

"బయటే టీ ఇచ్చినారు సార్" అన్నాడు గోపి.

"ఏం ఫర్వాలేదులే... ఏంపా నీ పేరేందో' హనుమంతరెడ్డి అడిగాడు.

"గోపీ... సార్! ఇతని పేరు రామచంద్ర'

"సరే సర్లే... అది కాదప్పా! గోపీ నాకి తెలీక అడుగుతా వుండాను మీ పేపరోళ్లు నన్నే ఎందుకు ఇంటర్వ్యూ చెయ్యాలనుకుండారో ముందు అది జెప్పు... నేనే ఈ జిల్లాలో పేరు మోసిన ఫ్యాక్షనిస్టుగా మీరు అనుకోనిండారా? "

"అట్లేం అనుకోలేదు సార్! మేము ఇంటర్వ్యూ చేయాలనుకుంటున్న వాళ్లలో మీరూ ఒకరు. అది మాత్రం నిజం. మొత్తం రాయలసీమలోని ఫ్యాక్షనిస్టులందర్నీ ఇంటర్వ్యూ చేయాలన్నదే మా పత్రిక ఉద్దేశం. కర్నూలు, కడప జిల్లాల్లో ఉంటున్న ఫ్యాక్షనిస్టుల్ని ఇంటర్వ్యూ చేసేందుకు అప్పుడే మా స్టాఫ్ వెళ్లిపోయారు. ఈ జిల్లాలో ఉన్నవాళ్లని ఇంటర్వ్యూ చేయాల్సిన బాధ్యత నాదే సార్"

"మరి ఆ సిద్ధారెడ్డిగాడిని ముందుగా ఇంటర్వ్యూ చేసినావా? " అడిగాడు హనుమంతరెడ్డి.

"లేదు సార్. మీకున్న పేరు ఆయనకి లేనట్టుంది సార్ మా ఆఫీసులో. ముందుగా మిమ్మల్నే ఇంటర్వ్యూ చేయమన్నారు. ప్రిఫరెన్సు మీ తర్వాతనే మరి ఎవరికైనా" అన్నాడు గోపి. హనుమంతరెడ్డికి ఎట్లాంటి మాటలు ఆనందాన్ని కలిగిస్తాయో తెలిసిపోయింది అతనికి.

ఆ మాటలకి హనుమంతరెడ్డి, అతని కొడుకు నారపరెడ్డిలు బాగా ఉబ్బిపోయారు.

"సరే సరేగానీ... నేను చెప్పినవే రాయల్లప్పా! తెల్సిందా? ఊరికే మీ పెన్నుకి ఏంది తోస్తే అదల్లా రాయకూడదు"

"అట్ల ఎప్పటికీ రాయం సార్" అంటూనే పెన్నూ, పేపర్ పాడ్ దగ్గర పెట్టుకున్నాడు.

"సరే అయితే అడుగూ"

"మొదటి ప్రశ్న సార్. ఫ్యాక్షనిజం మీకు సంతోషాన్ని కలిగిస్తోందా? "

"అబ్బే లేదప్పా. ఏంది సంతోషం? అనుక్షణం గండమే కదప్పా. ఒక్క పూట భోజనం కూడా తృప్తిగా చెయ్యలేని పరిస్థితి మాది. పెండ్లాం, పిల్లోల్లూ , మనుమడూ, మనుమరాళ్ళతో హాయిగా ఉండేకే లేదు. నాకు కూడా పచ్చటి చేన్లో హాయిగా మంచ మేసుకొని పండుకోవాలని ఉందప్పా...




అయితే నా ప్రత్యర్థి నన్ను బతకనిస్తాడని గ్యారంటీ ఏదీ... మడి ఇట్లా జీవితం ఎట్ల సంతోషంగా ఉంటుంది చెప్పు"

"అయితే మీరు ఎదుర్కొంటున్న ఇబ్బందులు? "

"ఏముంటాయి రాజకీయంగా నన్ని అణచివేయాలని నా ప్రత్యర్థి ఎప్పటికప్పుడు కుట్రలు పన్నుతానే ఉంటాడు. వాటిని నేర్పుగా తిప్పికొట్టల్ల. ఇప్పటికి నన్నీ, నా కొడుకునీ మట్టుపెట్టాలని ఎన్నిసార్లు దాడులు జరిగినాయని"

ఇలా ఇంటర్వ్యూ చేస్తూపోతున్నాడు గోపి.

హనుమంతరెడ్డి మరింత నేర్పుగా జవాబు చెబుతూనే ఉన్నాడు. తనమీద ఏడుసార్లు హత్యాప్రయత్నం జరిగిందని, అప్పుడు తన సహచరులు కాపాడారనీ చెప్పాడు. తనకంటూ ఏ స్వార్థమూలేదు, డబ్బూ, పదవులూ పొందాలని ఆశలులేవు. తను కేవలం బతికి ఉండాలి కాబట్టి అందు కోసమే బతికి ఉన్నంతకాలం పోరాడుతానని చెప్పాడు. ఫ్యాక్షన్ జీవితమన్నది పరమభయంకరమైనది ఇందులో ఎవరూ కోరికోరి కాలుపెట్టకూడదు. దీనికంటే జీవితం చాలా విలువైనదని అందరూ గుర్తుంచుకోవాలని మనవిచేస్తూ మరీ చెప్పాడు.

అన్నీ చెప్పాక "నిజం చెప్పాలంటే ఇక్కడ ఫ్యాక్షనిజం అనేది మన నీళ్ళలోనే ఉందప్పా. ఈ పెన్నానది చూసినావా? అది ఎక్కడెక్కడ ప్రవహిస్తా వున్నదో అక్కడంతా ఫ్యాక్షన్ వాతావరణం ఉంది. తాడిపత్రి జూడి, కడపజిల్లాలో జూడి" అంటూ తేల్చి చెప్పాడు హనుమంతరెడ్డి.

గోపికి ఆ సమాధానం తృప్తినివ్వకపోయినా మరొక ప్రశ్న వేశాడు.

"రెడ్ల విషయంలో ఒక పుకారు ఉంది. ఇది ఇతర కులాలవాళ్ళు అనుకునేది. అదేంటంటే దూరంగా ఉన్నంతవరకూ రెడ్లు ఒకరినొకరు అభిమానిస్తారనీ, దగ్గరవుతూనే ఒకర్నొకరు ఫ్యాక్షన్ రూపంలో నరుక్కుంటారనీ... దీనికి మీ సమాధానం? "

"బోలేవాడివప్పా నువ్వు గోపి. రెడ్లకే ఎసరు పెడితివా? రెడ్లంటే ఆంధ్రదేశంలో అన్నిచోట్లా ఉండే రెడ్లు వేరూ రాయలసీమలో ఉండే రెడ్లు వేరు. పౌరుషానికి మారుపేరు మా రెడ్లు. తనపైన ఆధిపత్యం చెలాయించనంతవరకే ఎవరినైనా ఇష్టపడతాడు. చివరికి రెడ్డినైనా తన ముక్కువరకూ అవతలి

వాడి వేలు వచ్చిందా, వాడు ఎవడైనదీ లెక్కచేయడు. ఆ వేలు వున్న చేతినే నరికేస్తాడు. ఆ చేయి వున్న భుజాన్ని నరికేస్తాడు. ఆ భుజం ఉన్న మనిషినే నరికేస్తాడు. అదీ 'రెడ్డి' అనేవాడి నైజం!"

"బాగా చెప్పారు"

"అయితే ఇక్కడ ఒకటి చెప్పాలప్పా! ఈ ఊర్లో కూడా నువ్వు రెడ్లకీ, రెడ్లకీ మధ్యన ఫ్యాక్షన్ ఉందని అనుకుంటా ఉండావా? "

"అవును సార్... అవతల ఉన్నదీ సిద్ధారెడ్డే కదా!? ? "

"కాదప్పా, కానే కాదు... వాడు రెడ్డి అయి ఉంటే ఇంక ఏముండె... రోజూ వాని పేరున ఆంజనేయస్వామి గుళ్లో ఆకు పూజ కట్టించనా? "

"ఇదేంటి సార్! ఆశ్చర్యంగా ఉంది మీరు చెప్తుంటే" నిజంగానే ఆశ్చర్యపోతూ అన్నాడు గోపి.

"అవునప్పా! ఆ సిద్ధారెడ్డిగాని పేరులోనే 'రెడ్డి' ఉండేది. వాని అసలు కులం కమ్మ!"

"అవునా సార్! నిజంగా నేను ఇప్పుడు షాక్ తింటున్నా"

"మరేంది అనుకుంటివి... ఆ సిద్ధారెడ్డి గాని తండ్రి నరసింహారెడ్డి ఈ మీనమడుగు గ్రామ మునసబు అంటే రెడ్డి అన్న మాట. ఇది 30 ఏండ్ల కిందటిమాట. రెడ్డి పని చేసేవాళ్లు పేరుకు కడాన రెడ్డి అని పెట్టుకొనేది మనదిక్కు మామూలే కదా. అదిగో అట్ల వచ్చినాది ఆ రెడ్డి పేరు"

రెండోసారి టీ వచ్చింది.

"మీరు ఫ్యాక్షన్ని వదిలేయవచ్చుకదా" అనడిగాడు టీ తాగుతూ గోపి.

"ఎట్ల వదలమంటావు చెప్పప్పా! నేను వదిలేసినానే అనుకో అవతలివాడు ఊరు కుంటాడా? నన్నీ, నా కొడుకునీ బతకని స్తాడా? ఇట్లుండాల్సిందే ఈ జన్మంతా"

"పోనీ ఈ జీవితం మీకు తృప్తిగానన్నా అనిపిస్తావుందా? "

"చూడప్పా! గోపీ! ఒక్క మాటలో చెప్పా లాంటే ఈ ఫ్యాక్షన్ అనేది ఉందే ఇది వ్యభి చారంకంటే హీనమయిండేది. ఇంకా చెప్ప ల్లంటే వేశ్యబతుకే మేలప్పా. ఎదురుంగ ఉండేవానికి సుఖమన్నా ఇస్తాది. మా ఫ్యాక్షనిస్టు బతుకులు అట్లగాదే, తనూ సుఖ పడదు ఎదుటోన్ని సుఖంగా ఉండనియ్యడు. బతికినంతకాలమూ సస్తా, బతుకుతా ఉండా ల్సిందే"

ఇంటర్వ్యూ అయిపోయాక తండ్రీ కొడు కుల్ని ఫోటోలు తీశాడు రామచంద్ర. తర్వాత ఐదు నిమిషాలు పిచ్చాపాటి మాట్లాడి అక్కడినించి బయల్దేరి వచ్చేశారు గోపి, రామచంద్రలు. అక్కడినించి నేరుగా సిద్ధారెడ్డి ఇంటివైపు వెళ్లారు.

★ ★ ★

సిద్ధారెడ్డిని ఇంటర్వ్యూ చేసి వచ్చేటప్పటికి మధ్యాహ్నం మూడు గంటలయింది. నాగు లకట్ట దగ్గరకి వస్తూనే బస్సు వచ్చింది. వెంటనే ఎక్కి కూచున్నారు ఇద్దరూ. సిద్ధా రెడ్డి ఇంట్లోనే భోజనం చేసి వచ్చినందువల్ల ఇంక దేని గురించీ ఆలోచనలేదు ఇద్దరికీ. చాలాసేపటినించీ గోపిని ఎన్నో ప్రశ్నలు వేయాలని కాచుకుని ఉన్నాడు రామచంద్ర. ఆ ఫ్యాక్షనిస్టు లిద్దర్నీ ఇంటర్వ్యూ చేస్తూ ఉన్నప్పుడు తనే వాళ్లని ప్రశ్నిద్దామా అన్నంత ప్రేరేపణ కలిగినా గోపికిచ్చిన మాట మేరకు గమ్మున ఉండిపోయాడు. అందుకే తన సందేహాలనన్నింటినీ ఇప్పుడు అడగడం మొదలుపెట్టాడు రామచంద్ర. అన్నిటికీ బాగా వివరంగా సమాధానాలు ఇవ్వనారంభించాడు గోపి.

బస్సు అనంతపురానికి బయల్దేరింది.

"ఈ ఇద్దర్నీ ఫ్యాక్షన్ విషయమై అడిగిన ప్రశ్నలకి సమాధానాలు ఒకేరకంగా ఉన్నాయి కదన్నా! అదెట్లా? "

"ఈ ఇద్దర్నే కాదు రామూ! మన రాయ లసీమలోని ఫ్యాక్షనిస్టులందర్నీ ఈ ప్రశ్నలే అడిగితే దాదాపు ఈ సమాధానాలే ఉంటాయి. ఏమంటే మాటల్ని వ్యక్తపరిచే విధానం వేరుగా ఉండవచ్చు. ఫ్యాక్షనిస్టులం దరికీ ఫ్యాక్షన్ అంటే రోతే! అసహ్యమే! దీన్ని రొంపితోనో, ఊబితోనో లేదా వేశ్య తోనో పోల్చుతారు. వీళ్ళందరికీ స్వేచ్ఛగా జీవించాలనే ఉంటుంది. వెంటనే దాన్ని వదిలేసి ఉండాలనిపిస్తుంది. అయితే అవత లివాడు తనని ప్రాణాలతో బతకనివ్వడు కదా అందుకే ఫ్యాక్షన్ వదలను అంటారు. ఇంకా ఒకటి గమనించావా రామూ! ఫ్యాక్ష నిజానికి మరో కారణం కాని కారణం ఈ పెన్న నీళ్లు అట్లాంటివి అని. పెన్న పరివా హక ప్రాంతంలో ఉండే కడప పాలెగాళ్లం దరూ ఈ మాటే అంటూ ఉంటారు. మరి కొందరు రేగడినేలమీదకి, ఎర్రనేలమీదకి తోసేస్తూ ఉంటారు"

"నిజమేనన్నా!" అన్నాడు రామచంద్ర. తను రాయబోయే కథకి మంచి ముగింపు దొరికిందని ఉత్సాహంగా ఉంది అతనికి.

★ ★ ★

అప్పటికే పొద్దుమునిగిపోయింది.

గడ్డివామిలోంచి మెల్లగా పొట్టు తోడుతు న్నాడు నల్లప్ప.

వెనకాల కొద్దిదూరంలో అడుగులచప్పుడు దగ్గరవుతూ ఉంది. 'ఇంకెవరూ పార్వతే అయి ఉంటుంది. ఈ రోజు తను ఆమె నించి తప్పుకుంటాడు. ఇంకనించి దూరంగా ఉండాలని కచ్చితంగా చెప్తాడు. అయినా తనకు చాతనయితుందా అంత సూటిగా చెప్పేది.





తను ఎన్ని అనుకున్నా, ఏమి అనుకున్నా తీరా పార్వతి వచ్చేటప్పటికి అన్నీ మరచిపోతాడు. ఆమె పొందుకన్నా మించిన స్వర్గం లేదనిపిస్తుంది ఆ కాసింతసేపూ.

అడుగుల చప్పుడు తనకు దగ్గరగా వచ్చి ఆగిపోయింది.

'ఏమి అక్కడే ఆగిపోతివి రా...నీ కోసరమే...' అని అందామనుకుని 'ఏం' అన్న మాట పూర్తికాకనే తిరిగి చూశాడు.

సెకనులో సగంసేపు గుండె ఆగిపోయి, తిరిగీ వేగంగా కొట్టుకోనారంభించింది. ఆ వచ్చింది...

వేమారెడ్డి!!!

తెల్లచొక్కా పంచెతో నిలబడి ఉన్నాడు.

అప్రయత్నంగానే "ఏం గొంచికాడా!" అన్నాడు. 'గొంచికాడు ఇక్కడికెందుకొచ్చినట్లో... పార్వతి రోజూ ఇక్కడికి వస్తుందేది కనిపెట్టి వచ్చినాడా! అదే నిజమైతే తన పని ఇక అంతే! తనని తంతాడా ఏమి?' ఇట్లా అనుకుంటూ ఉంటే అతని కాళ్లలో నుండి వణుకు మొదలయింది.



"ఏవాయ్! పొట్టుతోడేది అంత మెల్లంగానా. కొంచెం ఉసిగా తోడిరా! ఇగ్గో... అంగడికాడికి పొయ్యి సోడాలు పది తీసకరా!"

"సరే గొంచికాడా!" అన్నాడు తను భయపడినంత జరగలేదని సంతోషంతో మనసు ఎగిరి గంతులేస్తోంది.

"తెచ్చి దాన్లని యాడపెడతావు?"

"యాడంటే... ఎప్పుడూ పెట్టేచోటే గొంచికాడా! ఎద్దులకొట్టం పక్కన ఉన్న కొట్టిడీలో"

"ఊ...బిరీన... అట్లే కుళ్లాయిగాడు అనంతపురంనించి విస్కీ తెచ్చింటాడు. అది కూడా తీసకరా. ఇద్దో గొంచికత్తెకి తెలీకూడదు. ఏమీ?"

"ఆ సరే గొంచికాడా!" అన్నాడు వినయంగా.

"వచ్చేదప్పుడు అట్లే శెట్టిగాని దగ్గర పది రూపాయల మిరపకాయ వడలు బాగా ఉడుకుడుకువి కట్టిచ్చకరా! ఇద్దో-దుడ్లు" అంటూ పదిరూపాయల నోటు ఇచ్చాడు.

"ఇవి మిరపకాయ వడలకి మాత్రమే. విస్కీ, సోడాలకి మళ్ళీ నేను ఇస్తాలే" అని చెప్పేసి వెళ్ళిపోయాడు వేమారెడ్డి.

'అమ్మయ్య బతికిపోతిరాదేవుడా!' అనుకుని జల్లని పొట్టుతో నింపేశాడు నల్లప్ప.

'ఇంతకీ పార్వతి ఎందుకు రాలేదో... మంచి పని చేసింది పొరపాటున వచ్చింటే తన పరిస్థితి ఎట్లుండేది. ఎట్లేమి కచ్చితంగా సంపిపారేసి గడ్డివామికాడే గుంత తీసి పూడ్చిపెట్టేసి పోతాండె' అనుకుంటూ. నిండు జల్ల ఎత్తుకొని ఎద్దుల కొట్టంలోకి పోయాడు.

అర్ధరాత్రి దాటి వుంటుంది.

రాములగుడి అరుగు మీద పదిమంది దాకా పడుకుని ఉన్నారు. అందరూ మంచి నిద్రలో ఉన్నారు. ఒక్క నల్లప్పకి మాత్రం ఎందుకో నిద్రపట్టలేదు. ఈ మధ్య చాలా రాత్రులు ఏవేవో ఆలోచనలతో గడిచిపోతూ ఉన్నాయి. 'ఎవ్వరికీ దక్కని పార్వతి తనకి దక్కడం నిజంగా తను జీవితంలో ఊహిం

చనిది. కటిక పేదకు లంకె బిందెలతో బంగారు నాణేలు దొరికినట్లుంది. మాల గేర్లో పార్వతి విషయం చెబితే ఎవరయినా నమ్ముతారా? తిక్క నాకొడుకుని చూసినట్లు చూసి నగుతారేమో. నిజమే ఎవ్వరికి చెప్పినా నమ్మలేనిదే మరి తన జీవితంలో జరుగుతా ఉండేది. పార్వతి ఎవరు? గొంచికాని కూతురు. తను ఎవరు? గొంచి కానికి జీతగాడు. అదీ ఎట్లా? గొంచికాడు కానీ, అతని ఇంట్లోని ఎవరయినా కాలితో పనిచెయ్యమని చూసిస్తే తను చేత్తో చెయ్యల్ల. అట్లాంటి నన్ని పార్వతి ఇట్టప డింది. తను కనబడితే సాలు కండ్లు ఇంతింత జేసుకుని జూస్తుంది.

అయితే ఇదంతా ఎవరన్నా చూస్తే తన పని కడా!, ఆ మాట అనుకుంటూనే అందాకా ఉన్న ఉత్సాహమంతా నీరు కారిపోయింది. గుండె దడదడలాడింది. సందకాడ తన వెనకాల నిలబడింది పార్వ తేననుకొని ఏందన్నా మాట్లాడివుంటే ఏమై పోతుంటినో ... థూ! థూ!! ఇంక ఇట్లాంటి



పని మానుకొనల్ల. రంకూబొంకూ దాగదని అంటారు. ఏదో ఒకనాడు అది బయటపడి పోతాది. ఇన్ని భయాలూ పార్వతి కనబడే వరకేనా? ఆయమ్మ కనబడతానే అన్నీ ఎక్కడికి పోతాయో... ఏమయితే అది అయిందిలే అనే తెగింపు వచ్చేస్తాది' ఇలా సాగుతున్నాయి నల్లప్ప ఆలోచనలు.

★ ★ ★

ఉదయమయింది.

రంగయ్య స్వతహాగా మంచివాడే. ఎవరి జోలికీ వెళ్లనివాడే... అయినా ఒక్కోసారి గొడవలు వాటంతట అవే జరుగుతుం టాయి. ముందురోజు రాత్రి జరిగిన గొడవ అతన్ని బాగా కలవరపెట్టింది.

'శ్రీరాములు ఎవరు? తన తమ్ముడు. తను తాగి విడిచిన ఎంగిలి చన్ను తాగి నోడు. అట్లాంటి వానిమీద తనకి కూడా కొంచెం ప్రేమ ఉండల్ల. ఎవరితోనో శత్రు వుతో మాట్లాడినట్ల మాట్లాడితే ఎట్ల? అయినా వాడు అడిగేదాంట్లో ఒక పద్ధతి పాడూ ఉండల్లా వద్దా?'

అప్పట్లో పెద్దమనుషులు ఎదురుగా పది ఎకరాల భూమిని పంచుకున్నారు ఇద్దరూ. ఆ పదెకరాల పొలంలో రెండు రకాల నేలలు ఉన్నాయి. అవి మెత్తని నేల, సున్నా రపు నేల. మెత్తని నేల ఎర్రగా ఉండేది. సున్నారపు నేల తెల్లగా వుండే సున్నపురా ళ్లతో నిండిఉండేది.

అన్నదమ్ముల ఆస్తి విభాగాలు చేసుకున్న ప్పుడు సున్నారపు నేల తీసుకున్న వాళ్లకి మెత్తని నేల తీసుకున్నవాళ్లు రెండు వేల రూపాయలు ఇయ్యాల అనే షరతు విధిం చారు పెద్దమనుషులు. అప్పట్లో సున్నారపు నేలనే కోరుకున్నాడు శ్రీరాములు. రంగయ్య దగ్గర రెండు వేలు లేవు. పెద్దమనుషుల తీర్పుకి కట్టుబడి తను అపురూపంగా పెంచుకుంటూ ఉన్న మేకమరకల్ని అమ్మి ఇంకా తక్కువ వచ్చినదానికి అప్పుచేసి రెండు వేల రూపాయలు తమ్ముడికి ఇచ్చాడు.

ఇది జరిగి అయిదేళ్ళకి పైబడుతూ ఉంది. అయితే ఉన్నట్టుండి గతరాత్రి తనని మోసం చేసినాడని రంగయ్యమీదకి కొట్లా టకి వచ్చాడు. అతను బాగా తాగి వచ్చినా డని ఏమీ మాట్లాడలేదు రంగయ్య. కానీ, శ్రీరాములు పెండ్లాం పెన్నక్క కూడా మొగుడి మాటకి తాళం వేస్తూ రావడంతో పరిస్థితి కొంచెం అదుపు తప్పింది. రంగయ్య ఊరికే ఉన్నా గంగమ్మ మాత్రం ఊరికే ఉండలేకపోయింది.

"ఏందే కూస్తాఉండావ్! నా మొగుడు నోరు సచ్చినోడని నీ నోటికీ నీ మొగుని నోటికీ హద్దులేకుండా పోతాఉంది. ఏం నీ మొగుడు తాగివస్తే ఈడ యదపడి ఉచ్చలు పోసుకొనేవాళ్లు ఎవురూ లేరు" అంటూ ఒంటికాలిమీద లేచింది.

దాంతో మాలగేరిగేరంతా ఒక్కచోట కుప్పయింది. రంగయ్య మాత్రం అరుగు మీద కూచుని బీడీమీద బీడీ తాగుతానే ఉన్నాడు కానీ శ్రీరాములు జోలికి పోలేదు. లతకు తన తండ్రి ఊరికే ఉండడం నచ్చింది. గేర్లో తమ కుటుంబాలు రెండూ ఊరకనే అల్లరవుతున్నాయే అన్నది ఆమె బాధ.

మాలగేర్లో అన్నదమ్ముల మధ్య భూమి పంపకాలు జరిపినపుడు ఉన్న పెద్దమను షులు నలుగురూ వచ్చి శ్రీరాములకీ, పెన్న క్కకీ సర్దిచెప్పబోతే, వాళ్లనీ తిట్లతో ముంచె త్తారు ఇద్దరూ.

"తూ! ఈ నాలినెక్క ఇట్లా పనికిమాలిన నాయాండ్లకి చెప్పేకంటే బుద్ధితక్కువ పని ఇంకొకటి లేదు" అనేసి అక్కడినించి అటే వెళ్ళిపోయారు ఆ పెద్దమనుషులు.

"ఇద్దో రేయ్! పద్దనికి వస్తా... నాకి మెత్త న్నేల ఇస్తివా సరే సరి. లేదంటివా నిన్ని నరికిపారేస్తా. అడ్డమొస్తే నీ పెండ్లాన్ని నరుకుతా ఏమనుకుండావో. నేను పోలీసో





ల్లకీ జైల్లకీ బయపడే నాకొడుకుని కాదు" అని హెచ్చరించి మరీ పోయాడు శ్రీరాములు.

రాత్రంతా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాడు రంగయ్య.

"ఈ భూమిని తను సంపాదించలేదు. తాత సంపాదించిన ఆస్తి. వాడే, ఆ శ్రీరాములుగాడే అనుభవించనీ... ఊరికే ఏంటికి గలాటా" అనుకున్నాడు.

ఆమాటే గంగమ్మతో అన్నాడు మర్నాడు అన్నం తింటున్నప్పుడు. అంతే...

పూనకం వచ్చిందాని మాదిరి రంగయ్యమీదికి లేచింది. "తమ్ముడంటే ప్రేమ ఉండాల్సిందే. తినీ, కుడిచేదాంట్లో చూపించు ఒద్దనను, కొత్తబట్టలు వాళ్ల ఇంటిల్లిపాదికీ కుట్టియ్యి కాదనను, ఆయప్ప కొడుక్కు కూతురికీ నువ్వే ఖర్చుపెట్టి పెండ్లిచెయ్యి నేను నోరుఎత్తితే ఒట్టు. కానీ, ఇట్ల మనం ఇన్నేండ్లనించి జోకు చేసుకుంటున్న భూమిని కావల్లని అడిగితే మటుకూ ఇచ్చేదిలేదు. ఆ పొద్దు అన్నదమ్ముల భాగాలలో ఆయప్ప కోరుకొనిండే భూమే కదా ఇచ్చిండేది. రెండు వేల రూపాయలు కూడా ఇస్తిమి కదా. ఈ ఐదేండ్లూ తెలకపోయెనా అది ఎట్లా భూమో. ఆ పొద్దే ఇట్లా బుద్ధి మనసులో పెట్టుకొనే ఆ సున్నారపునేలని కోరుకోనింటాడు. అందులోనూ మనం కనికరపడేదట్ల మాట్లాడినాడా? నిజ్జంగా ఆయప్ప నీకి తమ్ముడే అయితే అట్లడుగుతాడా? ఏందో పగదారిని అడిగినట్ల ఆ మాటలేమిటికి? ఒకేసారి కొట్టేవాడు వచ్చినట్ల వచ్చినాడే ఏం వాని దౌర్జన్యము? ఏమిచ్చి పోగొట్టుకొన్నాడు? ఓ... ఇట్లా వాళ్లని శానా మందిని చూసినాము. అది ఉండే, వాని పెండ్లాము కొంపకి మూడు వాకిండ్లు తెరిపించే లంజ... అది ఏమేటు వస్తాది... ఇదంతా నీ మెతకదనం చూసుకొనే"

"సర్లేయే, ఇంగ ఇడిసిపెట్టు" అన్నాడు రంగయ్య. గంగమ్మ గొంతు మాలగేరంతా వినపడుతుందని తెలుసు రంగయ్యకి.

లత ఇదంతా వింటూనే ఉంది కానీ, ఒక్క మాట మాట్లాడలేదు. పాత పత్రికేదో దొరికితే దాన్నే తదేకంగా చూస్తోంది. తల్లి మాటల్లోని నిజానిజాలు తెలుసు. అట్లని తల్లి పరంగా మాట్లాడితే తండ్రి ఎక్కడ నొచ్చుకుంటాడోనని గమ్మున ఉండిపోయింది.

"ఆ పాప మాట్లాడేదాంట్లో నిజముందిరా!" అన్న గొంతు విని తలెత్తి చూశాడు రంగయ్య. కుంటితిమ్మప్ప తన పక్కనే కూచుంటూ "ఒరే రంగడూ! నీ భూమి వాని కియ్యద్దురా. ఏంజేసుకుంటాడో చేసుకోనీ... మెత్తగుంటే మొత్తబుద్ధయితాదంట అట్లుంది" అన్నాడు.

కుంటి తిమ్మప్ప తనపరంగా మాట్లాడ్డంతో శివమెత్తినదానిమాదిరి అయిపోయింది. "అట్ల జెప్పు సిన్నాయనా! నీ యల్లునికి" అంటూ గట్టిగా మాట్లాడ్డం మొదలుపెట్టింది.

'మెత్తని నేలని వదులుకుని ఊర్లో కాపురం జేసేకంటే ఏ అడివికో పోయేది మేలంది. ఇంత మెతువు మనిషితో తను కాపురం చేసేకంటే ఉరిపోసుకొని చచ్చేది మేలని' అంది. 'నీకి రోషంలేదా, మీసం లేదా?' అని ఎత్తిపొడుపు మాటలు అంది. 'ఈ పొద్దు ఈ భూమికావల్లంటాడు, రేపు ఈ ఇల్లు కావల్లంటాడు. ఇంగా ఏందేందో కావల్లంటాడు ఇచ్చుకుంటా పొయ్యేదేనా' అంది.

సరిగ్గా అదే సమయంలో మళ్ళీ శ్రీరాములు ఒకడోసు నాటుసారా వేసుకుని వచ్చాడు రంగయ్య మీదకి. వెంట అతని భార్య ఉంది.

మాలగేరంతా మళ్ళీ ఒక్కసారి గలాటా రేగింది.

ఈసారి రంగయ్య పెదవి విప్పాడు. భార్య మాటలు బాగా పనిచేసినట్లున్నాయి. "రేయ్! ఎక్కువ మాటలతో పనిలేదు. నేను



నా భూమిని ఇయ్యను. నీ దిక్కు ఉండే చోట చెప్పుకోపో! ఇంగ ఇక్కడ ఒక్క నిమిషము ఉన్నవంటే నీ ప్రాణాలు తీస్తాను పో!!" అన్నాడు. నిప్పులు కక్కుతున్న కళ్లతో గొంతులోని తీవ్రస్థాయి కూడా శ్రీరాముల్నీ, అతని భార్యనీ ఒక్కక్షణం నోటమాట రాకుండా చేసింది.

ఒక్కసారి రంగయ్యవైపు నిస్పృహతో చూసి "ఎట్ల ఇయ్యవో అదీ జూస్తా!" అంటూ వదరుతూ అక్కడినించి పెండ్లాన్ని చేయిపట్టుకుని "రాయే... నేను అంటే వీనికి లెక్కేంలేకుండా ఉంది. నా తడాఖా చూపిస్తా! రేయ్! నీ కీళ్లు ఇరగదీసేది ఎట్లో నాకి తెలుసురా! గొర్రెని అడిగి మసాలా పెట్టకూడదని ఇప్పుడేరా తెలిసింది" అంటూ పెళ్లాంవైపు తిరిగి "రాయే, పోదామి" అంటూ పెళ్లాన్ని లాక్కుంటూ తను ఊగుకుంటూ వెళ్ళిపోయినాడు.

"రేయ్ నీయట్ల నా కొడుకులు నా ఎంటికలు కూడా పీక్కోలేరు పోలే! నేను తెగించిన నా కొడుకుని. ఏందో నా తమ్ముడు కదా అని ఊరికే ఉంటే జాస్తీ చేస్తాఉండాడు" అంటూ ఆవేశంతో మాట్లాడుతూ వున్నాడు రంగయ్య. ముచ్చటగా చూసింది మొగునివైపు. ఇప్పుడు తన మొగుడు అనిపించుకున్నాడు అని ఆమె భావం.

లతకి కూడా తండ్రి చేసిన పని మంచిదే అనిపించింది. ఐదు నిమిషాలో అక్కడ గుంపయిన జనం ఒక్కరొక్కరే వెళ్ళిపోయారు.

యూనివర్శిటీలో క్లాసులు ఆ మరుసటిరోజునించి జరుగుతాయని లత ఆ సాయంత్రానికల్లా హాస్టలు చేరుకునేందుకు మధ్యాహ్నం బస్సుకే అనంతపురానికి వెళ్ళిపోయింది.



నల్లప్ప ఉరుకుల పరుగులమీద మాలగేరివైపు నడక సాగించాడు.

హనుమంతరెడ్డి ఇంటి ఆవరణలో జరిగిన విషయం అతన్ని కలవరపెడుతూ ఉంది.

నిజానికి అతను ఎప్పుడో కాని వేమారెడ్డి ఇంటినించి హనుమంతరెడ్డి ఇంటికి పోడు. ఆరోజు వేమారెడ్డి

అతనికి అయిదువేల రూపాయలు ఇచ్చి హనుమంతరెడ్డికి అందచేసి రమ్మని పంపాడు.

హనుమంతరెడ్డి ఇంటి గేటు దాటుతుంటే శ్రీరాములు, అతని భార్య అక్కడ చేతులు కట్టుకొని నిలబడి ఉండటం కంటపడింది నల్లప్పకి. తను తెచ్చిన డబ్బు ఇచ్చేందుకు హనుమంతరెడ్డిముందు కాసేపు నిలబడినప్పుడు,

"నన్ని మా యన్న మోసం చేసినాడు గొంచికాడా! పెద్దమనుషులకి సారాయి తాపిచ్చి, తను మెత్తని నేలని కొట్టేసి, నాకి సున్నారపు నేల ఇచ్చినాడు. ఇన్నాళ్ళూ యాడన్నా పాడయిపోనీలే అని ఉంటి. ఈ పొద్దునాకి పెండ్లికి ఎదిగిండే బిడ్డ వుంది. దాన్ని ఎవురికన్నా ఇచ్చి చేయల్లంటే నా భూమిని అమ్మల్ల... అది సున్నారపు నేల, దాన్ని ఎవురు కొనుక్కుంటారు. అందుకే గొంచికాడా! నాకు మెత్తని నేల ఇమ్మని అడిగినా... ఇయ్యలేదు. పైగా వాడేమంటాడు. ఎవునితోనన్నా చెప్పుకో నాకు భయంలేదు అని. నీతో చెప్తాను అంటిని గొంచికాడా! ఆ మాటకి భయపడిపోతాడనుకుంటి. ఊహూ... పైగా ఏమి ఆ గొంచికాడయితే నావేమీ తెంపుకోలేడు. అని నోటికొచ్చినట్లు మాట్లాడినాడు గొంచికాడా" అంటూ చెబుతున్నాడు.

నల్లప్పకి తెలుసు రంగయ్య మామ ఏ రెడ్డి గురించి కానీ ఒక్కమాట కూడా అనడని. శ్రీరాములు కూడా అతనికి మేనమామే. అయినా, తమ కుటుంబ విషయాలు రచ్చకెక్కుతుంటే చాలా బాధపడ్డాడు. ఆ మాటలు రంగయ్య మామ అని వుండడని గొంచికాళ్ళ ఎదుట చెప్పలేదు.





'వాని కథ నేను జూసుకుంటా' అంటూనే నల్లప్ప ఇచ్చిన డబ్బుని లెక్కచూసుకొని ఓబుళేసుకి ఇచ్చి నారపరెడ్డికి ఇమ్మని చెప్పాడు.

'నువ్వింక పోవచ్చు' అన్నట్టు తల ఊపు తోనే ఆజ్ఞాపించాడు నల్లప్పని హనుమంత రెడ్డి.

నల్లప్ప గబగబా అంగలేస్తూ బయటప డ్డాడు. రంగయ్యా మామకి ఈ విషయం తెలియచేయకుంటే గొంచికాళ్ళ దెబ్బలకి బలయిపోతాడు.

రంగయ్య ఇల్లు చేరుకునేటప్పటికే ఇంటి ముందరున్న అరుగుమీద వేపచెట్టు నీడలో పండుకుని గాల్లోకి చూస్తూ ఉన్నాడు.

నల్లప్ప అతన్ని లేపి విషయమంతా చెప్పాడు.

అంతా వింటూ వుంటే రంగయ్య గుండెల్లో పిడుగులు పడినట్లు అయింది.

గంగమ్మ తల వాకిట్లో నిలబడి అంతా వింది.

నల్లప్ప వెళ్ళిపోయాడు.

అరుగుమీద కూర్చున్న రంగయ్య శిలలా చేష్టలుడిగి అట్లా ఉండిపోయినాడు. వెన్నులోంచి వణుకు, గుండెల్లో దడ క్షణక్ష ణానికీ పెరుగుతోంది.

గంగమ్మ తడబడుతూ నడుస్తున్నట్టు వచ్చి మొగుడి భుజాన్ని పట్టుకుంది. కొంచెం కదిలించింది. అయినా తేరుకోలేదు రంగయ్య.

"ఎట్లనే... నాకేందో బయంగా ఉందే" అంది కీచు కంఠంతో. "ఏం నిన్నే... ఎందే అట్ల నోరు తెరుచుకోని ఉండిపోతివే" అంటూ గుడ్లల్లో నీళ్ళు పెట్టుకుని మరింతగా కదిలిచ్చింది రంగయ్యను.

"ఊ" అన్నాడు.

తన భయాన్ని చెప్పింది గంగమ్మ.

"అవునే యాడన్నా పాడయిపోనీలే అని వాడు కోరిన మెత్తని నేల ఇచ్చి వుండినా సరిపొయ్యేది. హనుమంతరెడ్డి గొంచికాన్ని నేను ఏందేదో అన్నేనని చెప్పినాడంటనే శ్రీరాములుగాడు ఇప్పుడెట్లే"

రంగయ్య గొంతులోంచి శబ్దం రావడం లేదు, వట్టి గాలి మాత్రమే వస్తున్నట్లు మాట్లాడుతున్నాడు.

"నాదేనే. తప్పంతా నాదే. నువ్వు యాడ ఆ మెత్తని నేలని ఇస్తావోనని నేనే నీకి రోసాలు నూరి పోస్తిని. పాపిస్టిదాన్ని"

"అంతా అయిపోయిందే ఇప్పుడు ఆ భూమి ఇచ్చినా తంతారు. ఇయ్యకున్నా తంతారు. నా ప్రాణాలు తీసేస్తారే" అంటూ కన్నుల్లో నీళ్ళు నింపుకున్నాడు రంగయ్య.

అప్పుడొచ్చాడు కుంటితిమ్మప్ప ఉరుకులు పరుగులమీద.

"ఒరే రంగడూ!" అంటూ వగరుస్తూ, కాసేపు రంగయ్య పక్కనే కూర్చుని ఆయాసం తీర్చుకున్నాక,

"ఇప్పుడే నల్లప్పగాడు చెప్పెరా. అందుకే పరుగెత్తుకోనివస్తి" అన్నాడు.

"అయిపోయిండాది మామా. అంతా అయిపోయిండాది. నన్ని సంపేత్తారు గేరం టుగా నన్ని సంపేత్తారు మామా. అప్పుడే గొంచికాని మనుసులు సిద్ధమయితా ఉన్నా రంట. నా పెండ్లాం, నా బిడ్డా దిక్కులేనోళ్ళు అయిపోతారు మామా. ఈ పొద్దు లేస్తానే ఎవుని మొగము జూస్తినో ఏమో"

"బీడీ వుంటే ఇయ్యరా. నాకి మంచి ఆలో చన వస్తావుండాది"

బనియను జేబులోంచి బీడీ కట్ట తీసి తను ఒకటి అంటించుకొని కుంటితిమ్మప్పకి ఒకటి అందించాడు రంగయ్య. ఆత్రంగా అగ్గిపెట్టె తీసుకుని బీడీ అంటించి గుప్పుగు ప్పుమని పొగ ఊదుతూ,

"మంచి ఆలోచనరా. మంచిదేకాదు సరై నది కూడా"

తను బీడీ అంటించుకున్నాడే కానీ యాంత్రికంగా తాగుతున్నాడు రంగయ్య.

"ఏరా! పలకవు" అడిగాడు కుంటితి మ్మప్ప.



"ఆ మనిషి మనసు మనసులో లేదులే సిన్నాయనా! నాకి చెప్పు" అంది గంగమ్మ.

"ఏం లేదమ్మా. నీ మొగుడ్ని దెబ్బతీసేకి హనుమంతరెడ్డి సాయంకోరినాడు అంటే అగ్గిశరణు కోరినాడు. అది తననీ మిమ్మల్నందర్నీ కాల్చేస్తుందని నీ మొగుని భయం. వాని స్థానంలో నేనున్నా అంతే భయపడతాను. ఇప్పుడు మనం చేయాల్సిన పని ఏమిటీ... వాడు అగ్గిని శరణు కోరుకుంటే మనం నీటిని శరణు కోరదాం"

"ఏంది మామా. నాకు అర్థంకాలే. నీటిని శరణు కోరేదేంది" అని షాక్‌లోంచి తేరుకున్నాడు.



"అవున్రా... తిక్కనాయాలా? ఆ నీరే... సిద్ధారెడ్డి"

"ఆ సిద్ధారెడ్డిని శరణు కోరల్లా... అంటే? "

"మల్లా అంటే గింటే ఎట్లరా? నీ తమ్ముడు ఎక్కడికి పోయినాడు ఎవురి సపోర్టు కోరినాడు. హనుమంతరెడ్డి గొంచికాని సపోర్టు కోరినాడు అవునా... అప్పుడు నువ్వు ఇంకొక ఆలోచన లేకుండా ఆ సిద్ధారెడ్డి గొంచికాని సపోర్టు కోరితే సరిపొయ్యేది"

"ఊహూ... ఏమొద్దు. ఆ గొంచికాళ్ళిద్దరికీ పార్టీలున్నాయని కదా నేను ఎవురి పీకులాటా లేకుండా ఉండింది ఇన్నాళ్ళూ"

"ఇన్నాళ్ళూ సరేరా! ఇప్పుడు మాత్రం నీ తమ్ముడు చేసిన పని అట్లుంది మడి"

"అవునే... చిన్నాయన చెప్తా వుండేది కూడా కరెక్టే. నువ్వు పోయి జరిగిండే సంగతంతా చెప్తే... సిద్ధారెడ్డి గొంచికాడు మనల్ని కాపాడుతాడు" అంది గంగమ్మ.

పెండ్లాం కూడా చెప్పడంతో కుంటితిమ్మప్ప మాట వినక తప్పింది కాదు రంగయ్యకి.

"నేనూ వత్తాపదా ఇద్దరం పోదామి" అంది గంగమ్మ.

"బిరీన పోండ్రి. హనుమంతరెడ్డి మనుసులు వచ్చేలోపల మీరు ఇక్కడ ఉండకూడదు" అంటూ ఆత్రపరిచాడు కుంటితిమ్మప్ప.

అర్థరాత్రి మీరి ఉంటుంది.

రంగయ్యకి ఎంతసేపటికీ నిద్రపట్టడంలేదు.

గంగమ్మ అప్పుడే ఆదమరిచి గుర్రుపెట్టి నిద్రపోతున్నది.

రంగయ్యకి ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

'తను ఎవ్వరిజోలికీ పోకుండా... ఎవరితోనూ మాట పడకుండా జీవించాలని అనుకున్నాడు. ఈ ముఠాకక్షలంటే తను ఎంత అసహ్యించుకున్నాడు. ఆకరీకి తన జతగాడు' చిన్ననాటి నేస్తగాడు ఈశ్వరి ఆ హనుమంతరెడ్డికి అంగరక్షకుని మాదిరి పనిచేస్తా ఉంటే వాడితో మాటలు కూడా విడిచిపెట్టాడు.

అయితే ఈరోజు తను ఏంచేసినాడు.

మరో ముఠాదారు పంచలో చేరినాడు.

ముఠాదార్ల కులాలు వేరుకావచ్చు మనుషులు వేరుకావచ్చు అయితే వాళ్ళ ఆశయం ఒక్కటే ఆధిపత్య పోరు.

ఊర్లో చాలామంది ముఠాదార్ల పంచన చేరినట్లే తనూ చేరాడు.

తను సిద్ధారెడ్డికాడికి పొయ్యేది ఏమాత్రం ఆలస్యం అయినా తను ఈ లోకంలో ఉండే వాడు కాదేమో. కనీసం చేతులూ, కాళ్ళూ విరిచి అవిటోనిగా చేసిండేవాళ్ళు.

అసలు సిద్ధారెడ్డి ఇంటి ఆవరణలోకి అడుగు పెడుతూనే తను ఎందుకో భయప డిపోయాడు. తన పెండ్లాం కూడా భయప డినట్లు ఏందో గొణిగింది. ఎప్పుడో రెండేళ్ళ కిందట వాళ్ళ తోట్లో సేద్యం జేసిందానికి కూలి ఒడ్లకోసరం పోయినాడు అక్కడికి. అప్పుడు ఇప్పటి మాదిరి లేదు. మామూలు భూస్వామి ఇల్లు ఎట్లుండేదో అట్ల ఉండేది. ఇప్పుడు ఆ ఇంటి కాంపౌండులో బరిసెలు పట్టుకొని ఉండే బలిష్ఠులైన మనుషులు, తుపాకులు చేతులో పట్టుకొని తిరిగే గన్‌మే న్‌లూ ఉన్నారు' అన్నీ గుర్తొస్తున్నాయి రంగయ్యకి.

వరండా ముందర రంగయ్య, గంగమ్మలు చేతులు కట్టుకుని కొంచెం వంగి నిలుచని ఉన్నారు.

కొంచెంసేపటికి సిద్ధారెడ్డి నవ్వుతూ పెద్ద పెద్ద మీసాల్ని ఎడంచేత్తో సవరించుకుంటూ అక్కడ ఉన్న కుర్చీలో కూచున్నాడు.

రంగయ్య, గంగమ్మలు దండాలు పెట్టుకు న్నారు.

"ఏ రంగడూ ఏం భయపడకు. నాకు తెల్సు నువ్వు ఇక్కడికి వస్తావని, నీ కోస రమే ఎదురు చూస్తావుండా. ఇప్పటికీ నువ్వు రాకుండా వుండి వుంటే నీ ఇంటికా డికి మనిషిని పంపి ఇక్కడికి పిలిపిస్తా వుంటిని" అన్నాడు సిద్ధారెడ్డి.

ఆ మాటలకి రంగయ్య, గంగమ్మలిద్దరూ ఆశ్చర్యపోయారు.

'ఎంత ఎక్కువ బుద్ధి, ఎంత ఎక్కువ మనసు. ఎక్కువ మనుసులకి ఎక్కువ బుద్ధే ఉంటుందంటేమో... తమట్లా వాళ్ళ మీద కూడా ఎంత సల్లనిసూపు'

మనసులో ఎన్నిమాటలు అనుకున్నా బయటికి ఒక్కమాటా అనలేకపోతూ ఉన్నాడు రంగయ్య.

"నీ తమ్ముడు శ్రీరాములుగాడు నా ప్రత్యర్థి హనుమంతరెడ్డిగాని దగ్గరికి పోయి నాడంటే... ఆటోమాటిగ్గా నువ్వు మా మని షివనే మా లెక్క. నిన్ను ఆదుకోవడం మా విధి. తెల్సిందేరా! ఇంక నువ్వు దిగులు పడ మాకు. నీమింద ఈగవాలిందా... ఆ ఈగని నామరూపాలు లేకుండా నలిపి పారేసే భాధ్యత నాది"

'తను ఎట్ల చెప్పల్లా... ఏమి చెప్పి సిద్ధా రెడ్డి శరణుకోరల్లా' అని తటపటాయిస్తూ అక్కడికి అడుగుపెట్టిన రంగయ్యకి సిద్ధా రెడ్డి మాటలు అలవిగాని సంతోషాన్ని కలు గచేసినాయి.

"నువ్వు ఇంటికి పో. నా మనుషులు నిన్ని ప్పటినుంచీ నీడమాదిరి కాపలా కాస్తా ఉంటారు. ఇంక నువ్వు నిశ్చింతగా నిద్రపో"

ఆ మాటలు వింటున్నప్పుడు రంగయ్య, గంగమ్మలకి తమ ఇలవేలుపు చెన్నరా యుడు ఎదురుగా నిలబడి వరాలు ఇచ్చి నట్లు అనిపించి రెండుచేతులూ ఎత్తి నమ స్కరించారు.

తలతోనూ, కళ్ళతోనూ ఇంక నిర్భయంగా వెళ్ళిపోండి ఏం ఫర్వాలేదు అన్నట్టు సంజ్ఞ చేశాడు సిద్ధారెడ్డి.

వెనక్కి తిరిగి రెండడుగులు వేయగానే...

"ఇదో రంగడూ... ఇంకనుంచి ఇక్కడికి నువ్వు ఎప్పుడు రావాలన్నా నేరుగా రావచ్చు. నీకు మనుషులు కావాలా, దుడ్లు కావాలా? ఏంది కావాలన్నా సంకోచించ కుండా అడుగు అర్థమయిందా? ఎట్లబ్బా ఇంత పెద్ద గొంచికాడిని అడిగేదీ అనే ప్రశ్న నీకి రాకూడదు. ఏమీ? దేవుని దయ వలన నాకి మనుషులకీ, దుడ్లకీ కొదవ లేదు. చూస్తివికదా... ఈ ఇరవైమంది ఎవరూ? నా మనుషులు... నామింద ఈగకానీ, దేగకానీ వాలనీకుండా కంటికి రెప్పా కట్ల చూసుకునే నా మనుషులు. ఒక రకంగా చెప్పల్లంటే వీళ్ళే నా సైన్యం.

ఇట్లాంటాళ్ళు ఇంకా చానామంది ఉండారు. ఇందర్ని ఎట్లా పోషిస్తావుండానో ఆ దేవునికే తెలియల్ల. ఆ హనుమంతరెడ్డిగాని మాదిరి దొంగసారా అమ్మించి, అడ్డమైనవాళ్ళతో దుడ్లు వసూలు చేయిచ్చేది. ఇవన్నీ నాకిలేవు. మడి ఎట్లా సాకుతాండావు ఇంత మందిని అని అడిగేవు... వాళ్ళ బలహీనతలే నా బలం..." అంటూ సిద్ధారెడ్డి చెప్తూ వుంటే అంత వివరణతో తన ఎందుకు చెప్తున్నాడో అర్థంకాలేదు రంగయ్యకి.

ఎందుకో ఆ క్షణంలో అనిపించింది రంగయ్యకి. తను సరైన చోటుకే వచ్చాడని. ఇంక తనకేం భయంలేదు. తను కొండంత దేవుని అండలో ఉన్నాడు. ఇన్నాళ్ళూ తను ఒంటరి. ఇక సిద్ధారెడ్డి వర్గంలో తానూ ఒకడు. ఇంక తను ఎవర్నీ లెక్కచేయడు. కొండను కూడా ఢీ కొడతాడు. దాన్ని పిండి చేస్తాడు కూడా.

సిద్ధారెడ్డి దగ్గర మరోసారి సెలవు తీసుకొని బయటికి వచ్చేశాడు.

రంగయ్య, గంగమ్మ మాట్లాడకుండా నడుస్తున్నారు.

రంగయ్య మాత్రం మామూలుగా నడవడంలేదు. ఆ నడకలో నిటారుతనం ఉంది. ఎదల్లో పొగరు ఉంది. గుండెల్లో నిర్లక్ష్యం ఉంది.

గంటక్రితం నిలువెల్లా వణికిపోయిన రంగయ్య కాదు ఇప్పుడు. గుండెకు రోమాలు వచ్చిన రంగయ్య నడుస్తున్నాడు. ఎవ్వరు తనని బెదిరించినా లెక్కచేయడు. పైగా వాళ్ళకే వణుకు పుట్టేట్టు చేస్తాడు.

గంగమ్మ నిద్రలోనే అటు తిరిగి పడుకుంది.

తనలోని మార్పుని గమనిస్తూ వుంటే తనకే ఆశ్చర్యంగా ఉంది. ఏదో అలికిడి అయినట్టు అనిపించింది.

దిగ్గున పైకి లేచాడు.

ఒంటేలుకని బయటికి వెళ్ళేందుకు తలుపుతీసి బయటికి తొంగిచూశాడు.

ఎవరో ఇంటిముందరే నిలబడి ఉన్నారు.

దూరంగా రాముల గుడిముందరవున్న వీధి దీపపు కాంతిలో అతన్ని కొంచెం పరిశీలనగా చూశాడు. గోచిపంచె పైకి ఎగ్గొట్టి ఉన్నాడు. బనియన్‌లోనించి అతని కండరాలు నల్లగా కనిపిస్తూ వున్నాయి.

ఇంతకూ అతనెవరూ? హనుమంతరెడ్డి మనిషా?

అట్లా అనుకుని అదిరిపోలేదు. వెంటనే కొట్టం చూరులోనించి కొడవలితీసి పట్టుకున్నాడు. ధైర్యంగా బయటికి వచ్చి-

"ఎవురప్పా అక్కడా? ఏమిటికి అక్కడ ఉండారు? " అన్నాడు గొంతులో ఎనలేని తెగింపు, ధైర్యం, మొండితనం వున్నాయి.

"నేను రంగయ్యా-ఎగవగేరి రామన్న కొడుకు వన్నప్పని. సిద్ధారెడ్డి గొంచికాడు నన్ని ఈడే ఉండమని డ్యూటీ ఏసినాడు" అంటూనే దగ్గరకు వచ్చి- నువ్వు ఏమీ భయపడవాకు. యానాకొడుకు వస్తాడో రానీ నేను కత్తికొక కండగా నరికి పారేస్తా నా దగ్గర యాట కొడవలి ఉందిలే"

ఎగవగేరి వన్నప్ప అంటే బోయోళ్ళపిల్లోడు.

ఒక మాలవాడికి కాపలాగా బోయవాడిని పెట్టినాడా సిద్ధారెడ్డి గొంచికాడు.

మామూలుగా అయితే ఇది జరిగేపనేనా?

"నువ్వక్కనివే ఉండావా వన్నాప్పా! నేను నీకు తోడుగా ఉంటాలే" అన్నాడు రంగయ్య.

"నేను ఒక్కడినేంకాదులే... అయిదారు మందిమి అక్కడా అక్కడా ఉండాం. నువ్వుపో... నిశ్చింతగా నిద్దరపో నీమీద ఈగవాలనీ కూడదని గొంచికాడు ఆరుడు ఏసినాడు" అన్నాడు.

ఒంటేలుకి పోయివచ్చి పడుకున్నాక, "అబ్బా! ఎంత ఎక్కువైనోనివయ్యా సిద్ధారెడ్డి గొంచికాడా... అనిండేమాట నిలుపుకుంటా ఉండావే" అని మనసులోనే మెచ్చుకుంటూ,




మొక్కుకుంటూ ఉన్నాడు.

'సిద్ధారెడ్డి గొంచికాని రుణం తీర్చుకోవ ల్లంటే తన చర్మంతో చెప్పులు కుట్టించి ఇయ్యాల్సిందే' ఇట్లా అనుకుంటూ ఉంటే అతని అణువణువూ కృతజ్ఞతాభారంతో నిండిపోతూ వుంది.

★ ★ ★

లత అనంతపురానికి వెళ్లిందేకానీ ఎందుకో తన మనసు మనసులో లేకుండా వుంది.

'ఎప్పుడూ కోపమన్నదే తెలియని తండ్రి కోపంతో చిన్నాయనమీద విరుచుకుపడినా డంటే...

జరగరానిది ఏమయినా జరిగిందేమో...

మళ్ళీ ఏదన్నా గలాటా జరిగి ఇద్దరూ కొట్టుకున్నారేమో...

నాయినకేమన్నా దెబ్బలు తగిల్నాయో ఏమో...

వెనకాముందు ఆలోచించకుండా అసలు తను ఇల్లు విడిచి ఎందుకొచ్చినట్టు. ఛ! కొంచెమన్నా ఆలోచించేదిలేదా?'

మొత్తానికి ఏదో కీడు శంకిస్తూనే వుంది లత మనసు. రాత్రంతా విపరీతమైన ఆలో చనలతో నిద్రను చెడగొట్టుకుంది. అందుకే పొద్దున్నకల్లా తిరిగీ ఊరు చేరుకుంది.

జరిగిన విషయమంతా తల్లి చెప్పింది.

తండ్రి మాత్రం గోడకి ఆనుకుని బీడీ తాగుతూనే వున్నాడు.

దేనికి భయపడి ఇంతకాలం దూరంగా ఉన్నాడో... అందులోకి పూర్తిగా కూరుకుపో యిన తండ్రిని చూస్తుంటే లతకి దుఃఖం పొంగుకొచ్చింది.

"నువ్వు కూడా పార్టీలో దిగిపోతే ఎట్ల నాయనా! వొద్దు నాయనా, మనకి యీపా ర్టీలు వద్దు, మనం ముగ్గురం ఈ ఊరు విడిచిపోదాం. ఎవరన్నా సంపుతారేమోననీ, ఎవర్ని చంపాల్సి వస్తుందోననీ ఎప్పుడూ సుడిపడిపొయ్యేకంటే" అంది కూడుకుపో తున్న గొంతుతో లత.

"తప్పేదు తల్లీ అవతలి వాళ్ళకి యదపడ కూడదు అంటే మనము ఇవతలివాళ్ళతో కలిసి ఉండల్లంతే... ఇప్పుడు నాకి ఏను గంత బలముందమ్మ. నేను ఏమో అను కుండానుకానీ, ఆ సిద్ధారెడ్డి మహానుబావుడు బొలే ఎక్కువయినోడు" అంటూ రంగయ్య సిద్ధారెడ్డిని కీర్తించడం మొదలుపెట్టాడు.

దానికితోడు తల్లి కూడా వంత పాడింది.

లతకి కోపం నసాలానికి అంటింది.

"ఇదంతా ఒక కుట్ర నాయనా, వాళ్ళు ఒక ఆపద నీకు కలిగినందుకు రక్షించారు. నువ్వు వాళ్లను అనేక ఆపదల్నించి రక్షి స్తావు. ఆ విషయం వాళ్లకి తెలుసు. వాళ్ళ స్వార్థానికి నువ్వు బలయిపోయినావు నాయనా" అంటూ ఆక్రోశించింది లత.

"నాకు అంతా తెలుసునమ్మా! నన్ను ఆప దలో కాపాడిన మనిషికి నేనెట్ల దూర మైతా" అన్నాడు నింపాదిగా రంగయ్య. గంగమ్మకి కూడా మొగుని మాటల్లో నిజం ఉందనిపించింది.

వాళ్లిద్దరి మాటలు వింటూంటే కంపరం పుట్టింది లతకి. "మీ ఇష్టం... మీది" అనే సింది. అక్కడ ఉండాలనిపించక సాయం త్రానికల్లా అనంతపురం బస్సు ఎక్కి వెళ్లిపో యింది.

★ ★ ★

రంగయ్యకి సిద్ధారెడ్డిపట్ల వున్న కృతజ్ఞ తలే అనతికాలంలో అతన్ని సిద్ధారెడ్డి కుడి భుజంగా మార్చేసింది.

ఇప్పుడు సిద్ధారెడ్డి కాలు బయటపెట్టా లంటే గన్‌మెన్‌కంటే ముందు రంగయ్యా ఉంటున్నాడు.

సిద్ధారెడ్డికి రంగయ్యా కవచం... అంకరక్ష కుడూ... అన్నీనూ.

★ ★ ★

పొద్దున్నే చద్దన్నం ఇంత తినీ, ఒక పెద్ద గ్లాసుడు కాఫీ తాగేసి అరుగుమీద నింపా దిగా కూర్చుని కొత్త బీడీ కట్టలోనించి బీడీ తీసి అంటించుకున్నాడు రంగయ్య. సిద్ధా

రెడ్డి అతన్ని, పొద్దున్నే రమ్మన్నాడు. అందుకే అంత త్వరగా తయారయ్యాడు. రంగయ్యకి రోజూకంటే ఈరోజు చాలా ఉత్సాహంగా వుంది. ఎందుచేతనంటే...

'పేటలో పోలీసు ఇన్‌స్పెక్టరు చిన్నకొత్త పల్లి ఫ్యాక్షన్ నాయకులిద్దర్నీ రాజీ కుదిర్చేందుకు రమ్మన్నాడు. నిజంగా అదే గనుక జరిగితే తనకి అంతకంటే కావాల్సిందేమీ లేదు.

అసలు పోలీసోల్లు తలుచుకోవల్లేగానీ జరగనిది అంటూ ఉంటుందా?

కచ్చితంగా రాజీ కుదిర్చి తీరతారు.

తనకు ఆ నమ్మకముంది.

ఇంకనించీ స్వేచ్ఛగా హాయిగా ఉండొచ్చు

ఎవరితోనూ కొట్లాటలూ, పీకులాటలూ లేకుండా బతకవచ్చు

ఇప్పుడున్న జీవితమంటే అతనికి ఏహ్యాంగా వుంది.

ఎవరి జోలికీ ఏనాడూ పోకూడదని ఎంతో పట్టుదలతో ఉన్న తను కడాకి సిద్ధారెడ్డి పార్టీ నాయకుని నీడలో బతకాల్సివచ్చింది.

ఈ బతుకు దిన దిన గండం.

మళ్ళీ అనాల్సివస్తే క్షణక్షణగండం.

తను సిద్ధారెడ్డి దగ్గర చేరి ఆరు నెలలు అవుతోంది. అప్పటినించి మాలగేర్లో తనకు అతి దగ్గర బంధువులు కూడా మనసారా మాట్లాడరు. తన పెండ్లాన్ని ఎవరుపడితే వాళ్ళు కూలికి పిలవరు. ఇంక లతమ్మకు ఈ గొడవలు కొట్లాటలంటే అయిష్టం. ఎప్పుడో సెలవులప్పుడు వచ్చినా అంటీముట్టనట్టుగా మాట్లాడుతుంది. ఇంక అట్లాంటిదేమీ ఉండదుకదా... హాయిగా ఇంట్లో గడుపుతుంది, అనుకుంటున్నాడు రంగయ్య.

గంగమ్మ వచ్చి పక్కనే కూచుంటూ "ఏమీ ఆలోచనలో పడితివి" అంది.

"ఏమీ లేదులేవే" అన్నాడు మరొక బీడీ వెలిగిస్తూ.

"చేసుకున్న వాళ్లకి చేసుకున్నంత అనీ ఆశకు పాయిరి, గోసిలో రాయిపడి" ఈ మాట ఏ పదిసార్లో అని వుంటుంది గంగమ్మ.

"ఊం ఊం" అన్నాడు రంగయ్య. గంగమ్మ మాట్లాడుతున్నది తన తమ్ముడు శ్రీరాములు గురించీ అతని కొడుకు గురించీ అని తెలుసు.

శ్రీరాములు కొడుకు రామాంజనేయులు డిఎస్సీగా సెలక్ట్ అయినాడు. అయితే బయటి ఊర్లకు మగపిల్లల్ని పంపిస్తే ఏదో ఒక కేసులో ఇరికించి జైల్లో పెట్టిస్తారని, ఇరు ముఠాకక్షల వాళ్లూ పిల్లల్ని ఊరి పొలిమేరలు దాటనివ్వడంలేదు. అందువల్ల రామాంజనేయులు తనకు వచ్చిన ఉద్యోగాన్ని వదిలేసుకోవాల్సి వచ్చింది.

ఆ విషయం కుంటితిమ్మప్ప ఉదయమే వచ్చి చెప్పాడు. గంగమ్మ చాలా సంతోషించింది. అయితే రంగయ్య మాత్రం బాధపడ్డాడు. రామాంజనేయులు అంటే అతనికి ఇష్టం. ఎన్నోసార్లు నోటు పుస్తకాలకీ, పరీక్ష ఫీజులకీ డబ్బులిచ్చాడు. తన తల్లీతండ్రీ చేసింది తప్పే అని మొదట్లో అన్నాడు. గంగమ్మకు కూడా వాడంటే ఇష్టమే. అయినా హాయిగా మునపటి మాదిరి వానితో మాట్లాడదు.

ఇంకేం ఫర్వాలేదు, గొంచికాళ్లిద్దరూ రాజీకొస్తే రామాంజనేయులు కూడా హాయిగా ఉద్యోగం చేసుకోవచ్చు

బీడీ ఆర్పేస్తూనే టక్కునలేచి నిలబడి "పొయ్యొస్తానే" అని చెప్పేసి చెప్పులేసుకొని టకటక అడుగులేస్తూ వెళ్లిపోయాడు రంగయ్య.

★ ★ ★

పట్నంలో ఇన్‌స్పెక్టరు చెప్పినట్టుగానే ఉదయం తొమ్మిదింటికల్లా పోలీసు స్టేషను చేరుకున్నారు సిద్ధారెడ్డి అతని వర్గము. రంగయ్య సిద్ధారెడ్డికి నీడమాదిరి వెనుకే ఉన్నాడు.




అది వేసవి కాలమైనా ముందు రోజు రాత్రి బాగా వాన వచ్చినందువల్ల కొంచెం చల్లగానే ఉంది వాతావరణం. ఆకాశం అంతా మబ్బుపట్టి ఉంది. మళ్లీ ఏ క్షణా న్నైనా వానవచ్చే అవకాశం ఉంది.

"ఇంకా రెండు రోజులు ఉంటుందంట తుపాను. పేపర్లో రాసినారు" అంటూ హెడ్డు కానిస్టేబులు పక్కనున్న కానిస్టేబు లుతో చెబుతున్నాడు.

కాసేపటికి ఇన్‌స్పెక్టరు వచ్చాడు. సిద్ధారె డ్డిని చూసి నవ్వుతూ "వెపన్సు లేకుండా రమ్మన్నాను. తెచ్చినారా? " అడిగాడు.

"మీరు తేవద్దు అని చెప్పినాక ఎట్ల తెచ్చు కుంటాం సార్!" అన్నాడు సిద్ధారెడ్డి చిరున వ్వుతో.

"వెరీగుడ్, వెరీగుడ్... ఇంకో గంటకల్లా హనుమంతరెడ్డి వాళ్లు వచ్చేస్తారు. కాంప్ర మైజ్ చేస్తాను. అయిపోతుందిలే. అసలు ఇట్లా కాంప్రమైజ్ అయ్యేకి మీరు ఒప్పుకుం టారో లేదోనని నేను భలే ఆందోళన పడి నాను. ఏమైతేనేం మీరిద్దరూ నా మాటను గౌరవించినారు. ఇంకనించీ మీ చిన్నకొత్త పల్లి ప్రశాంతమైన ఊరు అయిపోతుంది. కొట్లాటలుండవు. బాంబు దాడులు వుండవు. రాళ్లు రువ్వుకోడాలు వుండవు. నరుక్కోడాలూ, చంపుకోవడాలూ ఉండవు. ఇవన్నీ ఉండవు కాబట్టి హాయిగా పొలాలు దున్నుకుంటూ రైతులూ, కలుపులేసు కుంటూ పాటలు పాడుకుంటూ కూలీలు... గడుపుతుంటారు కాలాన్ని. చూడయ్యో, సిద్ధారెడ్డీ! ప్రశాంత వాతావరణం అంటూనే నాకి పాటలూ, కవిత్వం అన్నీ వచ్చేస్తు న్నాయి"

రంగయ్యకి ఇన్‌స్పెక్టర్ మాటల్లో ఏదో తేడా కనిపించింది. ఇరు పార్టీలవాళ్లని తొమ్మిది గంటలకే రమ్మనమని చెప్పి పంపింది అతనే. తీరా తొమ్మిదికి తాము వచ్చేటప్పటికి మరో గంటకల్లా వాళ్లు వస్తా రని ఇప్పుడు చెప్పడంలో ఉద్దేశం?

వెంటనే సిద్ధారెడ్డి చెవిలో గుసగుసలతో ఆ విషయాన్నే చెప్పాడు.

తల పంకించి వెంటనే ఇన్‌స్పెక్టరుతో "తొమ్మిదికే వాళ్లూ వస్తారని చెబితే మేము వచ్చినాం. ఇప్పుడు జూస్తే ఇంకా ఒక గంటకి వాళ్లు వస్తారని అంటున్నారుకద సార్! మేము అంత తిరిబేకినా కొడుకు లమా" అన్నాడు సిద్ధారెడ్డి కొంచెం కరకు గానే.

"ఆ అదీ యూసీ మిస్టర్ సిద్ధారెడ్డి! మీరు చెప్పిందీ కరెక్టే. వాళ్లకేదో ప్రాబ్లమ్. అదే జీపు. ఆ జీపు పంక్చర్ అయిందికాబట్టి గంటలేటు అని అన్నారు. అదే ఫోన్‌లో చెప్పారు. మీకేం ఫర్వాలేదు. మీరు స్టేషను బయట ఉండే స్కూల్ షెడ్డులో ఉండండి. వాళ్లు వస్తూనే కబురంపుతాను మా కానిస్టే బుల్‌తో. మీరూ వచ్చేద్దురు"అన్నాడు ఇన్ స్పెక్టరు.

అతనిలోని తడబాటు రంగయ్య అనుమా నాన్ని మరింత ఎక్కువ చేసింది.

స్టేషనుకు కుడివైపున వుండే జిల్లా పరి షత్ స్కూలు షెడ్స్‌లోకి వెళ్లి కూచున్నారు. ఆ రోజు ఏదో వ్రతం ఉండటంవల్ల ఆ స్కూలుకు సెలవు ఇచ్చారు.

రంగయ్య మనసు ఏదో ఆలోచిస్తోంది. కీడుశంకిస్తూనే ఉంది.

"గొంచికాడా! ఎదురుంగా స్కూలు బిల్డింగు వుందే దాని మీదికెక్కుతా. అక్క డినించి అవతల రోడ్డు కనిపిస్తుందని నా అంచనా. పోదునా" అనడిగాడు రంగయ్య.

సిద్ధారెడ్డి, రంగయ్యవైపు ఓరకంట చూసి పెదాల చివర్లతో ఒక వంకర నవ్వునవ్వి వెళ్లమన్నట్టు తల ఆడించాడు.

చెప్పిందే తడవుగా టకటకమని వెళ్లి స్కూలు వాచ్‌మెన్‌తో ఏం చెప్పినాడో ఏమో! పొమ్మన్నాడు. అంతే నిమిషంలో రెండంతస్తుల భవనంపైకి చేరుకున్నాడు.

రంగయ్య ఊహించినట్లే చిన్నకొత్తపల్లి నించి వస్తున్న రోడ్డు కనబడుతోంది అక్క

డినించి.

ఐదు నిమిషాలపాటు అక్కడే చూస్తూ వున్నాడు. తను అతి తెలివితో ఆలోచిస్తు న్నాడా? ఊరకనే అందర్నీ బెంబేలెత్తిస్తు న్నాడా? అనిపిస్తోంది. అయినా ఎక్కడో అనుమానపు పురుగు తొలుస్తూవుంది. వెంటనే బీడీ అంటించాడు.

మరో అయిదు నిమిషాలు బీడీ తాగు తూనే గడిపాడు. అతని చూపు ఆ దారి మీదే వుంది.

దూరంగా రెండు టాక్సీలు దుమ్మురేపు కుంటూ వస్తూ వున్నాయి. కొద్దిదూరంలో ఉన్న సోడా షాపు దగ్గరకు వచ్చి నిలి చాయి. అందులోంచి హనుమంతరెడ్డి వాళ్లు దిగారు. అతనితోపాటు దిగిన వారం దరి వద్దా వున్నాయి వేటకొడవళ్లు, తుపా కులు, బరిసెలు గండ్రగొడ్డళ్లు!

ఆయుధాలు లేకుండా రావడమంటే ఇట్లేనా. అంతా మోసం!

అంతే!

ఒక్కక్షణం ఆలస్యం చేయకుండా కిందికి దిగి వచ్చేశాడు రంగయ్య. సిద్ధారెడ్డి చెవిన వేసిందే తడవుగా జీపులు రెండూ స్టార్ట్ అయినాయి. సర్రున అడ్డదారిగుండా అనం తపురంవైపు దూసుకుపోనారంభించాయి.

వాళ్లు అట్లా వెళ్లడం వీళ్ల ట్రాక్సీలు రెండూ రావడం జరిగాయి.

జరిగిందంతా అర్థమయ్యేటప్పటికి పది నిమిషాలు పట్టింది.

తమ ప్లానంతా తలకిందులైనందుకు ఇన్ స్పెక్టరు ముందు తల పట్టుకు కూర్చున్నాడు హనుమంతరెడ్డి.

"దేనికైనా ఆలస్యం పనికిరాదు హను మంతరెడ్డీ! ఇప్పటికైనా తెల్సిందా? బంగా రమట్లా అవకాశాన్ని చేజేతులారా పాడుచే సుకున్నావ్. పదహైదు నిమిషాల ముందు వచ్చివుంటే ఈపాటికి నీకి శత్రు శేషము ఉండేది కాదుకదా" అంటున్నాడు ఇన్ స్పెక్టరు.

★ ★ ★

పోతున్న జీపుని ఆపుజేయించాడు సిద్ధా రెడ్డి.

వెనకాల వస్తున్న జీపు కూడా ఆగిపో యింది.

సిద్ధారెడ్డి జీపులోంచి కిందికి దిగాడు.

"రంగడూ కిందికి దిగరా" అన్నాడు గట్టి గానే.

ఉలిక్కిపడిన రంగయ్య సంశయిస్తూనే కిందికి దిగాడు.

సిద్ధారెడ్డి వెంటనే రంగయ్యని అమాంతం కౌగిలించుకున్నాడు.

"ఒరే రంగడూ! నీ పుణ్యమా అని నేను బతికి ఉన్నానురా! లేకుంటే ఒక గంట క్రితమే నా ప్రాణాలు ఆ హనుమంతరెడ్డి గాని వేటకొడవళ్ల ఏటుకో తుపాకీ తూటా లకో గాల్లో కలిసి పోయి వుండేవి. ఎంత బాగా అంచనా వేసినావురా! తలుచు కుంటూ వుంటేనే పెయ్యంతా పులకిస్తా వుంది. అంచనా వేసిందే కాకుండా ఆ స్కూలు బిల్డింగు ఎక్కి వాళ్ల కదలికల్ని పసికట్టినావు చూడు. నిజంగా నీకి సదువు పూర్తిగా వచ్చివుంటే యాడో ఉండా ల్సినోడివిరా" అంటూ పొగడ్తలతో ముంచెత్తి నాడు.

రంగయ్య ఉక్కిరిబిక్కిరి అయిపోతూ ఉన్నాడు. తను అపాయాన్ని కనిపెట్టక పోయుంటే ఈపాటికి తను ప్రాణాలు వదిలి గంట అయ్యుండేది.

రెండు జీపుల్లో ఉన్న సిద్ధారెడ్డి సైన్యం అందరూ మెచ్చుకోలుగా చూస్తూ రంగ య్యతో కరచాలనం చేశారు.

రెండు జీపులూ తిరిగి వేగం పుంజుకు న్నాయి. రంగయ్య గుండె గర్వంతో పొంగి పోయింది.

★ ★ ★

ఆరోజు పొద్దున్నే నల్లప్ప ఎద్దుల కొట్టంలో గాడిపట్లకి ఆనుకుని కూచుని కల బంద నారతో పగ్గం పేనుతున్నాడు. అప్ప





టికే బారెడు పైన పేనాడు. మరికొంత పేనాల్సి ఉంది.

నారను కొంచెం కొంచెంగా కుడిచేత్తో పెడుతూ పురిపెడుతున్నాడు.

ఆ కొట్టంలోని ఎద్దులు కొన్ని సేద్యానికీ, కొన్ని మేతకి పోయాయి. కొట్టాన్ని మొత్తం పేడా కసువు తీసేసి శుభ్రంగా ఉంచాడు.

కొట్టం చూరు దగ్గర తుమ్మెద ఝుయ్ మంటూ చేస్తున్న శబ్దం తప్ప మరొక చప్పుడులేదు.

అప్పటికే గొంచికత్తె పెట్టిన ముద్ద, వంకాయ ఊరిమిండి కడుపునిండా తినేసి ఉండడంవల్ల హాయిగా ఉంది నల్లప్పకి.

చప్పుడయితే ఎవరు వచ్చినారా? అని తలెత్తి చూశాడు.

పార్వతి!

ఎర్రటి పరికిణీ, తెల్లటి వోణి, జాకెట్టు వేసుకుని ఉంది.

నవ్వుతూ, "నువ్వు ఈడ ఉన్నావా? నేను అనంతపురానికి పోతా ఉండా... నా ఫ్రెండు పెండ్లికి"

"పో" అన్నట్టు తల ఆడించాడు. నవ్వ లేదు. నిర్లిప్తంగా మొహం పెట్టుకున్నాడు.

"నువ్వూ రారా" అన్నది నల్లప్పకి దగ్గరగా వచ్చి

"ఇక్కడ పనో"

"ఎవురో ఒకరు చూసుకుంటార్లే.. మాదిగ నాగన్నగాడు ఉండాడు కదా! కడుపు నొప్పి అను. ఆస్పత్రికి పొయ్యొస్తా నని చెప్పిరా! రెండు గంటలకల్లా గౌరిటా కీస్ దగ్గర ఉంటా. నీకోసం ఎదురు చూస్తా ఉంటా" అని చెప్పేసి పార్వతి వెళ్లిపోతూ ఉంటే.

"నేను రాలేను" అన్నాడు కొంచెం గట్టిగానే.

ఆ మాటకి తిరిగివచ్చింది.

"అట్లనవద్దు... నువ్వు రాకుంటేగీన నేను నీతో ఇంక ఎప్పుడూ మాట్లాడను" అనేసి వెళ్లిపోయింది.

అంతదాకా నెమ్మదిగా, హాయిగా ఉన్న నల్లప్ప మనసును తన మాటలతో సత మతమయ్యేలా చేసిపోయింది పార్వతి.

ఏం చేయడం...

ఎట్లయినా సరే అనంతపురానికి పోతేనే బాగుంటుంది.

పార్వతి కూడా సంతోషిస్తుంది.

ఎట్లా పొయ్యేది?

కడుపునొప్పి వచ్చిందని చెప్పేసి రమ్మ నింది.

చెప్పడం తేలికే... నటించేది ఎంత కష్టం.

అసలు తనకు చాతనయ్యే పనేనా!

పోనీలే ఇట్లన్నా ఆయమ్మ మాట్లాడ కుండా అయిపోతే మేలు. దినదినగండం తప్పిపోయినట్లన్నా ఉంటుంది.

అయినా తను ఉండగలడా ఆయమ్మని వదిలి.

ఎందుకు ఉండలేడూ. ఎవురన్నా జూసి నారంటే ప్రాణాలు ఎప్పుడు గాల్లో కల్సి పోతాయో.

వద్దు వద్దు.

తను అనంతపురం పోడు.

పార్వతి ఎట్లా మాట్లాడదు కాబట్టి హాయిగా ఉండొచ్చు చింతా యదారూ లేకుండా, అనుకున్నాడు.

మధ్యాహ్నం పన్నెండు అవుతున్నప్పుడు ఎరువుబండి వచ్చింది. పొలంలోనించే దాంట్లోకి ఎరువు నింపడానికి రమ్మని కేకే శాడు నల్లప్పని మాదిగ నాగన్న.

పగ్గం పేనడం అయిపోవడంతో కొట్టం బయటికి వచ్చి ఎరువుదిబ్బ వైపు పోతున్న నల్లప్పని "రేయ్ నల్లిగా" అని పిలిచాడు వేమారెడ్డి. ఎద్దుల కొట్టం వెనకాల చింత చెట్టు కింద నిలబడి ఉన్నాడతను.

"వస్తాండా గొంచికాడా" అంటూ అతని దగ్గరకు వెళ్లాడు.

"అనంతపురానికి పోయిరావల్ల"

"నేనా గొంచికాడా? "

"నిన్నేరా దరిద్రం నా కొడుకా... పదో తరగతి వరకూ సదివినావు ఏంటికిరా భయము. పొయ్యా బస్టాండుకు దగ్గర్లోనే ఉంది బ్రాందీషాపు. దాంట్లో రెండు విస్కీ బాటిల్స్ ఫుల్‌వి, మేకడోలు బ్రాండువి తీస కరా" అంటూ ఆరు వంద రూపాయల నోట్లు ఇచ్చాడు.

డబ్బు తీసుకుని అక్కడినించి కదులుతూ ఉంటే "రేయ్ ఇట్లే బస్సు ఎక్కేవు. ఇంటికి పోయి అడ్డపంచె కట్టుకొని అంగీ ఏసుకొ నిపో" అన్నాడు వేమారెడ్డి.

"సరే గొంచికాడా" అంటూ ఇంటి దారిప ట్టాడు.

'అనంతపురానికి పొయ్యే ఛాన్సు వచ్చింది. బస్సు మరికొంచెం సేపట్లో వస్తుంది. అనంతపురం బస్టాండులో దిగేస రికి రెండు గంటలు అయి ఉంటుంది. బస్టాండుకు దగ్గరే గౌరి సినిమాహాలు. తన కోసం పార్వతి ఎట్లా కాసుకొని ఉంటుంది. హాయిగా సినిమా చూసి రావచ్చు' అనుకున్నాడు.

★ ★ ★

సాయంత్రం గడ్డివామి దగ్గర.

"నీకోసం ఎంతగా ఎదురు చూసినానో తెలుసా" అంది పార్వతి.

నల్లప్ప మారు మాట్లాడకుండా గడ్డివామి దగ్గర పొట్టును గంపకు నింపుతూ ఉన్నాడు.

"అసలు అనంతపురానికే వచ్చిన వానివి నాకెందుకు కనిపించలేదు. దీనిమాట నాకొక లెక్కా అనుకుంటివా? అక్కడ మా ఫ్రెండ్స్‌కి నిన్ని చూపియ్యల్లనుకుంటి"

"నేను నీకోసమొచ్చినాను. దూరాన్నించి చూసినా. నువ్వు మీ స్నేహితురాళ్లతో ఉంటివి. నాకే ఎందుకో బుద్ధి పుట్టలేదు. అందుకే ఎనిక్కి తిరిగి వచ్చేస్తి"

"అదే అదే నువ్వు చేసిన తప్పు. వాళ్లు ఎవురూ సినిమాకి రారు. నిన్ను చూపించి మా జీతగాడు వచ్చినాడని వాళ్లతో చెప్పి అట్టే సినిమాకో లేదంటే చెరుకట్ట మిందికో పోతుంటిమిగదా! ఛూఛూ! నీకి కొంచెం కూడా జ్ఞానంలేదురా" అంది బాధపడుతూ.

"ఆ బాగుందమ్మా! మనం అక్కడ చెరువు కట్ట వెంబడి తిరుగుతా ఉంటే ఇక్కడ గొంచి కాడు ఇస్కీ కోసం మొగం వాచి వస్తానే నన్ని ఎగిచ్చి ఎగిచ్చి తంతా ఉండె"

"తంతేనేంరా! మనిద్దరం జాలీగా తిరిగి వస్తుంటిమికదా"

"అవున్లే తన్నేది నిన్ని కాదుకదా" అన్నాడు బుంగమూతి పెట్టుకొని నల్లప్ప.

పార్వతికి జాలేసింది.

వెంటనే నల్లప్పని వాటేసుకుపోయింది. వెనుకనించి నల్లప్ప పార్వతి స్పర్శకి వివశు డవుతాడు మామూలుగా. అప్పుడూ అలాగే అయ్యాడు.

వెనకాముందూ చూడకుండా పార్వతిని తన ముందుకు తీసుకొని బలంగా హత్తుకు న్నాడు.

చీకట్లు ముసురుకుంటున్నాయి.

★ ★ ★

సిద్ధారెడ్డి ఇంటికి రంగయ్య చేరుకునేటప్పటికే మధ్య హాలులో కొంచెం బిగ్గరగానే మాటలు వినబడుతున్నాయి.

ప్రధానంగా సిద్ధారెడ్డి గొంతే వినబడుతున్నది.

ఎవరయి వుంటారో రంగయ్యకి అర్థం కావడంలేదు.

కాసేపు వాకిటి దగ్గర నిలుచుండిపో యాడు.

"నీకి పెద్దోల్లమాటంటే గౌరవం లేదురా. నిజంగా ఉంటే గనుక ఆ స్టూడెంట్స్ ఫెడ రేషన్లలో చేరవు. అసలు మనకు యాల వచ్చిన ఫెడరేషన్లురా. చదువుకోవల్ల రావల్ల అంతే! ఇంక రాజకీయమా. ఇక్కడ తలకె త్తునేంత ఉంది"

అప్పుడర్థమయింది రంగయ్యకి. సిద్ధారెడ్డి గొంచికాడు కొడుకు సుధాకర్‌తో మాట్లాడు తున్నాడని. అంతకుముందు రోజు





సాయంత్రం అనంతపురానికి రైల్లో వస్తే అక్కడినించి రెండు జీపుల్లో పోయి సుధాక ర్‌ని తీసుకుని

వచ్చారు. దార్లోనే కొడుక్కి ఊరి విషయా లన్నీ చెప్పాడు. చివరిగా రంగయ్య తమ ప్రాణాలన్నీ ఎట్లా కాపాడింది వివరించి చెప్పాడు. సుధాకర్ మెచ్చుకోలుగా రంగయ్య వైపు తిరిగి చూసి నవ్వాడు. ఇంటికి చేరేంతవరకూ సుధాకర్‌ని గమనిం చాడు. ప్రతి చిన్న విషయంలోనూ అతను ఆ తండ్రికి తగ్గ కొడుకే అనిపించింది రంగ య్యకి.

'రాత్రి అంత ఒద్దికగా మాట్లాడినాక పొద్దున్నే ఏం జరిగిందో ఏమో సిద్ధారెడ్డి గొంచికానికి కోపం తెప్పించినాడు చిన్న గొంచికాడు' అనుకున్నాడు రంగయ్య తండ్రీ కొడుకుల మాటలు విన్నాక.

"నాకు మీ అయిడియాలజీతో పనిలే దురా! పుట్టిబుద్ధెరిగినప్పటినుంచి నాకు ఎందుకో ఈ కమ్యూనిజం అంటే పడదు. నువ్వు నామాదిరే ఉండల్లని నేను అనను. అయితే ఆలోచించుకోమంటాను" అనేసి గది బయటికి చరచరా వచ్చాడు.

రంగయ్యను చూస్తూనే "రంగడూ! వాన్ని అనంతపురంలో రైలెక్కించి రాపో..." అన్నాడు.

తల ఊపాడు సరేనన్నట్టు.

"నా గురించి పట్టించుకోడనేదేరా నా బాధంతా... వానికి ఎంతసేపూ చదువు గురించే ధ్యాస. ఇక్కడ నాకు మరొక మని షితోడుంటే ఏనుగంత బలముంటాది. అది పట్టదు. పైగా ఆ కమ్యూనిస్టుల విద్యార్థి సంగాలు ఏవో ఉండాయే, దాన్లలో ఈయప్ప నాయకత్వం వహిస్తున్నాడంట. అందుకే ఇక్కడికి రావల్లంటే అయ్యకి మన స్కరించదు"

"నాయనా! నీమాట నేను ఎప్పుడు కాద న్నాను. ఇంక ఒక్క సంవత్సరముండు నా చదువు పూర్తయిపోతాది అని నచ్చ చెప్పినా వినవు" అన్నాడు వాకిట్లో నిలబడి.

తన పరోక్షంలో ఇందాక హాలులో జరు గుతున్న గొడవ కాస్తా తన ప్రత్యక్షంలో జరుగుతోంది. ఇద్దరూ తనవైపు చూసే మాట్లాడుతున్నారు. బొమ్మమాదిరి నిలు చుండిపోయి ఇద్దరివంక తలతిప్పి చూస్తూ ఉన్నాడంతే-

"ఎట్లో నీకు తోచినట్ల చెయ్యిరా" అనేసి అక్కడినించి వెళ్ళిపోయినాడు సిద్ధారెడ్డి.

"చూడన్నా! నాయన ఎట్ల మాట్లాడుతా ఉండాడో" అన్నాడు సుధాకర్ రంగయ్యని ఉద్దేశించి.

రంగయ్య షాక్ తిన్నట్టు ఒక్కసారి సుధా కర్ వైపు చూసి 'తననేనా 'అన్నా' అంటు న్నది' అనుకున్నాడు.

"సన్న గొంచికాడా! నన్ను అన్నా అంటివా... అట్ల అనకూడదు గొంచికాడా. నేను ఎంతటోన్ని, మీ ముందర మేము ఏం లేము" అన్నాడు రంగయ్య వినయంగా.

"అన్నా! అంటానన్నా. నేను పాతతరం మనిషినికాదు. కొత్తతరానికి ప్రతినిధిని. నేను చదువుకున్న కమ్యూనిజం నాకిదే నేర్పింది. సంస్కారం, మనుషులమీద ప్రేమ ఇవన్నీ నాకు అదే నేర్పింది. అట్ల అనకూడదు అన్నావే అదే నీ బానిసతనం" అంటూ అక్కడినించి పోతూ "సాయంత్రం హైదరాబాదు ట్రైనుకి పోతా వుండాను అనంతపురం రైలు స్టేషనుకి వస్తావు కదన్నా" అన్నాడు సుధాకర్.

"తప్పకుండా, సన్నగొంచికాడా"

'రంగయ్య మనసు ఆనందంతో నిండిపో యింది. అంటరానివాడైన తనని ఒక గొంచి కాని కొడుకు అన్నా అనడం... తనకే ఎట్లో అనిపిస్తావుంది'

సాయంత్రం రెండు జీపుల్లో అనంత పురం రైల్వేస్టేషనుకు వెళ్ళి సుధాకర్‌ని హైదరాబాదు రైలుకు ఎక్కించి వచ్చాడు రంగయ్య.

★ ★ ★



రాష్ట్ర శాసనసభకు ఎలక్షన్లు మరో నెల రోజులలో జరుగనున్నట్టు వార్తాపత్రికల్లో ప్రముఖంగా వార్తలు వచ్చాయి. రాజకీయ పార్టీలన్నీ తమతమ అభ్యర్థుల జాబితాలను విడుదలచేసేందుకు సమాయత్తమవుతున్నాయి.

చిన్నకొత్తపల్లి 'పేట' నియోజకవర్గానికి సంబంధించింది. ఎందుకో సిద్ధారెడ్డికి రాజకీయాలలో చెప్పుకోదగ్గ ఆసక్తి ఏంలేదు. మనవాడు ఎవరో ఒకరు అసెంబ్లీలో ఉంటే చాలు మనపనులేమన్నా వుంటే సరిపోతాయి. మనమే ఎం.ఎల్.ఎ.గా గెలవాలి, ప్రజాసేవచేయాలి, మంత్రి కావాలి, అసెంబ్లీలో తన వాణి వినిపించాలి అనేంత పెద్ద కోరికలుకాని, ఆశయాలుకానీ అతనికి లేవు.

అందుకే పేటలో సంజీవనాయుడు పోటీ చేస్తాను అని ఫోనులో అడిగితే 'తప్పకుండా చెయ్యన్నా! నావాళ్ళ వోట్లు... ఇంకా ఏమైనా అదనంగా ఓట్లేయించాల్సి వస్తే కూడా వీలయినంతవరకూ వేయిస్తాను' అని హామీ ఇచ్చాడు కూడా.



ఈ మాటే రంగయ్య విన్నాడు సిద్ధారెడ్డి ఎవరితోనో చెబుతూ ఉంటే. 'ఈ గొంచి కాదు నిజంగా ఆలోచిస్తాడా లేకుండా నాలి కమీదికి ఏందొస్తే అది మాట్లాడతాడా? ఇంత మందీమార్బలము పెట్టుకోని, ఇన్ని దుడ్లు పెట్టుకోని, చెప్పలేనంత పలుకుబడి పెట్టుకోని ఏంటికి ఎమ్మెల్యేగా పోటీ చేయడు. చేసినాడనుకో అవతలోనికి డిపాజిట్టు కూడా దక్కదేమోనబ్బా!

ఈలోగా ఒక చిత్రం జరిగింది. అది సిద్ధారెడ్డివాళ్ళు ఊహించనిది. అదేమిటంటే అధికార పార్టీవాళ్ళ అభ్యర్థిగా హనుమంత రెడ్డి కొడుకు నారపరెడ్డిని ఎంపిక చేయడం. ఈ విషయం తెలుస్తూనే సిద్ధారెడ్డి వర్గం గుండెల్లో రాళ్ళు పడ్డాయి. ఊర్లోవాళ్లు మాత్రం పక్కన బాంబులు పేలినంతగా అదిరిపడ్డారు. ఈ దెబ్బతో ఇరువర్గాలు వాళ్ళూ రెచ్చిపోతారు. ఊరు నాశనమైపోతుంది అనుకున్నారంతా.

సంజీవనాయుడు ఇండిపెండెంటు అభ్యర్థి. అయితే అతనికి వ్యక్తిగతమైన పలుకుబడి ఉందని ప్రతీతి.

★ ★ ★

నామినేషన్లు వేసే సమయం వచ్చింది.

అధికార పార్టీ టిక్కెట్టుపై పోటీ చేస్తున్న అభ్యర్థి విలక్షణరీతిలో ఊరేగింపుగా వెళ్ళి ఆర్డీఓ కార్యాలయంలో నామినేషన్ దాఖలు చేస్తే బావుంటుంది అని హనుమంతరెడ్డి పట్టు. అట్లయితే తనకు 45 సంవత్సరాలు నిండాయి కాబట్టి 45 మోటారు బైకుల్లో ఊరేగింపుగా వెళ్లి నామినేషన్ దాఖలు చేసి వస్తే సరి అన్న ఆలోచనని తండ్రిముందు వుంచాడు నారపరెడ్డి.

హనుమంతరెడ్డికి ఈ ఆలోచన భేషుగ్గా ఉందనిపించింది. ఊర్లో ఎన్ని బండ్లు ఉన్నాయి? తెలిసినవాళ్ళ దగ్గర ఎన్ని ఉన్నాయి? పేటలో తమ బంధువులు వద్ద ఎన్ని ఉన్నాయి? అని లెక్కలు తీశారు. ఇంచుమించు 44 బండ్లు ఉన్నాయి. 45వ బండి ఎవరిది? అన్న ఆలోచనలో కొట్టుమిట్టాడారు కొంతసేపు. చిన్నకొత్తపల్లి అప్పర్ ప్రైమరీ స్కూలు తెలుగు టీచరుకి కొత్త హీరో హోండా వుంది. దాన్ని ఈమధ్యనే కొన్నాడు అన్న విషయాన్ని కూడా ఆరాతీశారు.

ఆలస్యం అమృతం విషం అనేసి వెంటనే అడిగేందుకు మందీమార్బలంతో అప్పర్ ప్రైమరీ స్కూలుకు వెళ్ళాడు నారపరెడ్డి. తెలుగు టీచర్ని బయటికి రప్పించారు. విషయమంతా వివరించారు. ఆ తెలుగు టీచరు జిల్లా సెలక్షన్ కమిటీ ద్వారా వచ్చినవాడు. అదీ 20 శాతం నాన్‌లోకల్ కింద తిరుపతినించి వచ్చినవాడు కావడంవల్ల నారపరెడ్డి క్రూరత్వంకానీ, ఫ్యాక్షనిజం కానీ ఏమీ తెలియదు. దాంతో "సారీ! నేను ఇవ్వనండీ, మరెక్కడయినా ప్రయత్నించండి!" అన్నాడు.

అతని నోట్లోంచి ఆమాట రావడం ఆలస్యం నారపరెడ్డి అతని దవడని ఫెడేల్మనిపించాడు. తక్కిన మనుషులు అతన్ని చితకబాదారు. "నువ్వింక ఈ ఊర్లో కనిపించావా, ప్రాణాలతో ఉండవు"అని వార్నింగ్ ఇచ్చివచ్చారు.

భయపడి పోయిన తెలుగు టీచరు మోటర్‌బైకు ఇచ్చేసి 'అయ్యా! మీకు బుద్ధి పుట్టినప్పుడు తెచ్చియ్యండి' అనేసి మోటార్ బైకు తాళాలు కూడా ఇచ్చేశాడు వాళ్లకి.

మొత్తంమీద 45 మోటారు బైకులమీద ఊరేగింపుగా వెళ్ళి నామినేషన్ వేసి వచ్చాడు నారపరెడ్డి. ఆ రోజంతా ఆ వర్గం వాళ్ళలో పండుగ వాతావరణం నెలకొంది.

గోటితో పొయ్యేదానికి గొడ్డలితో ప్రయత్నం చేయడమంటారే సరిగా అట్లాంటి ఆలోచన వచ్చింది హనుమంతరెడ్డికి. నారపరెడ్డికి ఏకైక పోటీదారు ఒక్క సంజీవనాయుడు మాత్రమే కాబట్టి ఎట్లయినాసరే అతని నామినేషన్ వేయించకూడదు. ఎంత డబ్బు ఖర్చయినా వెనుతీసేది

లేదు అన్నంత నిర్ణయానికి వచ్చాడు. నిజానికి సంజీవనాయుడు చెప్పుకోదగ్గ విలువైన నాయకుడేంకాదు.

మరుసటిరోజే సంజీవనాయుడి నామినేషన్ వేస్తాడు.

తీరా నామినేషన్ వేసే సమయానికి అక్కడవున్న అతని అనుచరులకంటే ఎక్కువ సంఖ్య హనుమంతరెడ్డి మనుషులు అక్కడ జీపుల్లో ప్రత్యక్షమైనారు. అందరి చేతుల్లో తుపాకులు. కలెక్టరు, ఆర్‌డిఓల ఎదురుగుండానే సంజీవనాయుడిని ఎత్తుకుని వెళ్ళిపోయారు. ప్రాణభయంతో సంజీవనాయుడి అనుచరులు ఎవ్వరూ నోరెత్తలేదు.



ఆ రోజు ప్రాంతీయ వార్తల్లో సంజీవనాయుడి కిడ్నాప్ వార్త రావడంతో సిద్ధారెడ్డి, అతనివర్గం అదిరిపడింది. వెంటనే ఫోన్‌ల ద్వారా కనుక్కున్నాడు సిద్ధారెడ్డి. అది హనుమంతరెడ్డి పనే అని తెలిసిపోయింది అతనికి.

ఇంకా నామినేషన్ స్థాయిలోనే ఆగడాలు మొదలైనాయి తీరా గెలిచాక అధికార పార్టీ ఎమ్మెల్యేగా ఇంకెన్ని ఆగడాలు చేస్తాడోనన్నది అందరి తలల్లో తొలుస్తూ వుంది.

రంగయ్య సిద్ధారెడ్డికి కొంచెం దూరంలో కింద కూచుని వున్నాడు.

"గొంచికాడా! మీరు ఇంటానంటే నాదొక మాట... ఇష్టముంటే మంచిదనండ్రి లేదంటే గాలికిడిసి పెట్టండ్రి" అన్నాడు రంగయ్య.

"చెప్పరా రంగడూ! ఎందరి మాటలో వింటూ ఉంటాం పాప్మనీమాటే ఇనకుండా పోతే ఎట్ల" అన్నాడు సిద్ధారెడ్డి.

"అదికాదు గొంచికాడా! అవతల పార్టీ వోళ్ళు బాంబులేస్తారని, రాళ్ళు రువ్వుతారని ముందు ముందుగానే మనం మిద్దెలమింద రాళ్ళు ఒకపక్కా, బాంబులు ఒకపక్క పేర్చుకుంటామాలేదా ఇవన్నీ ఎందుకుజేస్తాం... ముందు జాగ్రత్తగానేకదా... ఒకవేళ ఒక రాయో లేదా ఒక బాంబో మనవాళ్ళ ఇండ్ల మీదో, మనుషులమీదో పడిందే అనుకో మనం చేతులు ముడుచుకొని ఉండవచ్చు అప్పుడు కూడా ఏమంత పెద్ద ప్రమాదం జరగదు. అయితే ఈ నారపరెడ్డి గీన ఎంఎల్‌ఏ అయినాడా... అదీ అధికార పార్టీ ఎంఎల్‌ఏ అయినాడా... ఇంక పోలీసు వాళ్ళు వాళ్ళ చేతుల్లో ఉంటారు. అధికార యంత్రాంగమంతా అవతలివాళ్ళ చేతుల్లో వుంటుంది. ఇది మాత్రం గొంచికాడా అతి పెద్ద ప్రమాదము ఇంకా జెప్పల్లంటే శాశ్వతమైన ప్రమాదము గొంచికాడా" అని కాసేపు నిలిపి సిద్ధారెడ్డి దిక్కుచూశాడు.

"ఊc చెప్పరా! దానికి మనమేం జెయ్యాల్ల."

"గొంచికాడా! అదే... ఏం జెయ్యాల్లంటే మీరే పోటీ జెయ్యాల్ల"

"నేనా? నాకి అంత ఇంట్రెస్టు లేదురా..."

"మీరు అట్లన్నారంటే శాశ్వతమైన ప్రమాదాన్ని కొనితెచ్చుకొన్నట్లే"

సిద్ధారెడ్డి పక్కన కూచున్న అతని బావ మరిది రవి- "బావా! రంగని మాటమాత్రం

చానా సరయింది. వాడు బాగా ఆలోచించి చెప్తాఉండాడు. ఏమో అనుకుంటిగాని వాడి విశ్లేషణ మార్వలెస్ బావా" అన్నాడు.

"నువ్వూ వాడినే సపోర్టు చేస్తున్నావు కదరా రవీ" అన్నాడు నవ్వుతూ సిద్ధారెడ్డి.

"లేదు బావా! నువ్వు ఇప్పుడు పోటీ చేయలేదనుకో. అది మనకూ మనల్ని నమ్మిన వాళ్లకి, నీఅనుచరులకూ, అనుయాయులకూ అందరికీ శాశ్వత ప్రమాదమే"

"నిజమే మనం గెలవకపోయినా శాశ్వత ప్రమాదమేగా" అంటూ ఓరకంట చూశాడు రంగయ్యను సిద్ధారెడ్డి.

"గొంచికాడా! నేనొక మాట చెప్తాను... ఏదయినా క్రూరజంతువు మనమిందికి వస్తుందనుకోండి మనదగ్గరున్న ఆయుధంతో దాన్ని ఎదుర్కొంటాం. ఆ ఆయుధం పనికిమాలినదయింది అని తెలిసినప్పుడు అప్పుడు అక్కడినించి ఎట్ల తప్పించుకోవల్లా అని వెంటవెంటనే ఆలోచించుకొని పారిపోవడమో ఇంకొకటో చేస్తాము. కాబట్టి, వెనకాముందు చూడకుండా గొంచికాడా నామినేషను ఏసెయ్యండి... ఓట్లేసేవాళ్లకి తెలుసు ఎవరికి వెయ్యాలో" అన్నాడు రంగయ్య.

"బొలే చెప్పినావురా రంగడూ" అంటూ మెచ్చేసుకున్నాడు రవి.

సిద్ధారెడ్డి నామినేషన్ వేయడానికే మొగ్గు చూపాడు.

★ ★ ★

కిడ్నాపుకు గురయిన సంజీవనాయుడు సాయంత్రానికల్లా విడుదల అయి ప్రెస్ మీట్‌లో "నేను నామినేషన్ వేయడంలేదు. నా ఆరోగ్యం సరిగా లేనందునే ఆర్డీవో ఆఫీసులో వాంతి చేసుకోబోతుంటే నన్ను మావాళ్ళే బయటికి ఎత్తుకొని వచ్చారు. అక్కడ వాంతిచేసుకుంటూంటే నన్ను ఆస్పత్రిలో చేర్చారు. కావల్సింటే పెన్నా నర్సింగ్ హోంలో విచారించండి. ఎవరో గిట్టనివాళ్ళు నామీద బురద చల్లేందుకు నన్ను కిడ్నాప్ చేసినట్టు పుకారు పుట్టించారు. నా ఆరోగ్యం బాగుపడితే ఈసారి ఎన్నికల్లో పోటీచేస్తా" అంటూ స్టేట్‌మెంట్ ఇచ్చాడు.

మరుసటిరోజు దినపత్రికల్లో సంజీవనాయుడు ఇచ్చిన స్టేట్‌మెంట్ చూసి హనుమంతరెడ్డి మీసాలు మెలేసుకున్నాడు.

ఫోన్లద్వారా- సంజీవనాయుడి కొడుకుని చంపేస్తామని అవతలిపార్టీ వాళ్ళు బెదిరించడంతో తను నామినేషన్ వేయకుండా మానుకున్నాడనీ తెలిసింది సిద్ధారెడ్డికి. దాంతో తను ఎన్నికల్లో నిలబడకతప్పదన్న నిర్ణయానికి వచ్చాడు.

మరుసటిరోజే తను నామినేషన్ వేయనున్నట్టు సిద్ధారెడ్డి చెప్పగానే రవి కరచాలనంచేసి "సరయిన సమయంలో సరయిన నిర్ణయం బావా! బెస్టాఫ్ లక్" అన్నాడు.

రంగయ్య ఆనందంతో చప్పట్లు చరిచాడు.

ఎన్నికల్లో గెలవాలంటే డబ్బు పాత్ర చాలా ఉంటుంది కాబట్టి అంగబలానికీ, అర్థబలానికీ సాయపడేందుకు పెనకలపాటి రామయ్యని సాయమడగాలని నిశ్చయించుకున్నాడు సిద్ధారెడ్డి.

నిజానికి పెనకలపాటి రామయ్య ధర్మవరంలో చెప్పుకోదగ్గ ఫ్యాక్షనిస్టు. అతనికి ఒక పార్టీ అంటూ ఏనాడూలేదు. రాయదుర్గం, కళ్యాణ దుర్గాల ఎమ్మెల్యేలుగా వున్నది అతని అభ్యర్థులే. రాజకీయ పార్టీలయితే కాంగ్రెస్ అనో, తెలుగుదేశం అనో విభజన ఉంటుంది మామూలు జనానికి. అయితే అతను ఏ ఊరికిపోతే ఆ ఊరి ఎమ్మెల్యే పార్టీ జండా అతని కారుమీద రెపరెపలాడుతా ఉంటుంది. తమాషాగా అతనో మాట అంటూ ఉంటాడు-

"నేను ఎక్కడికిపోతే ఆ జెండాని ఎత్తుతా. నిజమంటే నేనే పూరా సెక్యులరిస్టుని, నాకి మతంలేదు, రాజకీయపార్టీ లేదు"

★ ★ ★





మధ్యాహ్నం ఒంటిగంటకు ధర్మవరం లోని పెనకలపాటి రామయ్య ఇంటికి చేరుకున్నారు సిద్ధారెడ్డి అతని వర్గంవారు మూడుజీపుల్లో.

అతి ఎత్తయిన ప్రహరీగోడపైన ఇనుప బాణాలు నాటి వున్నాయి. ఊరువాకిలంత వున్న గేటు తలుపులు, కాంపౌండు బయట సాయుధులైన ప్రవేటు సైన్యం కాపలా కాస్తూ వుంది. రంగయ్యకి అదంతా చూస్తూనే "అమ్మయ్యో ఈ గొంచికాడు చానా ఎక్కువయినోడే" అనుకున్నాడు.

ఒక గంటసేపు చర్చలు జరిపాక సిద్ధారెడ్డికి సపోర్టుచేసేందుకు ఒప్పుకున్నాడు పెనకలపాటి రామయ్య.

హనుమంతరెడ్డిని ఇప్పుడు రాజకీయంగా అణిచేయకపోతే అధికారపార్టీలో వాడి కొడుకు ఉండడంవల్ల అనంతపురం జిల్లాలోనే తిరుగులేని శక్తిగా రూపొందే అవకాశం వుంది. అందువల్లనే సిద్ధారెడ్డికి సపోర్టుచేయడం అన్నది అనివార్య పరిస్థితి అన్నాడు చర్చల చివర్లో.

మరుసటిరోజు సిద్ధారెడ్డి నామినేషన్ వేశాడు.

పేట నియోజకవర్గంలోని అన్ని గ్రామాల్లోనూ ఎన్నికలవేడి ఒక ఎత్తయితే, ప్రధానమైన పోటీ అభ్యర్థుల సొంత ఊరయిన చిన్న కొత్తపల్లిలో నిరంతరం ఉద్రిక్తతలు చోటుచేసుకుంటున్నాయి. రెండురోజులకో మూడురోజులకో ఒకసారి రాళ్ళూ, బాంబులూ విసురుకోడాలు జరుగుతోంది.

ఎలక్షన్‌రోజు రానే వచ్చింది. ఓటర్లకంటే అడ్వాన్సుగా ఎవరికి చాతనయినంత మేరకు వారు రిగ్గింగు భారీస్థాయిలో జరుపుకున్నారు. బ్యాలెట్ పెట్టెలు ఎత్తుకుపోవడం వల్ల, అయిదుచోట్ల రీపోలింగు పకడ్బందీగా జరిగింది.

ఆ మరుసటిరోజు కౌంటింగు జరిగింది. మంచి మెజారిటీతో సిద్ధారెడ్డి గెలిచాడు. దాంతో ఆ వర్గం వాళ్ల ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయినాయి. రంగయ్య సంతోషం చెప్పడానికి అలివికాకుండా వుంది.

సరిగ్గా అదేసమయంలోనే పెనకలపాటి రామయ్య గుండెపోటు వల్ల చనిపోయినాడన్న వార్త సిద్ధారెడ్డిని అతలాకుతలం చేసింది.

★ ★ ★

తన ప్రత్యర్థి గెలుపు హనుమంతరెడ్డిని బాగా కుంగదీసింది...

రాజకీయంగా తన కొడుకు అత్యున్నత స్థాయికి చేరుకుంటాడని, సిద్ధారెడ్డిని, అతని వర్గంవాళ్లని చావుదెబ్బ తీయాలని ఎంతో ఆశించాడు తను. కాని అంతా అడియాశ అయింది తన కొడుకును అసెంబ్లీ మెట్లు ఎక్కకుండా చేసినాడు సిద్ధారెడ్డి. "వాన్ని కూడా నేను అసెంబ్లీ మెట్లు ఎక్కనియ్యను' అంటూ ప్రతిన బూనాడు హనుమంతరెడ్డి.

ఆ క్షణంనించి సిద్ధారెడ్డిని హతమార్చేందుకు వ్యూహరచన మొదలయ్యింది.

★ ★ ★

మరుసటిరోజే అసెంబ్లీ సమావేశాలు ప్రారంభమౌతున్నాయి.

అందువల్ల సిద్ధారెడ్డి ఆరాత్రి చిన్నకొత్తపల్లినించి బయల్దేరి హైదరాబాదు వెళ్లాలని నిశ్చయించాడు.

భద్రతకోసం 4 టాక్సీల్లో తన వర్గం వాళ్లని 40మందిని తీసుకుపోదామని కూడా అతని బావమరిది రవి ప్రతిపాదన పెట్టాడు. అందుకు సిద్ధారెడ్డి సరేనన్నాడు.

రంగయ్య ఐదు గంటలకే భోంచేసుకుని వచ్చాడు.

రాత్రి పదకొండు గంటలవుతుండగా నాలుగు టాక్సీలు బయల్దేరాయి.

బయట వెన్నెల పాలారబోసినట్లుంది.

ప్రయాణం హాయిగా, ఆనందంగా సాగిపోతూ ఉంది.

అన్ని టాక్సీల్లోనూ జోకులు పేలుతు



న్నాయి. నవ్వులు... ఒకటే నవ్వులు.

అనంతపురానికి మరొక పావుగంటలో చేరుకుంటాయి అదే స్పీడులో వెళ్తే.

అక్కడో మలుపు ఉంది రోడ్డుమీద.

మలుపు చివర్లో లారీ ఆగి వుంది. అది చెడిపోయి వున్నట్టు దాని చుట్టూరా రాళ్ళు వరుసగా పేర్చి వున్నాయి.

దాన్ని దాటాలంటే బాగా నెమ్మదిగా పోవాల్సివుంటుంది.

నాలుగు బండ్లూ స్లో అయిపోయాయి. నవ్వులు ఆగిపోయాయి.

ఎందుకో అందర్లోనూ ఏదో అను మానం...

అందరి మనసులూ కీడు శంకిస్తూ ఉన్నాయి.

'ఢాం' అంటూ పెద్ద శబ్దం.

వరుసగా బాంబులు పేలుతున్న శబ్దాలు.

టాక్సీల్లోంచి ఆయుధాలతో అందరూ బయటపడ్డారు.

ఆలోగా వాళ్ళని చుట్టుముట్టే ప్రయత్నం చేశారు హనుమంతరెడ్డివర్గం వాళ్ళు.

ఆ వెన్నెల్లో యుద్ధం మొదలైంది.

ప్రాణంపోతున్నవారి అరుపులు...

కసితో రగిలిపోతూ నరుకుతున్న వారి కేకలు.

రంగయ్య, సిద్ధారెడ్డి చేయి పట్టుకుని అక్కడినుంచి తప్పించే ప్రయత్నంలో టాక్సీ వెనకాలనుంచి రోడ్డుపక్కనున్న చెట్ల పొద లోకి పోయే ప్రయత్నంలో ఉండగానే అటు వైపునుంచి ఇద్దరు బలాఢ్యులు అడ్డుక న్నారు రంగయ్యని. ఒకడు పెడరెక్కలు విరిచి పట్టుకున్నాడు సిద్ధారెడ్డి మెడమీద గండ్రగొడ్డలితో నరికాడు రెండోవాడు. రంగయ్య పెనుగులాడుతున్నాడు. అతని నెత్తిమీద బలంగా వేటుపడింది బాణాక ర్రతో. స్పృహతప్పి పడిపోయాడు రంగయ్య.

★ ★ ★

ముందురోజు రాత్రి సిద్ధారెడ్డిని చంపేసి నట్లు నిర్ధారణ అయిన మరుక్షణంనుంచి చిన్న కొత్తపల్లిలో చెప్పడానికి వీలు లేనంత విధ్వంసకాండ మొదలయింది.

సిద్ధారెడ్డి వర్గంవాళ్ళలో మగవాళ్ళంతా రాత్రికి రాత్రే ఎక్కడెక్కడికో పరారీ అయిపో యారు.

ఆ వర్గానికి చెందినవారి తోటల్ని నరికివే యడం, గడ్డి వాముల్ని తగులబెట్టడం, ఇండ్లని కూలగొట్టడం... హనుమంతరెడ్డి వర్గం వాళ్లు చేస్తున్నారు.

ఇంచుమించు రావణకాష్టంగా రగులు తోంది ఊరంతా.

★ ★ ★

మాలగేర్లో...

గంగమ్మ తలుపు వేసుకుని ఉంది. రంగయ్య ఎప్పుడో చనిపోయి ఉంటాడన్నది నిర్ధారణ అయిందామెకు. రంగయ్య పీనుగ కాడికి పోవాలని ఉంది. అది ఎక్కడున్నదో తెలీదు. "అనంతపురానికి రాత్రి సచ్చిపో యిన వాళ్ళ పీనుగలు పోస్టుమార్టం చేసేకి తీసుక పోయినారని" ఎనరెవరో అనుకుం టుంటే వింటున్నది. అది నిజమో కాదో తెలీదు. తను ఊరి బయటకు పోయి తిరిగి ఊర్లోకి వస్తే హనుమంతరెడ్డి వర్గం మను షులు ఏమంటారో తెలీదు. ఇరుగుపొరు గున ఉన్న బంధువులు అందరూ వచ్చి ఒక కన్నీటి చుక్క రాల్చి వెళ్ళిపోయినారే కానీ అక్కడే తనతోనే ఉండి ఓదార్చుతూ ఉండి పోలేదు. ఉండిపోతే తమని కూడా సిద్ధా రెడ్డి మనుషులుగా గుర్తించి తమ ఇండ్లూ, వాకిండ్లూ ఎక్కడ కూలగొడతారోనని అందరి భయం. కుంటి తిమ్మప్పని రంగయ్య పీనుగ కోసం పంపింది. అతనికో సమే ఆమె ఎదురుచూస్తూ వుంది.

తలుపు చప్పుడయింది.

"గంగమ్మా"

"తల్లీ గంగమ్మా"

ఆ గొంతు కుంటితిమ్మప్పదేనని గుర్తిం చింది ఆమె.





తలుపుతీసి 'సిన్నాయనా' అంది అతని సమాధానాన్ని ఆశిస్తూ, 'ఆయన పీనుగని యాడన్నా జూస్తివా' అన్న ధ్వని ఉంది.

లోపలికి వస్తూ "ష్...ష్ గట్టిగా అరవద్దమ్మా. రంగనికి ఏమీగాలేదమ్మా. వాడుబతికే ఉండాడమ్మా దేవుని దయవల్ల" అన్నాడు తిమ్మప్ప నవ్వు మొహంతో.

"సిన్నాయనా! నువ్వు అంటా వుండేది నిక్కమా" సంతోషంతో ఏడుస్తూ అడిగింది.

"అవును తల్లీ. నీ పున్నెం మంచిదమ్మా అందుకే ఆడ అంతమందీ ఇంచుమించు ముప్పయిమంది సచ్చిపోయినారమ్మా. మన వానికి మాత్రం నెత్తిమీద ఒక గాయం అంతే... బాగుండాడు"

"మాట్లాడతాడా సిన్నాయన్నా"

"ఔనమ్మా తల్లీ. మాట్లాడ్తా వుండాడు. రాత్రికి నిన్ని ఆడికి పిలుసుకు రమ్మన్నాడమ్మా. 'సిద్ధారెడ్డి గొంచికాడు సచ్చిపోయె మామా. నేను దెగ్గరుండి రచ్చించలేకపోతి మామా. దేవునట్లా ఓన్ని రచ్చించలేకపోతి ఇంగేమిటికి ఈ పాడుజన్మ' అంటా ఏడుస్తాడమ్మా వాడు. వానికి అర్థం కానిది ఒకటేనమ్మా. అందర్నీ నరికి పారేసినోళ్ళు 'నేను సిద్ధారెడ్డి గొంచికాని చెయ్యి పట్టుకొని అక్కడినుంచి తప్పించల్లని జూస్తా వుండా, నా నెత్తిమింద బలమైన ఏటు ఏసినారు. నన్నెందుకు నరకలేదు' అనంటాడమ్మా వాడు. నువ్వు ఎవరితోనూ చెప్పొద్దమ్మా"

"ఊ... ఎట్లోలే సిన్నాయనా. బతికినాడు అంతేసాలు"

"రాత్రికి సద్దుమణిగినాక సిద్ధంగా ఉండు తల్లీ, బువ్వాగివ్వా తినేసి ఉండు"

★ ★ ★

ఊరంతా సద్దుమణిగింది.

మాలగేరి కూడా...

అయితే గంగమ్మ తన పాత ట్రంకుపెట్టెని వాకిట్లో పెట్టుకుని కుంటితిమ్మప్ప కోసం ఎదురుచూస్తా వుంది.

ఎప్పుడెప్పుడు తన మొగుణ్ణి చూడాలా అని ఒకటే ఆత్రత పడుతోంది గంగమ్మ.

నెత్తిన టవలును ముసుగుగా వేసుకొని వచ్చినాడు కుంటితిమ్మప్ప. ఇంటికి తాళం వేసి బయలుదేరింది గంగమ్మ. మాలగేరి దాటుతుండే దారిలో వున్న చింతచెట్టు కింద రెండు ఆకారాలు నిలుచుని ఉన్నాయి.

"సిన్నాయనా! ఆడ సెట్టుకింద ఎవరో ఇద్దరు ఉండారు" అంది గుసగుసగా చేతిలో ఉన్న ట్రంకుపెట్టె భుజంమీద పెట్టుకుంటూ.

"వాళ్ళు ఎవరో కాదులేమ్మా మనోళ్ళే. మనకి సాయం చేసేకి వచ్చినారు" అంటూనే...

"ఇద్దోరా ఈ పెట్టి తీస్కోనిరారా" అన్నాడు ఇద్దర్లో ఒకరికి ఉత్తర్వులు ఇస్తున్నట్టు కుంటితిమ్మప్ప.

లావుగా ఉన్న ఆకారం ఆ పెట్టెని అందుకుంది. అప్పుడు ఆకారాన్ని చూసింది. ఇంకా అప్పటికి చంద్రుడు రానందువల్ల పూర్తిగా చీకటిగా వుంది. అందులోనూ నెత్తిన టవల్ వేసుకొని వుంది ఆ ఆకారం.

ఇంక రెండో ఆకారంమాత్రం ఆడమనిషిగా గుర్తించింది గంగమ్మ.

"వాళ్ళిద్దరూ ఎవరూ? తమతోపాటూ ఎందుకొస్తున్నారు? అయినా వాళ్ళ గురించి ఏందో తిమ్మప్ప సిన్నాయన దాచిపెడుతున్నాడా? " గంగమ్మ తలలో ఆలోచనలు తొలుస్తూ ఉన్నాయి.

అందరూ వడివడిగా నడుస్తున్నారు.

అప్పుడప్పుడే చంద్రుడు పుట్టాడు.

వెన్నెల కొంచెంకొంచెం ముదుర్తుతూ ఉంది.

అడ్డదార్లగుండా ప్రయాణించినాక తారు రోడ్డు వచ్చింది.

"ఇక్కడ ఉందాం, ఏదో ఒక లారీ వస్తుంది ఎక్కుదాం" అన్నాడు కుంటితిమ్మప్ప.

అందాక భుజంమీద ఉన్న పెట్టెని

దింపింది లావుగా ఉన్న ఆకారం.

"ఇంతకీ వీళ్ళు ఎవరు?"

ఉండబట్టలేక అడిగింది కుంటితిమ్మప్పని.

"ఎవరో ఎందుకొస్తారమ్మా... వీడు నీ మరిది శ్రీరాములు గంగమ్మా"

శ్రీరాములు టవలు తొలగించి,

"నన్ని సెమించు ఒదినా... దేవుళ్ళట్లా మీ ఇద్దరికీ కీడు తలపెడితే" అన్నాడు శ్రీరాములు. గొంతులో నిజంగా పశ్చాత్తాపం వుంది.

గంగమ్మ ఆశ్చర్యపోయింది. నోటిమాట రావడంలేదు గుడ్డివెన్నెట్లో శ్రీరాముల్ని చూస్తూ...

"దీనికంతటికీ నేనే కారణం. ఆశపోతుతనంతో..." అంది పూడుకుపోతున్న కంఠంతో పక్కనున్న ఆకారం.

అటుతిరిగి చూసింది గంగమ్మ... శ్రీరాములు పెండ్లాం పెన్నక్క.

"అక్కా! ఇట్లయితాదని అనుకోలేదక్కా... ఆశకిపోతే గోసిలో రాయిపడింది. ఆకరికి దేవుడు ఏం చేసే! మిమ్ముల్ని అన్నేయం చేసిందానికి నా పిల్లోడు పరీచ్చ పాసయినా అయ్యావారు ఉద్దోగం చేసికి ల్యాకపోయే... ఆ కీడు మాకే కొట్టుకుంది" అంటూ గంగమ్మ భుజంమీద వాలి ఏడ్చేసింది.

అప్పుడు శ్రీరాములు చెప్పాడు... రంగయ్య, సిద్ధారెడ్డి పక్కనే ఉన్న అతని నెత్తిమీదనెట్టు (స్పృహ) తప్పేటట్లు దెబ్బవేసింది ఈశ్వరిగాడేనని. ఆ రకంగా తాము ఇద్దరే అన్నయ్యని రక్షించామని చెప్పాడు. ఇంకెక్కడ ఈమాట అనుకోవాకంట్రి అన్నాడు కూడా శ్రీరాములు.

కండ్లనిండా తొణికిసలాడుతున్న నీళ్ళతో వింది అంతా.

ఈలోగా లారీ వస్తే అందులోకి ంగమ్మ తిమ్మప్పలు ఎక్కారు. శ్రీరాములు పెన్నక్కలు ఊరి దారిపట్టారు.

★ ★ ★

అనంతపురం పట్టణ శివార్లలో ఉన్న పిల్లి గుండ్ల కాలనీలో ఒక చిన్న కొట్టంలో ఉంటున్నారు రంగయ్య, గంగమ్మలు. వాళ్ళిద్దరూ ఇప్పుడు ఇళ్లు కట్టే పనికి పోతున్నారు. లత వారంలో ఒక తడవ వచ్చి వాళ్ళతో గడిపి వెళుతోంది.

రంగయ్య విషయంలో గంగమ్మకి కొంత అసంతృప్తి ఉంది. అతను ఉంటున్నది అనంతపురంలో అయినా అతని మనసు మాత్రం చిన్న కొత్తపల్లిలోనే. అక్కడి వ్యవహారాల్ని, అక్కడి రాజకీయాల్ని, అక్కడి వాతావరణాన్నీ తెలుసుకుంటూ ఉండడం గంగమ్మకి బొత్తిగా ఇష్టంగా ఉండడంలేదు.

తనకు దక్కడు అనుకున్న మనిషి దక్కినాడు. అప్పుడున్న గొంచికాడు పోయినాడు. ఇంక ఆ పగలూ, ప్రతీకారాలూ ఎందుకు? అసలు తాము ఇక్కడ వున్నట్లు తెలిస్తే హనుమంతరెడ్డి రంగయ్యను నరికించినా నరికిస్తాడు.

ఎప్పుడైనా గంగమ్మ అతనికి వ్యతిరేకంగా మాట్లాడినట్లు అనిపించిందా? "నీకేలనే, ఏందో అన్నీ తెలిసినదాని మాదిరి చెప్తాది వచ్చి" అంటాడు.

అందుకే ఈ మధ్య తను ఎవరితో మాట్లాడినదీ చెప్పడామెకు. చిన్నకొత్తపల్లెలో జరిగిన ఏ పరిణామాన్నీ తెలపడు.

అంతకుముందురోజు సిద్ధారెడ్డి కొడుకు సుధాకర్ అతన్ని కలిశాడు. తన తండ్రి చనిపోయినప్పటినుంచీ అజ్ఞాతంలో హైదరాబాదులో ఒక కమ్యూనిస్టు మిత్రుడి ఇంట్లో ఉంటున్నట్లు చెప్పాడు.

అతి త్వరలో హనుమంతరెడ్డి ఫ్యాక్షనిజానికి కళ్ళెం పడేరోజు దగ్గరవుతోందని, కమ్యూనిస్టు అయిడియాలజీతో ఉన్న పోరుబాట గ్రూపువారు తెలంగాణానుంచీ అనంతపురం జిల్లాలోని పెన్నగిరి అడవుల్లో ఉండాలనుకుంటున్నారని, మన చిన్న కొత్తపల్లినే కేంద్రం చేసుకుని తమ కార్యకలాపాలు సాగిస్తారని తెలిపాడు.

ఇవన్నీ రంగయ్యకు మొదట ఏమీ అర్థం




కాలేదు. "పోరుబాట ఏందీ, వాళ్ళ కమ్యూనిస్టు అయిడియాలజీ ఏంది? వాళ్ళు తెలంగాణానుంచీ అనంతపురం జిల్లాలు రావడమేంది? " అనడిగాడు.

పోరుబాటవాళ్ళు పేదలపాలిట పెన్నిధులు. ధనికుల, భూస్వాముల పాలిట యమకింకరులు. ఎక్కడ రైతు కూలీలకీ, కార్మికులకి అన్యాయం జరుగుతుందో అక్కడ న్యాయాన్ని స్థాపించడంకోసం అన్యాయాన్ని కాలరాస్తారు. ఆ అన్యాయానికి తలపడుతున్న భూస్వాముల్ని నరికేస్తారు. తెలంగాణాలో చాలా ప్రాంతాలను ఇట్లా విముక్తి చేశారు. చాలామంది పేద కూలీలకు భూములు పంచారు. అలాంటివాళ్ళు మన ప్రాంతానికి రావాల్సివుంది. ఈ హనుమంతరెడ్డిలాంటి వాళ్ళను మట్టుపెడితేనే పేద ప్రజానీకం బాగుపడేది అని చెప్పాడు సుధాకర్. ఆ రాత్రికే హైదరాబాదు వెళ్ళిపోయాడు అతను.



ఇదంతా విన్నాక తను పోరుబాటవాళ్ళతో కలిసిపోతాడు. హనుమంతరెడ్డినీ, వాళ్ళవర్గంవాళ్ళనీ తను నాశనం చేస్తాడు. ఇంక అక్కడినుంచీ ఎవరిపెత్తనం ఎవరిమీదా ఉండదు. ఊరంతా ప్రశాంతంగా వుంటుంది. రాళ్ళు, బాంబులు విసురుకోవడాలు ఉండవు. అందరూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో జీవిస్తూ ఉంటారు. ఇలా సాగిపోయాయి రంగయ్య ఊహలు.

★ ★ ★

అప్పటికి చీకటి పడిపోయింది. పార్వతికి చెలగాటం... నల్లప్పకి ప్రాణసంకటంగా మారిపోతూ ఉంది.

ఒక్కోసారి ఎద్దుల కొట్టంబట వేమారెడ్డి ఉన్నాడని తెలిసినా నల్లప్పని మరింత ఏడిపించేందుకు అతనిచుట్టే తిరుగుతూ కావిలించుకుంటూ ఉంటుంది.

ఆరోజూ ఏడిపించాలనుకుని కావలించుకుంది నల్లప్పని. ఊరకనే ఏడిపిస్తుందని తన జాగ్రత్తలో తనూ ఉన్నాడు. గొంచికాని గొంతు దూరంనుంచి వినిపించినట్టయింది. తను వివశుడై పార్వతిని దగ్గరకు తీసుకున్నాడు. అప్పుడు సరిగ్గా పార్వతి తల్లి కంట్లో పడింది ఆ దృశ్యం. ఆ విషయం ఆ ఇద్దరికీ తెలీదు. ఆమె దూరంగా వెళ్ళి పార్వతిని పిలిచింది. ఏమెరుగని దానిలా పార్వతి వెళ్ళిపోయింది.

శ్రీప్రియ అప్పటివరకూ చదువుకుని లైటార్పి పడుకుందామనుకుంది.

మంచంపైకి చేరినదల్లా నీళ్ళు తాగాలనిపించి వంటగదిలోకి వెళ్ళింది. పక్కనున్న వరండాలోంచి తాత మాటలు వినిపించాయి.

"నీ బిడ్డ అనంతపురానికి పోయిండెనా... సరే ఒక పని చేద్దాంరా. ఆ మాలనాకొడుకుని ఊరికే ఇడిసిపెట్టకూడదు. గుట్టు చప్పుడు కాకుండా వాణ్ణి చంపెయ్యకూడదు. ఈ దెబ్బతో మాలగేరీ, మాదిగ్గేరీ బయపడిపోవల్ల. అది నాకి ఇడిసిపెట్టు నేను ప్లాను ఏస్తాను. రేపు సాయంత్రానికి వాడు శవమైపోతాడు సరేనా? " అన్నాడు

హనుమంతరెడ్డి.

తాత అంత సీరియస్‌గా అంటున్నది ఎవరి గురించో తెలియదామెకి.

వంటింటి కిటికీనుంచి తొంగిచూసింది. వాలుకుర్చీలో తాత కూర్చుని ఉన్నాడు. అత నిపక్కన వేమారెడ్డిమామ చాలా అసహ నంగా కూర్చుని ఉన్నాడు.

"ఈ మాల, మాదిగ నా కొడుకులు అలివి కాకుండా పోతా ఉండారు. దీనికంత టికీ ఫుల్‌స్టాప్ పెట్టల్లంటే ఊరందరి ముందర ఆ నల్లప్పగాన్ని ఖతం చేసెయ్యాల్లంతే. అట్లు చేస్తేనే ఇంక ఆ మాలకొడుకూ, మాదిగ నా కొడకూ కాపోల్ల ఆడపిల్లోల్లని చూస్తానే డ్రాయర్లో ఉచ్చ పోసుకోవల్ల. అట్లే... ఈ పొద్దు నీ కూతురికి అయ్యింది. రేపు ఇంకొకరి కూతురికి అయితాది" అన్నాడు హనుమంతరెడ్డి.

ఎవరి గురించి వాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్నారో అర్థమైంది శ్రీ ప్రియకి.

అంటే వేమారెడ్డి మామ జీతగాడు నల్లప్పని ఊరందరిముందూ తాత చంపించబోతున్నాడా?

మొన్న వాళ్లింటికి పోయినపుడు పార్వతి అంది నల్లప్ప గురించి.

"భలే బాడీ కదే నల్లప్పది. హీమాన్ అంటారే అట్లుంటాడు. విదేశాలలో గ్రీకువీరుడంటారే ఇలాంటి విగ్రహాన్ని చూసే అని వుంటారు. ఆ నలుపులో కూడా ఎంత కాంతి. ఆ కండరాల్లో ఎంత బిగువు" అంది.

"ఒక్కమాటలో చెప్పాలంటే బోరిస్ వలెజో వేసిన ఫాంటసీ ఆర్టు 'క్రోమ్‌రాబోట్'లా ఉంటాడని చెప్పు" అంది శ్రీప్రియ.

శ్రీప్రియకి ఆర్ట్ పిచ్చి. ఆమెకు తెలుగులో వడ్డాది పాపయ్యా అన్నా, బోరిస్ వలెజో అన్నా చెప్పలేనంత ఇష్టం.

"బోరిస్ వలెజో ఎవరే? "

"అతనో అమెరికన్ ఫాంటసీ ఆర్టిస్టే. ఆ దేశంలో ఒక కథాసంకలనానికి 'క్రోమ్ రోబోట్' అనే ముఖచిత్రాన్ని వేశాడతను. అంతే ఆ ఏడాది ప్రచురించిన అన్ని పుస్తకాల్లోకి అమ్మకాల్లో సంచలనం సృష్టించింది"

"అట్లనా అయితే నల్లప్ప పేరును 'క్రోమ్' అని పెడితే బాగుంటాది కదే ప్రియా" అంది పార్వతి సంతోషంగా నవ్వుతూ.

తనూ నవ్వేసింది. అయితే పార్వతి నల్లప్పల వ్యవహారం ఇట్లయిపోతుందని తను ఊహించలేకపోయింది.

ఎట్లయినాసరే నల్లప్పను తప్పించాలి.

పార్వతికి ఈ విషయం చెబితేచాలు తనే తప్పించేయగలదు.

అప్పటికే తొమ్మిది గంటలయింది.

రెండు సందుల అవతల ఉంది పార్వతి ఇల్లు.

బయట బాగా చీకటిగా ఉంది.

అక్కడో వీధిదీపం, ఇక్కడో దీపం ఉన్నాయి.

సందడి దాదాపు తగ్గిపోయింది.

పాలెగాళ్ళ కోటలాంటి తన ఇంటినుంచి వెళ్ళగలదా?

ఒక మంచి పనికోసం తను ప్రయత్నించ డంలో తప్పులేదు.

అనుకున్నదే తడవుగా తల్లి దగ్గరకు వెళ్ళి "అమ్మా పార్వతి దగ్గర ముగ్గుల పుస్తకం వుంది. దాన్ని తెచ్చుకుంటానే" అంది.

నట్టింట్లో సామానులన్నీ ఎత్తిపెడుతూ ఉన్న శారదమ్మ కూతురివైపు చూసి, "ఇయ్యాలకాడ ఏందే? పొద్దనికి తెచ్చుకుందువులే" అంది.

"ఊహూ... నేను కొత్త ముగ్గు రాత్రికి నేర్చుకొని పొద్దున్నే ఇంటిముందర ఎయ్యాల్ల"

కూతురి పట్టు తెలుసు శారదమ్మకు. "బయట మన జీతగాళ్ళు ఎవరున్నా ఉంటారు సూడు. వెంటపెట్టుకొని పో" అంది.

వరండాలోనే ఉన్న తాత దగ్గరికి పోయి, "తాతా అమ్మచెప్పింది... మామా వాళ్లింట్లో ముగ్గులబుక్కు తెచ్చుకోమని" అంది




గోముగా.

"ముగ్గులబుక్కేకదా. రేయ్ ఓబులేశూ... వేమారెడ్డి ఇంటికాడికి పోయి ముగ్గుల బుక్కుంట తీసకరా. వేమారెడ్డి ఇప్పుడే పోయెనే ఇంటికి... ముందుగా చెప్పింటే తనే పంపిస్తాఉండె"

అరెరె... తన ప్లానంతా తిరగబడిందే ఎట్లా.

సాయుధులైన రెండు గుంపులకవతల బాణాకట్టి పట్టుకుని నిటారుగా నిలబడి ఉన్న ఓబులేశు హనుమంతరెడ్డి పిలుపుతో దగ్గరకు వచ్చి వినయంగా "గొంచికాడా" అన్నాడు.

మళ్ళీ చెప్పాడు హనుమంతరెడ్డి.

"సరే గొంచికాడా" అంటూ తల ఊపి బయల్దేరుతుంటే,

"ఇద్దో ఓబులేశూ మాట" అంది శ్రీప్రియ.

"ఏంది అమ్మయ్యా" అంటూ ఆగాడు.

"తాతా! పాపం ఈ ఓబులేశుకి ఏం తెలుస్తుంది. ముగ్గులుబుక్కు అంటే నుగ్గులబుట్ట ఇప్పించుకొస్తాడు. నేను

పోతే ముగ్గుల బుక్కుల్లో నాక్కావలసింది సెలక్ట్ చేసుకొని వస్తా!"

"సరేలే... పొయ్యిరా పోమ్మా... చానా సేపు ఉండవద్దమ్మా"

"లేదులే తాతా! అంతా అయిదు నిమిషాలే ఓన్లీ ఫైవ్ మినిట్స్"

"నా తల్లి నోట్లో ఇంగ్లీషు కూడా ఎంత కమ్మగా వుంటుందో సూడి" అంటూ తాత మెచ్చుకుంటూ ఉంటే ముసిముసిగా నవ్వుతూ బయలుదేరింది శ్రీప్రియ.

పార్వతి ఇంటికి పోయేటప్పటికే పడకగదిలో మంచం మీద అటూ ఇటూ దొర్లుతూ ఉంది. ఆమె పక్కనే కూచుంది. ఆమె తల్లి కూచుని ఉండటంతో "అత్తా తాగేకి కొన్ని నీళ్ళియ్యవా" అంది.

ఆమె నీళ్ళు తెచ్చేందుకు వెళ్ళినప్పుడు తాను విన్న విషయం అంతా చెప్పేసింది. పార్వతి షాక్ తిన్నట్టు మొదట చూసి "వానిది కూడా అతిలేవే. యాడన్నా సచ్చిపోనీ, తప్పించేకి చూస్తే నేను ఇదుక్కుంటాను" అంది.

నల్లప్ప చావు గురించిన అదుర్దాకానీ ఆందోళనకానీ ఆమెలో లేవు.

పార్వతి తల్లి నీళ్ళు తెస్తూనే నీళ్ళు తాగేసి ముగ్గుల పుస్తకం తీసుకుని ఇంటిదారి పట్టింది శ్రీప్రియ.

★ ★ ★

పొద్దువాలిపోతూ ఉంది.

నాగులకట్ట దగ్గర గుంపులు గుంపులుగా జనం.

ఆడామగా, పిల్లాపెద్ద, ముసలీముతక అందరూ

పార్వతివాళ్ళ మిద్దె ఎక్కితే నాగులకట్ట, దాని పరిసర ప్రాంతాలన్నీ చాలా స్పష్టంగా కనిపిస్తాయి.

పార్వతి, శ్రీప్రియ మిద్దెమీదే ఉన్నారు.

వాళ్ళిద్దరి మొహాల్లోనూ ఆదుర్దా తొంగి చూస్తోంది.

నాగులకట్ట ముందర నల్లప్పని నీలం చారల డ్రాయరుతో మాత్రం నిలబెట్టి కాళ్లూ చేతులూ కట్టేసి ఉన్నారు. చెదిరిన జుట్టుతో బంధించిన ఆఫ్రికన్ బానిస స్పార్టకస్‌లా వున్నాడు.

అతని మొహం వాడిపోయి ఉంది. హనుమంతరెడ్డి నాగులకట్ట ఎక్కి

"ఇద్దో అందరికీ చెప్తాండా. మనూర్లో మునుపు ఎన్నడూలేనంత చెడిపోయినారు. పెద్దంతరం, చిన్నంతరం లేకుండా పోయింది. అది ఎక్కడ బాగా కనబడతా ఉండాది అంటే ఈ తక్కువ జాతి జనాలలో అంటే మాల మాదిగోళ్ళలో. ఈ నాయాండ్లు గవర్నమెంటోళ్ళకి ముద్దుబిడ్డలమని గర్వంగా ఉండారు. చట్టాలన్నీ వీళ్ళకే అనుకూలంగా ఉండాయికదాని బొలే నీలుగుడు.

"ఇక్కడ కాళ్లూ చేతులు కట్టేసి ఉండే మాలనాకొడుకు కండ్లు కావరమెక్కిన మద

పులంజా కొడుకు. వీనికి వయసు ఉండాది కదా అని ఉడుకు నెత్తురు ఉండాదికదా అని కాపోళ్ల ఆడపిల్లోల్లనీ, కమ్మోల్ల ఆడపి ల్లోల్లని పట్టుకొనేకి పొయ్యేది చేస్తా ఉండాడు. మొన్నటికి మొన్న వేమారెడ్డి బిడ్డ పార్వతమ్మ అనంతపురానికి పెండ్లికని పొయ్యింది. అట్లే వాళ్ల స్నేహితురాళ్లతో పాటీ సినిమాకి పోయింది. ఈ లమిడీకొ డుకు ఏమిజేసినాడు. ఇక్కడ కుంటిసాకులు చెప్పి అంతటితో ఊరుకోలా ఆ పాప చెయ్యి పట్టుకుండాడు. ఆ పాప ఎవురు? కాపుదన మోల్ల పిల్ల కదా! తీసి చెంప వాయగొ ట్టింది. దాంతో ఆడ గలాటా అయింది. ఆ చుట్టుపక్కల్లో వీన్ని కొట్టబోతే ఇది నా పెండ్లాం అంటనని నానా కూతలు కూసినా డంట" అంటూ చెబుతున్నాడు ఆవేశంతో.

"గొంచికాడా! మీరు పెద్దోళ్లు నేను చెప్పేది నమ్మండ్రి! నేను ఆడోళ్లని ఎట్ల మాట్లాడిస్తానో మా మాలగేర్లో అడగండి. నేను చెడ్డవాణ్ణని ఒక్కరు చెప్పినా నా కుత్తిక కోసుకుంటాను. నేను ఎవర్నీ బల వంత పెట్టలేదు. అసహ్యంగా మాట్లాడ లేదు. నా కులం నాకి నేర్పిండేది అణిగిమ ణిగీ ఉండే బానిసలక్షణం. నన్ను కోరిండే వాళ్లను కాదనలేదు. చేన్లల్లో, తోటల్లో పనులు చేసే వచ్చిన మా ఆడోళ్లని ఎందర్ని బలవంతం చేయలేదు మీ రెడ్ల పిల్లోల్లు. నేను అసలు..." అన్నాడు గొంతు చించు కొని నల్లప్ప.

"ఇనండి... వీడు ఎట్లా లంజికొడుకో బాగ తెలుసుకొంటిరికదా! ఆకిరీకి రెడ్ల పిల్లో ల్లమింద పడి ఏడుస్తావుండాడు. వీని తల్లిని... ఇట్లా లం... కొడుకును ఏం చెయ్యాలో చెప్పండ్రి" అన్నాడు హనుమంత రెడ్డి.

"తుండ్లు తుండ్లుగా నరికి కాకులకీ గద్దలకీ ఎయ్యాల్ల" అన్నాడొక యువకుడు.

"అవును నరికిపారెయ్యాల్లా! అప్పుడుగానీ ఈ మాల మాదిగనా కొడుకులకి బుద్ధి రాదు" అంటూ గద్దించాడు ఒక ముసి లోడు.

"చూస్తారేం మామా! ఇట్లా తప్పుడునా యల్ని గబ్బునూనె పోసి తగులపెట్టల్ల" అన్నాడు వేమారెడ్డి తమ్ముడు సుబ్బారెడ్డి.

దూరాన్నించీ మూల తిరుగుడులో నిలు చుకుని ఉన్న మాల, మాదిగలు బిక్కుబి క్కుమని చూస్తా వున్నారు.

"వరెవరె వాడు యా పాపము ఎరుగ దురా! ఆరుగాలము ఆ ఏమారెడ్డి ఇంట్లో గానుగెద్దు జేసినట్ల జేస్తావుండెరా. యట్లా వానిమింద నిందపడెరా. ఈ గొంచికాళ్లు ఏంజేస్తారో ఏమోనే" అంటూ కీచుగొంతుతో మాట్లాడుతూ కండ్లనిండా నీళ్లు పెట్టుకుం డ్డాడు కుంటి తిమ్మప్ప.

"రేయ్ కుంటోడా! ఊరుకోరా. మనం తక్కువోళ్లమప్పా! ఎప్పుడేం మాట్లాడితే ఏమయితాదో అనే ఇంగితం కూడా లేదు నీకి. అది వాని కర్మరా" అన్నాడు ఒక ముసలివాడు.

"ఏమండ్రప్పా! ఏం మాలోల్లు మీరు. పొయ్యి చెప్పపోండ్రి వానికేమి తెల్దని. ఆ పిల్లోడు మాలోడు కాదా! మీ మాలోల్లకి పుట్టలేదా" అంది ఆవేశంతో ఒక మాదిగ ముత్తైదువ.

"నువ్వు బొలేజెప్తావు కదమ్మా! వాళ్లకి ఎదురుజెప్పి బతికేది ఎవురు? అసలు ఆ పిల్లోని మింద ఏసిండే నింద ఎట్లాది? దాన్ని ఏమనేకి ఉంది? ఆ కాపోళ్లు వాన్ని అట్లే సంపాలనుకుండారు. అంటే మన తక్కువ కులాలోల్లంతా ఇంక ఎప్పుడూ వాళ్లకి భయం భక్తితో వాళ్ల కాళ్లకాడ పడి ఉండల్లనే తెలుసా!" అన్నాడు ఒక మాదిగ యువకుడు.

హనుమంతరెడ్డి బంధువులు అతని వర్గా నికి సంబంధించిన ఆడామగా నల్లప్పని తన్నడం మొదలుపెట్టారు. అక్కడున్న అందరిదీ ఒకటే దృష్టి. రేప్పొద్దున మన ఆడపిల్లను ఈ తక్కువ కులం నాయాళ్లు




ఎప్పుడూ కన్నెత్తి చూడకూడదన్నదే.

మిద్దెపైన ఉన్న పార్వతి "నేను చూడ లేను శ్రీప్రియా! ఇంట్లోకి పోతా" అంటూ గొణిగింది.

శ్రీప్రియకి కోపం వచ్చింది. "ఏందే నువ్వు ఇంట్లోకి పోతావా? మా తాత మాట్లాడ్తా ఉండేటివి తప్పు, ఆ రోజు అనంతపురంలో ఏమీ జరగలేదు. ఆ ఒక్కమాట చెప్పే అతన్ని చంపరు ఫో! పోయి చెప్పుపో" అంది.

"అయ్యయ్యో! మా నాయన ప్రాణాలు తీస్తాడు"

"ఊహూం నిజం చెప్తే నీ ప్రాణాలు పోతాయి. మరి ఆ అబద్ధంతో నల్లప్ప ప్రాణాలు పోతున్నాయి కదే!"

"అంతేనంటావా? సరే" అంటూ ధైర్యాన్ని కూడగట్టుకున్నది పార్వతి. లేచి మిద్దె దిగ డానికి వెనుతిరిగింది పార్వతి.

వాళ్ల వెనుకే ఉంది పార్వతి తల్లి కమ లమ్మ.

"ఏందే శ్రీప్రియా! ఆ మాలోని కోసం నా బిడ్డ అంతమందిలో పోయి జరిగిందేది చెప్పమంటావా? అంతా తెలిసే మాట్లా డుతా వుండావా?" అంటూ నిప్పులు కక్కింది ఆమె.

"అది కాదత్తా" అంటూ ధైర్యంగానే ఏదో చెప్పబోయింది.

"ఇంక చాలమ్మా! ఏందేందో నువ్వు చెప్పేది ఈ తెలివితక్కువది వినేది. ఏయ్ పారూ! నీకే చెప్తాండేది. మన ఇల్లు దాటి నావంటే నీకు కీళ్లు విరుగుతాయనుకో" అంటూ ఉరిమింది కమలమ్మ.

నాగులకట్ట దగ్గర కోలాహలం ఎక్కువ యింది.

పొద్దుమునిగింది.

సుబ్బారెడ్డి నల్లప్పమీద కిరోసిన్ దిమ్మ రించాడు.

"ఇంకా చూస్తావేరా అగ్గిపుల్లతో అంటించు" అన్నాడు అందాక చూస్తున్న నారపరెడ్డి వేమారెడ్డిని.

వేమారెడ్డి వెంటనే అగ్గిపుల్లగీసి అంటిం చాడు.

నల్లప్ప ఒంటిమీద మంటలు రేగాయి.

పెడబొబ్బలు పెడుతూ వున్నాడు నల్లప్ప.

గిలగిల తన్నుకోడానికి వీలులేదు తల ఒకటీ తట్టుకోలేక అటూ ఇటూ వేగంగా కదల్చుతూ ఉన్నాడు.

శ్రీప్రియ, పార్వతి కళ్లు మూసుకున్నారు.

కమలమ్మ మాత్రం మంచి శాస్తి జరి గింది అన్నట్టు కళ్లు ఇంతలు చేసుకుని ఆనందంగా చూస్తూ ఉంది.

దిక్కులు పిక్కటిల్లేలా నల్లప్ప అరుపులు.

సందు మలుపులో నిలబడివున్న వాళ్లు వణికిపోయారు. కండ్లనీళ్ల పర్యంతమయి నారు.

"ఎట్లా సావు వచ్చెనాయినా నీకి" వణుకు తున్న కంఠంతో ఒక ముసలామె అంటుంది.

రాత్రికి రాత్రే పోలీసుల్ని పట్నంనించి పిలిపించాడు హనుమంతరెడ్డి.

శవపంచాయితీ చేశారు వాళ్లు.

గ్రామ పరిపాలనాధికారి చేతా, సర్పంచి చేతా ఊర్లోని పెద్దమనుషుల చేత కైఫీయ తులు ఇప్పించాడు.

'వేమారెడ్డి ఇంట్లో పార్వతి నగలు నల్లప్ప దొంగిలించాడనీ, వెంటనే అతన్ని నగలతో సహా పట్టుకున్నారనీ పోలీసులకి పట్టిస్తా రని భయపడిపోయి మాలగేర్లో కాల్చుకొని ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించాడనీ, కొరప్రాణంతో ఉండగా పట్నంలో ఆస్పత్రికి తీసుకుపోవడానికి నాగులకట్ట దగ్గరకి తెచ్చారని, అయితే అప్పటికే అతని ప్రాణాలు గాల్లో కలసి పోయాయి' అని రిపోర్టును పోలీసులు రాసుకుపోయేలా చేశాడు హనుమంతరెడ్డి.

★ ★ ★

ఉన్నట్టుండి ఒక కొత్త విషయం స్ఫురిం



చింది నారపరెడ్డికి.

తీరా ఆలోచించేకొద్దీ ఆ విషయం కొత్తదేం కాదు పాతదే అనిపించింది. దాన్ని ఒక పదేళ్ల కిందట అమలుచేసి వుంటే ఈపాటికి తమ ఆర్థిక స్థితి చెప్పలేనంతగా మారిపోయి ఉండేది మరి.

ఆ కొత్త విషయం ఏమిటంటే తమ ఊరికి ఆనుకుని ఉండే శ్రోత్రియం భూముల్ని కైవసం చేసుకోవడం.

ఎక్కడో కర్నూలు జిల్లాలోనో, కడపజిల్లాలోనో ఉన్న ఇనాం భూములు, శ్రోత్రియం భూములు ఫ్యాక్షనిస్టుల స్వాధీనంలో ఉన్నాయి అని పేపర్లలో చదివినప్పుడన్నా వాటిని కైవసం చేసుకోవాలన్న ఆలోచన రాలేదు. ఎందుకని?

అక్కడ ఇనాం భూములు ఆలయానికి సంబంధించినవి అయి వుంటాయి. వాటిని ప్రభుత్వమే వేలంపాట పాడి ఎక్కువ పాడిన వాళ్లకి నాలుగేళ్ల పాటు లీజుకి ఇచ్చేస్తారు. ఆ వేలం పాడినది ఫ్యాక్షనిస్టు అయితే మరి ఎవరూ వేలం పాడరు. అందుకే అక్కడ దేవాలయ ఇనాం భూములన్నీ ఫ్యాక్షనిస్టులవే. ఏమంటే ప్రభుత్వం ఫార్మాలిటీస్ అబ్జర్వు చేయడంకోసమే వాటిని నామ మాత్రంగా జరిపిస్తుంటారు.

ఆరోజు ఉదయం కాఫీ తాగుతున్న సమయంలో ఈ విషయాలన్నీ చెప్పాడు తండ్రికి నారపరెడ్డి.

అయితే ఏమిటి లాభం? అన్నట్టు చూశాడు హనుమంతరెడ్డి.

"శ్రోత్రియం భూములు, మన భూములకు ఆనుకునే ఉన్నాయి. వాటిని మనం స్వాధీనపరుచుకుంటే ఎట్లుంటాది? " అన్నాడు.

ఆ మాట వింటూనే హనుమంతరెడ్డికి ఆనందంతో నోట మాట రాలేదు. తన కొడుకు ప్రయోజకుడనే నమ్మకం వాడు టెన్త్‌క్లాసు ఎగ్గొట్టి నప్పటినుంచి ఉంది.





అయితే మరీ ఇంత ఎక్కువ ప్రయోజకుడిగా ఎదిగిపోవడంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయినాడు.

తన తండ్రి ఏమీ మాట్లాడకపోవడంతో తనే చెప్పుకుపోవడం మొదలుపెట్టాడు నారపరెడ్డి.

శ్రోత్రియం భూములు అంటే ఇవి దేవాలయాల ఇనాం భూములున్నాయే అట్లాటివి కాదు నాయినా! ఇనాం భూములకి వేలం పాటలుంటాయి. ఇవి అట్లాటివి కాదు. బాపనోళ్లకి అప్పటికాలంలో రాజులో, జమిందారులో, లేదా పాలెగాళ్లో ఆ భూముల్ని శ్రోత్రియం భూములుగా రాసిచ్చి ఉంటారు. మన జిల్లేడుకుంట శ్రోత్రియందారులు అప్పుడే సగం భూమిని అమ్మేసుకున్నారు చుట్టుపక్కల ఊర్లవాళ్లకి. మిగిలిన సగం భూమిని అమ్మకానికి పెట్టినారు.

"అసలు మొత్తం భూమి ఎంతుందిరా"

"ఇంచుమించు వెయ్యి ఎకరాలు. అందులో ఐదు వందల ఎకరాలు అమ్మేసినారు. ఆ భూముల్ని మొత్తం మనమే కొంటే ఎట్లుంటాది నాయినా"

"ఎంత డబ్బు అయితాదోరా! ఇప్పట్లో కొనే పని పెట్టవాకురా. దొంగ సారాయి దుడ్లూ, రౌడీ మామూళ్లనించి వ్యాపారస్తుల దగ్గర వసూలు చేసిన దుడ్లూ అన్నీ ఈ నాయాళ్లని సాకేకి సాలుకొస్తా వుండాయి కదా" అంటూ తన ప్రైవేటు సైన్యాన్ని చూపించాడు.

"ఆ నాయాళ్లు లేకుంటే నువ్వూ, నేనూ లేములేగానీ నాకి ఒకటి అనిపిస్తావుంది. ఆ శ్రోత్రియందార్లు ఎవురన్నా అయివుంటే అది వేరే సంగతి. వాళ్లు చూస్తే బాపనోళ్లు. ఎవురికన్నా అయితే అన్యాయం చెయ్యొచ్చు చూసిచూసి బాపనోళ్లకి అన్యాయం చెయ్యకూడదు కదనాయినా. అందుకే మొత్తం భూమినంతా చీపుగా అమ్మేటట్టు నేను మాట్లాడుతా. నోర్మూసుకొని ఇచ్చిరా సరే సరి! లేదంటే వాళ్లు ప్రాణాలతో ఉండరంతే"

"వరేవరే ఇన్ని మాటలు యాలరా!

ముందుపోయి ఆ పని చూడు" అంటూ అక్కడినించి తరిమాడు హనుమంతరెడ్డి కొడుకుని.

★ ★ ★

మధ్యాహ్నం మీరుతుండగా శ్రీనివాసరావుని వెంటపెట్టుకుని వచ్చాడు నారపరెడ్డి.

హనుమంతరెడ్డిని చూస్తూనే శ్రీనివాసరావు నమస్కరించాడు. ప్రతి నమస్కారాన్ని తలతో మాత్రమే ఊపి తెలుపుతూ కూచోమని ఎదురుగా ఉన్న సోఫాని చూపించాడు.

కూచున్నాడు శ్రీనివాసరావు. ఎర్రగా ఉన్నాడు. పీక్కుపోయిన దవడలు, లోతుకుపోయిన కళ్లు. అవి చూసే భయం చూపులు. బట్టతల, చెవుల వెనుక ఉన్న జుట్టు కూడా సగం తెల్లబడిపోయింది. ఎంతలేదన్నా అతని వయసు అరవయ్యేళ్లకి పైబడి ఉండవచ్చని అనిపిస్తుంది ఎవరికైనా.

హనుమంతరెడ్డి అతనికి పక్క ఊరి మనిషే అయినా ఎప్పుడో ఏ ఎన్నికలప్పుడో జిల్లేడుకుంటకు పోయినపుడు ఓటు వేయమని అడగడమేకానీ అంతకుమించి పరిచయం కూడాలేదు శ్రీనివాసరావుకి. అయితే ఫ్యాక్షనిస్టు హనుమంతరెడ్డిగా బాగా తెలుసు. అసలు నారపరెడ్డి తన ఇంటి గుమ్మంలో కనబడినప్పుడే ఏదో అరిష్టం జరుగుతుందని ముందుగానే ఊహించగలిగాడు.

నారపరెడ్డి ఏం విషయం లేదంటూనే వాళ్ల భూములను కొనాలనుకుంటున్న విషయం చెప్పాడు.

అంతా విన్నాక "తరతరాలుగా వస్తున్నాయి మాకు శ్రోత్రియం భూములు. ప్రస్తుతం వున్న పధ్నాలుగు కుటుంబాలవాళ్లను ఆ భూములే ఆదుకుంటున్నాయి" అంటూ విన్నవించుకున్నాడు శ్రీనివాసరావు.

"మేం మీ భూముల్ని కొంటాం అంటున్నామండీ! దౌర్జన్యంతో ఆక్రమించుకుంటాం అనడం లేదు స్వామీ! ముందు మా నాయనతో విషయాలు మాట్లాడుదురురండి" అంటూ తీసుకుని వచ్చాడు నారపరెడ్డి.

హనుమంతరెడ్డి నారపరెడ్డి అడిగిన మాటే అడిగాడు శ్రీనివాసరావుని.

"వెయ్యి ఎకరాలు ఉన్న మా భూముల్ని మా కుటుంబాల అవసరాలకు అమ్మగా అమ్మగా ప్రస్తుతం అయిదు వందల ఎకరాలు మాత్రం మిగిలింది. ఇప్పట్లో మాకు పెద్ద అవసరాలు ఏవీ లేవుకాబట్టి మేము ఎవరమూ ఆ భూముల్ని అమ్ముకునేటట్లు లేము రెడ్డీ"

"సరేసరే ఒద్దులెండి. మా ఊరికి ఆనుకునుండే అన్ని భూములూ మా ఆక్రమణలకి వచ్చేస్తాయి. అంతే. ఏదో స్వాములు బాపనోల్లు. మిమ్మల్ని ఉసూరుమనిపిస్తే మాకు పాపం అంటుకుంటుంది అని. ఎంతో ఒకింత లేదనుకోకుండా మీ చేతికి ముట్టజెప్తామనీ, మీ భూముల్ని మా భూములుగా అనుకుండాము స్వామి"

హనుమంతరెడ్డి మాటల్లో దౌర్జన్యం కనిపించనియ్యకుండా సుతిమెత్తగా మాట్లాడుతున్నా శ్రీనివాసరావుకి మాత్రం విషయమంతా అర్థమయిపోయింది. ఇంక ఏమి మాట్లాడినాకానీ ఫలితం శూన్యమేనని తేలిపోయింది.

"చూడండి రెడ్డిగారూ! మేం అతి మామూలు బ్రాహ్మలం. మీరు తలుచుకుంటే ఏమయినా చేయగల రెడ్లు. జిల్లేడుకుంట గ్రామంలో మా కుటుంబాలు మొత్తం 14 ఉన్నాయి. అందరికీ ఆ భూమే ఆధారం. దీని మీద మీ మాట చెప్పండి ఎంతిస్తారు? "

"మొత్తానికి బ్రాహ్మణులు బ్రాహ్మణులే స్వామి. మీ బ్రాహ్మణులు శాపం పెడితే మేము ఏమైపోతామో స్వామి! మా ఊరి పొలిమేరకు ఆనుకుని ఉండే భూములు ఎన్ని ఎకరాలుంటాయి స్వామి? "

"దాదాపు 5 వందల ఎకరాల్లో ఉంటా



యేమో రెడ్డిగారూ! అయితే మీ ఊరివాళ్లకి 200 ఎకరాలు పైగా అమ్మి ఉంటాం"

"ఇద్దో శ్రీనివాసరావు స్వామీ! మీరు మీ భూములకి రిజిస్టరు చేయించే పనిలా. ఊరికే మాకు అగ్రిమెంటు మీద సంతకం పెట్టి ఇయ్యండి చాలు. ఇక్కడ ఏ నా కొడుకు వచ్చి మాదే ఈ భూమి అంటూ ముందుకు అడుగేస్తారో అదీ జూస్తాం" అన్నాడు హనుమంతరెడ్డి.

"అయ్యో! అట్లంటే ఎట్లండీ రెడ్డిగారూ! ఆనాడు మీ ఊరివాళ్లకి రిజస్టరు చేసి ఇచ్చాం"

"అయ్యా, స్వామీ! అవన్నీ మీకు అవసరం లేదు స్వామీ? రెండు లక్షల రూపాయలు ఇస్తాను. అగ్రిమెంటు కాగితమ్మీద సంతకం పెట్టేసి పోండి" అంటూ తేల్చేశాడు-హనుమంతరెడ్డి.

సాయంత్రానికల్లా రాతకోతలు పూర్తయినాయి. తక్కినవాళ్ల కుటుంబాల సంతకాలు కూడా పెట్టించమని చెప్పి అగ్రిమెంటుని శ్రీనివాసరావుకే ఇచ్చి పంపాడు హనుమం

తరెడ్డి.

మరుసటిరోజు మధ్యాహ్నానికల్లా అందరి సంతకాలతో అగ్రిమెంటు పూర్తయింది. శ్రీనివాసరావుకి ఐదు లక్షల రూపాయలు ముట్టజెప్పడం కూడా అయింది.

ఆ సాయంత్రానికే 'జిల్లేడు కుంటశ్రోత్రియం భూములు అన్నీ హనుమంతరెడ్డి స్వాధీనం చేసుకున్నట్టూ... ఆ భూముల్ని కొన్నవాళ్లు ఎవరయినా ఉంటే ఇంకమీదట సదరు భూముల్లోకి అడుగుపెట్టకూడదు. ఒకవేళ పెట్టినచో పరిణామాలు తీవ్రంగా ఉంటాయి' అంటూ చిన్న కొత్తపల్లిలో దండోరా వేయించాడు హనుమంతరెడ్డి.

అది విని శ్రోత్రియం భూములు కొన్నవాళ్లు లోపలలోపలే కుమిలిపోయారు.

★ ★ ★

అనంతపురంలో...

రంగయ్యతో తరుచూ కలుస్తున్నారు 'పోరుబాట' కమ్యూనిస్టునాయకులు. చిన్న కొత్తపల్లి గ్రామ పరిస్థితులను, ఆ చుట్టు పక్కల గ్రామాల స్థితిగతులను, ఫ్యాక్షనిజం స్థాయినీ చర్చించుచుతూ ఉన్నారు. పోరుబాట దళానికి చిన్న కొత్తపల్లికి దగ్గర్లో ఉన్న పెన్నగిరి కేంద్రంగా చేసుకోవాలని నాయకుల ఉద్దేశం.

★ ★ ★

హనుమంతరెడ్డికి మనమరాలు శ్రీప్రియ మీద ఎంత ప్రేమో మనమడు శ్రీధరరెడ్డి మీద కూడా అంతే ప్రేమ.

తన కొడుకు నారపరెడ్డికంటే ఎక్కువ ప్రయోజకుడవుతాడు శ్రీధరరెడ్డి అన్నదే అతని ఉద్దేశం. ఒకవేళ తనని మించిపోయినా ఆశ్చర్యపోడు.

శ్రీధరరెడ్డి పదోతరగతి దౌర్జన్యంతోనే కాపీకొట్టి పాసయినాడు.

సంవత్సరంనించి సరదాగా గడిపేస్తున్నాడు అంతే. ఇంటర్‌లో చేరమని తండ్రి తాత అడిగితే చదువు ఇష్టం లేదన్నాడు. తాతకు తెలిసిపోయింది అది వారసత్వంగా వచ్చింది అని.

ఈమధ్య శ్రీధరరెడ్డికి 'పల్లె' అంటే సరిపోవడంలేదు. అప్పుడప్పుడు అనంతపురానికి, ఎప్పుడూ 'పేట'కి పోయి వస్తుంటాడు. అంతటితో అతనికి తృప్తికలగడంలేదు.

అందుకే ఒక నెల నుంచి తాతతో పోరుతూ ఉన్నాడు. "మనం పేటకి పోయి అక్కడే ఇల్లు కట్టించుకుందాం తాతా! ఏంది ఈ పల్లెలో అంతా మురికి, పెద్దరోడ్లులేవు. ఊరిబయటవరకూ దిబ్బలూ, గడ్డిదొడ్డెండ్లు, ఇంక మనుషులు చూస్తే స్నానాలు చెయ్యక కంపుకొడతా ఉంటారు. ఇక్కడ నాగరికత అంటే తెలీని స్థాయిలో ఉండల్లా మేము" అంటూ ఈ పద్ధతిలో ఇంచుమించూ ఈ మాటల్నే మాట్లాడం మొదలుపెట్టాడు.

మొదట్లో హనుమంతరెడ్డి పెద్దగా పట్టించుకోలేదు. కొట్టిపారేసేశాడు. ఒక వారం రోజులుగా తన తల్లోనూ పట్నంపోతే మంచిదేనా అయితే దాని లాభమేమి? పల్లె నష్టమేమి? అన్న ఆలోచన మెదలుతూ ఉంది.

ఒకరోజు కొడుకునీ, మనమడినీ ఎదురుగా కూచోబెట్టుకుని చర్చకుపెట్టాడు ఆ విషయాన్ని.

మన ఫ్యాక్షన్ని పట్టణప్రాంతానికి విస్తరించవచ్చు. పేటలో మన కత్తికి ఎదురుండదు. మనం లారీలూ, బస్సులు పెట్టాలనుకుంటున్నాం కదా. ఆ బిజినెస్‌కి పట్నమయితేనే సరిపోయేది. పట్నంలో ఉన్నా ఇక్కడ మన శేషారెడ్డి వాళ్లు ఉంటారు కాబట్టి చిన్న కొత్తపల్లెమీద మన పట్టు సడలదు. పైగా రాజకీయంగా ఎదగాలంటే మనకి పట్నమే మంచిది. పోలీసుఅధికార యంత్రాంగం కూడా పట్నంలో ఉంటే మన అధీనంలో ఉంటుంది.

ఇన్ని విషయాలూ వాళ్లని పట్నంవైపు మొగ్గు చూపేలా చేశాయి.

అంతే ఇంక ఆరోజునించే పేటకు చేరేందుకు ఏర్పాట్లు మొదలయినాయి.




ఈమధ్యే పేటలో అరెకరంలో కట్టించిన పెద్ద భవంతిని ఇరవైలక్షలు పెట్టి కొనుగోలు చేశారు. వారంలోగా చిన్న కొత్తపల్లి నించి పేటలోని కొత్తభవంతికి మారారు.

అట్లా వాళ్లు మారినరోజున ఊర్లోని చాలా ఇండ్లు సంతోషాన్ని పట్టలేక ఓళిగలు చేసుకుని ఆనందంగా తిన్నారు.

మాలగేర్లోనూ, మాదిగగేర్లోను లోపల్లో పలే గంతులేసినారు. అప్పుడు ఇబ్బందిపడింది మాలగేర్లో శ్రీరాములు, మాదిగగేర్లో ఈశ్వరి, ఓబిళేసులు వాళ్ల కుటుంబాలు మాత్రమే.

చిన్న కొత్తపల్లిలోని మాల, మాదిగ యువకులతో లారీలకూ బస్సులకూ రుణాలకుగాను ప్రభుత్వ సంస్థలైన ఫైనాన్సింగ్ కార్పొరేషన్లలో అర్జీలు పెట్టించాడు శ్రీధర రెడ్డి. ఆఫీసర్లకి మందులతో విందులు చేయడంతో చాలా త్వరగా అప్పులు మంజూరు అయినాయి.

బస్సులకీ, లారీలకి పర్మిట్లు వగైరాలన్నీ సంపాదించడం డబ్బుతోనే ముడిపడి ఉండటంవల్ల పెద్ద కష్టమేమీ కాలేదు.

'పేట'కి వచ్చాక ఆరు నెలలకే బస్సు రూట్ల విషయంలో తక్కిన బస్సు ఓనర్ల కంటే ఎక్కువ సంపాదించేశారు. జులుం దౌర్జన్యం, నిర్లక్ష్యం, కలగలసిన శ్రీధరరెడ్డిని చూస్తుంటే ఎట్లాంటివారికైనా వెన్నులో వణుకు తప్పదు.

★ ★ ★

ఉదయం తొమ్మిదిగంటలయి ఉంటుంది. శ్రీధరరెడ్డి టాక్సీ నడుపుతున్నాడు. హనుమంతరెడ్డి పక్కనే కూచుని ఉన్నాడు. చిన్న కొత్తపల్లి వైపుకు వెళ్తూ వుంది టాక్సీ.

"సిద్ధారెడ్డిగాడు చచ్చిపోయినాక మనకు కొంచెం నిర్లక్ష్యం ఎక్కువయిందేమోరా!" అన్నాడు హనుమంతరెడ్డి మనమడితో.

"నిజమే తాతా! యానాడన్నా ఇట్ల గన్ మేన్ లేకుండా మామూలు మనుషులు పోయినట్లు పోయివుండామా అయినా నేను న్నాను నా దగ్గర గన్నుంది. ఇంక వేరే గన్ మెన్ ఎందుకు తాతా"

"నాకు ఇంకా కొతుకు ఉందిరా. సిద్ధారెడ్డి గాని కొడుకు సుధాకర్‌గాడు ఒక్కడూ లేకుండా పోయింటే ఆ కతే వేరుగా ఉండె. వాడెక్కడ ప్రతీకారం తీర్చుకొనేకి ఏక్షణంలో నైనా ఊడిపడతాడేమోనని భయంగా ఉందిరా"

"ఛ! వానికేంది తాతా, మనం భయపడేది"

"భయం అంటే భయమనికాదు. ఫీలింగ్ అంతే... వాడిని ఎక్కడున్నా నరికెయ్యమని మనుషుల్ని పంపినా, అసలు వాని జాడే కానరాలేదంట"

"ఏం ఫర్వాలేదులే తాతా! వాడు రాడూ, రాలేడు" అంటూనే వాళ్ళ వాహనానికి ముందు పోతూ ఉన్న లారీని సైడు ఇవ్వవలసిందిగా హారన్ కొట్టాడు శ్రీధరరెడ్డి.

ఎంత గట్టిగా, ఎన్నిసార్లు హారన్ కొట్టినా సైడు ఇవ్వలేదు.

అసలే దుడుకు మనిషి శ్రీధర్‌రెడ్డి. కోపం నషాలానికి అంటింది. నిలపకుండా హారన్ కొడుతూ, లారీకి కుడివైపున ఏమాత్రం సందుదొరికినా దూరాలని చూస్తున్నాడతను.

పావుగంట తర్వాత లారీవాడు ఎందుకో సైడు ఇచ్చాడు.

ఆలస్యం చేయకుండా లారీని అధిగమించి మరికాస్త వేగంతో మరింత ముందుకు పోయి రోడ్డుకు అడ్డంగా నిలబెట్టి నెమ్మదిగా దిగాడు శ్రీధరరెడ్డి. అతనితోపాటూ హనుమంతరెడ్డి కూడా దిగాడు.

లారీ ఆగింది.

శ్రీధరరెడ్డి కోపం పట్టలేక లారీ దగ్గరికి వెళ్లాడు "నీయమ్మ... నా కొడకు" అంటూ బూతులు తిడుతుంటే.

లారీడ్రైవర్ సైడివ్వకుంటే అంత కోపమొస్తుందా? అనుకుని "రేయ్! ఏందిరా కూస్తా వుండా భాంచోత్!" అంటూ దిగాడు లారీ



డ్రైవరు. లారీ క్లీనరుకి అయోమయంగా ఉంది ఇదంతా.

నన్నే తిడ్తావా అంటూ శ్రీధరరెడ్డి లారీడ్రైవర్‌పై ఎక్కడ పడితే అక్కడ పిడిగుద్దులు బలంగా కురిపించాడు.

లారీడ్రైవరు దిమ్మెరపోయి, తనూ తన్నడం ప్రారంభించాడు. ఇదంతా చూసేటప్పటికి హనుమంతరెడ్డికి మరింత కోపం వచ్చింది. తిరుగులేని దొరతనం చెలాయిస్తున్న తననీ, తన అధికారాన్ని ఆఫ్టరాల్ ఒక లారీడ్రైవరు ఎదిరిస్తున్నాడా?

ట్రాక్స్‌లో పక్కనే ఉంచుకున్న తుపాకీ బయటకు పీకి డ్రైవర్‌కేసి గురిపెడుతూ "రేయ్ లారీడ్రైవర్‌గా! నీ ప్రాణాలు పోతాయి రారేయ్" అంటూ అరిచాడు.

లారీడ్రైవరుకి హనుమంతరెడ్డి చేతుల్లో ఉన్న తుపాకీ చూసేసరికి జడుపు పుట్టింది. ఏమో జరుగరానిది ఏదో జరుగుతుందేమో అని నిశ్చేష్టుడయి శ్రీధరరెడ్డిని వదిలేశాడు.

"ఏరా లమిడీ... నామీద చెయ్యి జేసుకుంటావా? నువ్వు ఆఫ్టాల్ లారీ డ్రైవరుగానివి. నేను పదిలారీల ఓనర్నిరా" అంటూ కోపంతో ఊగిపోతూ తాతచేతిలోని గన్నుని తన చేతుల్లోకి తీసుకుని వెంటనే కాల్చిపారేశాడు. 'ఢాం' మని పేలింది తుపాకి.

రక్తపుమడుగులో లారీడ్రైవరు తన్నుకొంటున్నాడు.

ఇదంతా చూసి లారీ క్లీనరు పరుగోపరుగు.

తీరిన కసితో.

విజయగర్వంతో

యధాప్రకారంగా ట్రాక్స్‌లో తాతామనవళ్లు వేగంగా సాగిపోయారు.

★ ★ ★

ఉదయం తొమ్మిదిన్నర అయింది.

శ్రీకృష్ణదేవరాయ యూనివర్శిటీలో ఆడవారి హాస్టల్‌లోని రెండోగదిలో లత ఆత్రంగా డ్రెస్ వేసుకుంటోంది.

లేత పసుపురంగు పంజాబీ డ్రెస్ వేసుకుంది.

యాంత్రికంగానే తల దువ్వుకోవడం, ముఖానికి పౌడరు వేసుకోవడం చేస్తోంది. ఆమె మనసంతా పదిగంటలకి జరుగబోతున్న 'ఫ్యాక్షనిస్టులు- ఒక పరిశీలన' అన్న అంశంపై తను సమర్పించబోతున్న పేపర్ గురించే ఆలోచిస్తూ ఉన్నది.

ఆ సెమినార్‌లో దాదాపు పదిమందిదాకా పేపర్లు చదువుతున్నారు. అందర్లోకి తన పేపరు ప్రత్యేకంగా ఉంటుందన్నది నిజం. తను తప్ప తక్కిన అందరూ ఫ్యాక్షన్ అంటే పేపర్లో చదివో ఎవరయినా చెబితే వినో రాసి ఉంటారు. తన మాదిరి ఫ్యాక్షన్ బాధిత కుటుంబంలోనించీ ఎవరూ వచ్చి వుండరు. తన పేపర్లో ఫ్యాక్షన్ బలంగా ఉన్న ప్రాంతాలలో ఫ్యాక్షన్ అంటే భయపడే మనుషులూ, దానికి దూరంగా బతుకుతున్న వాళ్లు కూడా ఫ్యాక్షన్‌లో భాగమైపోతారు. బలయిపోతారు అన్న అంశాన్ని బలంగా చెబుతున్నది.

తనకంటే ఎవరూ పేపరు అంతబాగా రాసి ఉండరని ధీమా లోలోపల ఉంది లతకు.

"ఉషా! ఇంకెంతసేపే నీ స్నానం. నేను రెడీ అయినాను' సెమినార్‌కి టైమవుతోంది" అంటూ కేక పెట్టింది లత.

"ఆ నాదీ అయిపోయింది లేవే వస్తున్నా" బాత్రూంలోంచి ఉష సమాధానం.

ఉషా లతకి రూమ్మేటు మాత్రమే కాదు క్లాసుమేట్ కూడా. ఆమె ఊరు పెనుకొండ.

పదినిమిషాల్లో ఉష కూడా తయారవడంతో యూనివర్శిటీ కాంపస్‌వైపు బయల్దేరారు ఇద్దరూ.

★ ★ ★

ఫిజిక్స్ సెమినార్ హాల్లోనే యూనివర్శిటీలోని అన్ని డిపార్ట్‌మెంట్ల సెమినార్లూ జరిగేది.

సోషియాలజీ డిపార్టుమెంటుకు సంబం

ధించిన "ఫ్యాక్షనిజం ఒక పరిశీలన" అన్న అంశంపై సెమినార్‌ను అక్కడ ఏర్పాటు చేశారు.

సెమినార్ ప్రారంభమయింది.

అసిస్టెంట్ ప్రొఫెసర్లూ, అసోసియేట్ ప్రొఫెసర్లూ, ప్రొఫెసర్లూ... వేదికని అలం కరించి ఉన్నారు.

మొదటి రెండో సంవత్సరం ఎం.ఏ. సోషియాలజీ విద్యార్థినీ, విద్యార్థులందరూ దాదాపు అరవైమందిదాకా అక్కడ కూచుని ఉన్నారు.

రెండోవరుసలో ఎం.ఏ, ఫైనలియర్ విద్యార్థుల్లో రామచంద్ర కూచుని ఉన్నాడు.

అక్కడ పేపర్ సబ్‌మిట్ చేస్తున్న వాళ్లలో అతనూ ఉన్నాడు.

ఆడపిల్లలు ఇరవైమందిదాకా ఉన్నారు. పేపర్ సబ్‌మిట్ చేస్తున్న వాళ్లలో లత ఒక్కతే ఆడపిల్ల. అందుకే ముందుగా ఆమెనే చదవాల్సిందిగా కోరారు సీనియర్ ప్రొఫెసర్ ఏ.కే.రావు.

తను ఎట్లా చదవాలో ముందుగా ఉష ముందు ప్రాక్టీస్ చేసినందువల్ల తడబాటులే కుండానే ఎదుటివారిని ఆకట్టుకొనేలా చదవ గలిగింది.

చప్పట్లతో మారుమోగి పోయింది హాలంతా.

చదవడం అయిపోతూనే నేరుగా వచ్చి ఉష పక్కన కూచుంది లత.

తక్కిన వాళ్లు ఒక్కరొక్కరే చదువుతు న్నారు.

విషయ వివరణ సరిగాలేకపోవడంతో సోదె చెప్తున్నట్టుగా అనిపించి బోర్ ఫీల్ అవుతోంది లత.

'ఫ్యాక్షనిస్టుల గురించా, వీధి రౌడీల గురించా ఈ మహానుభావుడు రాసింది' అంటూ గొణిగింది ఉష.

ఆమె పలకడంలో వ్యంగ్యానికి లతకి నవ్వొచ్చింది.

తల వంచుకుని నవ్వుని బిగబట్టుకుంటూ "ఏయ్ ఏమిటే నీ పోకిరీ కామెంట్స్ నోర్మూ సుకో" అంది మెల్లగా.

"లేకపోతే... వీళ్లకి సబ్జెక్ట్‌మీద పట్టులేన ప్పుడు నా మాదిరి ఊరికే ఉండల్లగానీ"

"ఇప్పుడు ఫైనలియర్ స్టూడెంట్ మిస్టర్ రామచంద్ర పేపర్ సబ్‌మిట్ చేస్తారు" అంటూ ఏ.కే.రావు ప్రకటించాడు.

"ఊc... ఇంక చివరి మహానుభావుడు గారు. ఏం కుళ్లబొడుస్తాడో... అబ్బా... ఆ మొహం చూడు ఏం వెలిగిపోతా ఉందో. స్టేజీమీద ఉండేలైట్లు ఆఫ్ చేసినా ఫర్వా లేదు. అందరికీ జ్ఞానోదయం చేసేస్తా అన్నట్టు పెద్ద పోజొకటి. ఊ ఇంకా ఆలస్య మెందుకు నాయనా! మా తలకాయలు ఒప్పగించినాం కదా! నువు వాటిని కరకర మంటూ నమిలేయడమే తరువాయి" అంటూ ఉంది ఉష.

తనకు ఈ గొణుగుడు బాగానే ఉన్నా. ఎక్కడ తను గట్టిగా నవ్వేస్తానో అన్న భయం మరీ ఎక్కువవుతోంది లతకి. "ఏయ్ ఉషా! నీకు పుణ్యముంటుంది. ప్లీజ్ కాసేపు ఈ సుత్తినీ భరిద్దామే" అంది అభ్య ర్థిస్తున్నట్టు ఓరకంటితో ఉషని చూస్తూ.

బుద్ధిగా సరేనన్నట్టు తల ఊపింది ఉష.

రామచంద్ర పేపర్ చదవడం ప్రారంభిం చాడు.

"ఫ్యాక్షనిజం అన్నది వ్యభిచారం కంటే హీనమయినది. వ్యభిచారం చేసే వేశ్య బతుకే నయం. ఎదుటివారిని సుఖపెడు తుంది. ఫ్యాక్షనిస్టు బతుకు అట్లా కాదు. తను సుఖపడలేదు. ఎదుటివాడిని సుఖపడ నియ్యడు. బతికినంతకాలం చస్తూ బతు కుతూ ఉండాల్సిందే' ఈ మాటలు నావి కావు. నేను కల్పించి రాసినవీ కావు. ఈ జిల్లాలో పేరుమోసిన ఒక ఫ్యాక్షనిస్టువి. ఒక ప్రముఖ తెలుగు దినపత్రికకోసం విలే ఖరి ఇంటర్వ్యూ చేసినపుడు స్వయానా ఆ ఫ్యాక్షనిస్టు అన్న మాటలు. ఈ ఇంటర్వ్యూ ఆమధ్య వచ్చింది. నిజానికి ఆ ఫ్యాక్షనిస్టు



గొప్ప నిజాయితీతో అన్న మాటలు కావని నా ఉద్దేశం. అవి అతను తన జీవితాన్ని స్వేచ్ఛాకోణంలోంచి చూసినపుడు యాదృచ్ఛికంగా కొంత విరక్తితో అన్న మాటలు" అంటూ నెమ్మదిగా మొదలయింది ఆ పేపరు.

ఏదో వినక తప్పదు కదా అన్న ఉద్దేశంతో వింటూ ఉన్న లత ఒక్కసారి అలర్ట్ అయిపోయింది. అతని పేపరు ఆషామాషీది కాదన్న విషయం తెలిసిపోయినట్టని పించింది.

"ఇప్పుడు ఫ్యాక్షనిస్టుగా మనం అంటున్న వీళ్ల పుట్టుక ఇప్పటిదికాదు. శ్రీకృష్ణదేవరాయలు కాలంలో పాల్యంకర్ వ్యవస్థ ఉండేది. దాని ప్రతిరూపమే పాలెగాళ్ల వ్యవస్థగా రూపొందింది. అప్పటి పాలెగాళ్లే ఇప్పటి ఫ్యాక్షనిస్టులుగా పరిణతి చెందారు"

చారిత్రకంగా పాలెగాళ్ల వ్యవస్థను రామచంద్ర విశ్లేషిస్తూ ఉంటే ఆశ్చర్యపోతూ వింటూ ఉండిపోయింది లత.

"ఇతన్లో స్టఫ్ ఉందే ఏమో అనుకుంటి" అంది గొణుగుతూ ఉష.

అవునన్నట్టు తల ఊపి వినడంలో నిమగ్నమైంది లత.

"పాలెగాళ్లలో కూడా పాత పాలెగాళ్లు ఎట్లా ఉండేవాళ్లూ? ఈనాడు కర్నూలు జిల్లాలోని ఉయ్యాలవాడ నరసింహారెడ్డి పేరును మనం అందరం విన్నాం. అతని గురించి బుర్రకథలు కూడా అక్కడి పల్లెల్లో పిచ్చుకుంట్లవాళ్లు పాడుతూ పొట్టపోసుకుంటూ ఉంటారు. అయితే దురదృష్టమేమిటంటే ఈమధ్యనే ఒక రచయిత అతన్ని హీరోగా చేస్తూ, తెల్లదొరల్నీ, తెల్లదొరతనాన్నీ ఎదిరించిన దేశభక్తుడిగా ఏకంగా నవలే రాసేశాడు. నిజానికి ఉయ్యాలవాడ నరసింహారెడ్డి నాయనమ్మది పాలెగాళ్ల వంశం. అప్పట్లో దత్తమండలాలకు కలెక్టరుగా పనిచేసిన మన్రో ఆధ్వర్యంలో వాళ్లని జమీందార్లుగా గుర్తించారు. నరసింహారెడ్డి తండ్రికీ, చిన్నాన్నా, పెదనాన్నలకి కూడా జమీందారీలు ఇచ్చారు. అయితే వీళ్ల శిస్తు సక్రమంగా చెల్లించడం లేదని వాటిని రద్దు చేసి, పెన్షను ఇచ్చారు.

దీనికి వ్యతిరేకంగా నరసింహారెడ్డి తిరుగుబాటు లేవదీశాడు. తొమ్మిదివేల మందిని సమీకరించి కోవెలకుంట్ల సబ్‌ట్రెజరీమీద దాడి చేశాడు. అప్పుడు బ్రిటిష్‌వారు ఎదురుదాడి చేసి అతనిని అరెస్టుచేశారు. అతని కుటుంబాన్నంతా కడపలో నిర్బంధించి సైనిక కోర్టులో విచారించి అతనికి 1847 జనవరి తొమ్మిదిన ఉరిశిక్ష విధించారు.

గ్రామాలలో ఈ ముఠాకక్షలనుంచి పై స్థాయిలో కొద్దిమంది నాయకుల ఆధిపత్యం వరకూ దీని నిర్మాణం ఒక దొంతర వంటిది. ఒక్కొక్క సాయుధ ముఠానాయకుడు తన ఆధిపత్యాన్ని ఒక్కో రూపంలో చెలాయిస్తుంటాడు. అయితే అందరూ ఒక మేరకు సమాజంమీద సాయుధ ఆధిపత్యాన్ని నెలకొల్పి ఆస్తుల సంపాదనకూ రాజకీయ అధికారానికి దాన్ని సోపానంగా చేసుకుంటారు"

అంటూ రామచంద్ర చదువుతూ ఉంటే 'మంచి విశ్లేషణ' అనుకుంది లత. రామచంద్ర ఒక్కో పేజీ చదువుతూ ఉన్నాడు.

పాత ఫ్యాక్షనిస్టులకీ, కొత్తఫ్యాక్షనిస్టులకీ గల తేడాను చెప్పాడు.

"...1980లకు ముందు ఫ్యాక్షనిస్టులు వాడిన ఆయుధాలు వేటకొడవళ్లూ, గొడ్డళ్లూ, గొరకులూ (అంటే ఈటెలు) అయితే ఎప్పుడన్నా ఒక రివాల్వరో, ఒక తుపాకో వాడడం జరుగుతుండేది. 1980ల తర్వాత ఆ ఆయుధాల స్థానంలో బాంబులు, నాటు తుపాకులు, లైసెన్సుడు తుపాకులు ప్రవేశించాయి.

"అప్పట్లో మూడు నాలుగు వేల రూపాయలు పెట్టుకుంటే తుపాకీ లైసెన్సు దొరికేదట. కడపకు చెంది ఒక రెడ్డి హోంమినిస్టరు అయ్యాక పదీపదిహైదు వేల రూపా

యలు ఖర్చుపెట్టుకుంటే చాలు ఒకే ఒక్క రోజులోనే తుపాకీ లైసెన్సు దొరికేదట. ఈ విషయం కూడా ఒక ఫ్యాక్షనిస్టు పత్రికకి ఇచ్చిన ఇంటర్వ్యూలో లభ్యమైంది.

"...ఇక్కడ ఒక ఆశ్చర్యకరమైన విషయం చెప్పుకోవాలి. అదేమిటంటే ఈ తుపాకులు ఎందుకు? అని ప్రశ్నిస్తే, శత్రు నిర్మూలనకో, లేదంటే ఆత్మరక్షణ కోసమనో సమాధానం వస్తుందనుకుంటాం.

ఒకవేళ ఎవరైనా ఆ మాట చెబితే అది నిజమేననిపిస్తుంది. అయితే అంతకన్నా ఫ్యాక్షనిస్టులకి ఉపయోగం మరొకటుంది. అదే ప్రజల్ని భయభ్రాంతుల్ని చేయడమన్న మాట. అప్పుడే తాము చెప్పింది వేదమవుతుంది. తమ కత్తికి ఎదురు లేకుండా పోతుంది.

లత అదే విషయాన్ని చెప్పాలని అనుకుంది. అయితే దాన్ని ఎలా చెప్పాలో తెలియలేదు. కానీ ఇప్పుడు రామచంద్ర ఎంత బాగా చెప్పాడు ఆ పాయింటుని.

ఫ్యాక్షనిస్టుల మందుపాతరల గురించి చెప్పాడు.

ప్రత్యర్థుల భూములలో చీనీ, మామిడి చెట్ల నరికివేత గురించి చెప్పాడు.

దొంగసారా అమ్మకం గురించి చెప్పాడు.

ఓట్ల రిగ్గింగు గురించీ చెప్పాడు.

"ఘర్షణ ఉండేది ఎక్కువగా రెడ్ల కులంలోనే. అయితే వాళ్ళ ముఠాలలో చేరేది ఎక్కువగా కింది కులాలకి చెందిన పేదవాళ్ళే. అప్పటికీ ఇప్పటికీ ముఠాలలో చేరి దొమ్మీలలోనూ, హత్యల్లోనూ పాల్గొనేదీ పాలుపంచుకొనేదీ మాల, మాదిగ, ఎరుకుల, లంబాడీ, బోయ, ఈడిగ కులాలవాళ్ళే. కొట్లాటలకు పోయేదీ వీళ్ళే. దెబ్బలు తినేదీ వీళ్ళే. చచ్చేదీ వీళ్ళే జైలుకు పోయేదీ వీళ్ళే.

"రాయలసీమలోని ప్రజలందరూ ఫ్యాక్షన్ని ఉమ్మడిశత్రువుగా పరిగణించాలి. ప్రజాస్వామ్య వాదులూ, అన్ని రాజకీయ పార్టీలూ ఈ ఉమ్మడి శత్రువుని యుద్ధప్రాతిపదికమీద కూల్చగలిగిననాడే మన రాయలసీమ పురోగమించగలుగుతుంది. అట్లాంటి రోజు తొందరగా రావాలని ఆశిస్తూ... సెలవు తీసుకుంటున్నాను"

అంటూ ముగించాడు రామచంద్ర.

హాలంతా కరతాళధ్వనులతో హోరెత్తింది.

లతకు ఆ పేపరు ఆద్యంతం నచ్చింది. అందుకే నవ్వుతూ సంతోషంగా చప్పట్లు చరిచింది.

"చాలు చాలులేవే నీ చప్పట్లు, వాళ్ళు చూస్తారు" అంది ఉష మగవాళ్ళవైపు కళ్ళతోనే చూపిస్తూ.

"చూడనీ... నిజంగా చానా బాగుంది అతని పేపరు. పదా... పోదాం బయటికి'' అంటూ లేచింది లత. ఇద్దరూ హాలుబయటికి నడిచారు.

రామచంద్రని ప్రొఫెసర్లూ, అతని క్లాసుమేట్లూ అభినందించారు.

"అక్కడే ఉండి అతన్ని అభినందించి ఉంటే బాగుండేదేమో" అంది ఉష లత వెంట నడుస్తూ.

"అభినందించేందుకే ఇక్కడికి వచ్చినాము. అక్కడే అయితే ఒకమాటతో అభినందన తెలుపుతాం. ఆ పార్కుదగ్గరే ఉందాం. అతను ఎలాగూ ఇటే తన హాస్టలుకు వెళ్తాడుకదా. పరిచయం కూడా చేసుకుందాం"

"అట్ల చెప్పు... సర్లేరే పద"

పార్కుముందుకు చేరుకున్నారు.

★ ★ ★

వేపచెట్టు నీడనే నిలుచున్నారు లత, ఉషలు.

ఉషలో సహనం నశిస్తోంది. "అబ్బా ఎంతసేపే కాళ్ళు పీకుతున్నాయి. ఈ మహానుభావుడు ఎంతకీ రాడే. పోనీ రేపు కలుద్దాం రా. నాకు ఆకలేస్తోందమ్మా" అంది.

"అదిగోనే వచ్చేస్తున్నాడు. రెండుమాటలు

# ఏరినముత్యాలు

* నీ జీవిత చరితార్థతకు ఏదో మంచి పని చేసి జీవితకాలం వ్యర్థం కాలేదని సంతృప్తిపడు.

— చిన్మయానంద

* కొడుకు పెండ్లి అయేంతవరకే కొడుకు. కానీ కూతురు మాత్రం జీవితాంతం కూతురే.

— సిడ్నీస్మిత్

* విజయ రహస్యాన్ని నేను చెప్పలేను. కానీ అపజయానికి రహస్యం మాత్రం అందర్నీ మెప్పించడానికి ప్రయత్నించడంలోనే ఉంది.

—బిల్‌కాస్‌బి

* భగవత్సంకల్పం కాదు. సంకల్పమే భగవంతుడు.

— అమ్మ

* విజయాన్ని ఎదురు చూస్తున్న వాడిలో అపజయాన్ని ఎదురుచూస్తున్న వాడికంటే ఎక్కువ శారీరకశక్తి ఉంటుంది.

— డోరాఆల్బర్ట్

* నలుగురు గాయకుల బృందంలో ప్రతి ఒక్కరూ మిగతా ముగ్గురూ పాడలేరని అనుకుంటుంటారు.

— డోరిస్ మెలోని

* ఒకవైపు మాత్రం ఆలోచించే మనిషిని మనం స్పెషలిస్టు అంటాము.

— ఎండ్రిబలోగ్

* మన ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే మనకు విమర్శ అవసరం ఎంతయినా ఉంది.

— హెన్రీఫోర్డ్

* గొప్పవారం అవుతున్నామన్న అనుభూతిని కలిగి ఉండటం అన్నది కష్టమైన పనే.

— గ్రిఫెత్ బిన్నింగ్

* కాలం అప్పుడప్పుడూ పక్షిలా ఎగురుతుంది. ఒక్కోసారి అది నత్తలా పాకుతుంది.

— ఇవాన్‌టర్‌జెనేవ్

* బంగారు ఆభరణాలు ధరించినా కోతి కోతే.

— లాటిన్ సామెత

సేకరణ: పి.వి. రమణ కుమార్

మాట్లాడి పోదాంలే"

రామచంద్ర తన క్లాసుమేట్స్‌తో మాట్లాడుతూ మెల్లగా నడుస్తున్నాడు. టౌన్‌లోకి వెళ్ళేందుకు అతని క్లాస్‌మేట్స్ వెళ్ళిపోయారు. ఒక్కడే మిగిలాడు.

దగ్గరగా వస్తూనే లత, ఉషలను చూస్తూ...

"మీ పేపరు నాకు నచ్చింది. చాలా బావుంది. అభినందనలు తెలుపుదామనుకుంటే అక్కడ మీరు లేరు. ఫ్యాక్షను ప్రాంతాల్లో దానికి భయపడే మనుషులు కూడా అందులో భాగమవుతారు అన్న పాయింటుని చాలా బాగా చెప్పారు. మీ పేపర్‌లో మంచి డెప్త్ కనబడింది. కంగ్రాట్స్" అన్నాడు చిరునవ్వుతో రామచంద్ర.

"థాంక్స్ రామచంద్రగారూ. మేమిక్కడ పది నిమిషాలుగా కాచుకున్నది మిమ్మల్ని అభినందించి వెళ్ళాలనే. చాలా కొత్త విషయాలతో ఎంతో ఇంట్రస్టింగ్‌గా ఉండేట్టు ప్రిపేర్ చేశారు పేపర్ని. నేనసలు ఊపిరి తీసుకోవడమే మరిచిపోయాను. నాకు కొన్ని అనుమానాలున్నాయి. మీ పేపరు మీదకాదు, ఫ్యాక్షనిజంమీద... తర్వాత మాట్లాడుకుందాం. కంగ్రాట్స్... మీ విశ్లేషణ మార్వలెస్" అంది లత.

"థ్యాంక్స్ లతగారూ"

"మా లత అభిప్రాయమే నాదీనూ... కంగ్రాట్స్‌తోపాటూ" అంది ఉష.

"అంటే విడిగా కంగ్రాట్స్ కూడా తెలపరా? " అన్నాడు నవ్వుతూ.

"అబ్బే లేదండీ నాదంతా పొదుపులెండి"

"అయితే లతగారికి చెప్పిన థ్యాంక్సే మీకూనూ"

"అమ్మో, అసాధ్యులే పేపరు రాయడంలో నేకాదు మాటల్లోనూ సిద్ధహస్తులే" అంది నవ్వుతూ ఉష.

"థ్యాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్"

"పోనీలెండి. దీనికైనా ధన్యవాదాలు తెలుపుకున్నారు సంతోషం"

"దీనితో పెట్టుకుంటే అంతే మీరు. మళ్ళీ కలుస్తాం" అంటూ నవ్వేస్తూ ముందుకు కదిలింది లత.

'సరే'నంటూ వెళ్ళిపోయాడు రామచంద్ర.



హనుమంతరెడ్డి తలలో చెదిరిన కందిరీగల తుట్టె మాదిరి ఒకటే ఆలోచనలు, అవీ భయంకరమైన ఆలోచనలు.

ఒక్క నిమిషం సేపు కూడా నింపాదిగా ఒకచోట కూర్చోలేకపోతున్నాడు. అతన్ని స్థిమితంగా ఉంచలేక పోతున్న విషయం చిన్న కొత్తపల్లిలో ఆ చుట్టుపక్కల ఊర్లల్లో 'పోరుబాట' కమ్యూనిస్టు స్థావరమేర్పరచుకోబోతున్నారన్నది. ఆ విషయం గంటముందు ఊరినుంచి వచ్చిన ఈశ్వరిగాడు చెప్పాడు.

"ఊరికే మనుమని మాట కాదనలేక వ్యాపారాన్ని దృష్టిలో పెట్టుకుని ఊరికి దాదాపు ఇరవై కిలోమీటర్లు ఉన్న పట్నంలో ఉండాల్సి వచ్చింది. తనే ఆ ఊర్లోనే ఉండి ఉంటే ఆ పోరుబాటవాళ్ళు ఆ ఛాయలకైనా వచ్చి ఉండేవారా.

ఈ విషయం గురించి చర్చించాలంటే తన కొడుకూ, మనుమడూ ఉంటే బావుం డేది. నారపరెడ్డి హైదరాబాదుకు బస్సు పర్మిట్ల పనిమీద పోయినాడు. శ్రీధరరెడ్డి బెంగుళూరుకు చౌకగా బిల్డింగు ఏదో అమ్ముతున్నారంటే దాన్ని బేరసారాలు చూసుకోవడానికి పోయినాడు.

రాత్రికి కానీ రారు.

'ఒకసారి చిన్న కొత్తపల్లికి పోయి వస్తేనో... అంతే తనకేం భయమా' అను కున్నాడు. అంతలోనే,

ఫోన్ రింగయ్యింది.

"హలో..."

"నేను తాతా. శ్రీధరరెడ్డిని..."

అవతలినుంచీ మనుమని కంఠం వింటూనే హనుమంతరెడ్డికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది. వెయ్యి ఏనుగుల బలం పొందినట్లయింది.

"ఏరా... బిరీన వచ్చెయ్యి నాయినా... ఇక్కడ పరిస్థితులేమీ బాగాలేవప్పా" అంటున్న అతని గొంతలో కొంచెం వణుకు వచ్చింది.

"ఏం తాత ఏమయింది" ఆదుర్దాగా అడి గాడు శ్రీధర్ రెడ్డి.

విషయాన్ని వివరించాడు హనుమంత రెడ్డి.

"ఓస్... అంతేనా పోరుబాట కాకుంటే గీరుబాట కానిలే... మన కత్తికి ఎదురే లేదు. రాత్రిపూట దొంగలమాదిరి సంచ రించే వాళ్ళకి మనమేంది భయపడేది. పోలీసులూ, చట్టాలూ మనకు అనుకూ లంగా ఉంటాయి. ప్రభుత్వమే నిషేధించిన విప్లవ గ్రూపువాళ్ళది. మన ఊరి ఛాయల క్కూడా రాకుండా చేద్దాంలే తాతా. ఇక్కడ మనం అనుకున్నంత బాగాలేదు వ్యవ హారం. ఆ బిల్డింగు ఏమంత చెప్పుకొనేంత లేదు పైగా ముప్పయి లక్షలట. సాయంత్రా నికి వచ్చేస్తున్నా. అక్కడికి వచ్చినతరువాత మాట్లాడుకుందాం అన్నీ. మనల్ని చూసి అందరూ వణకాల. మనము ఎవరికీ భయ పడం... ఉంటా తాతా"

అంటూ మనుమడు మాట్లాడుతూ ఉంటే ఎంతో హాయిగా వుంది అతడికి.

'అవునూ... తనేమిటీ మరీ అంత డీలా పడిపోయాడు. ఎన్ని హత్యలూ, ఎన్నెన్ని దారుణాలు చేయించలేదు చూడలేదూ, ఎటువంటి సందర్భాలలో తను సింహంమా దిరి ప్రవర్తించలేదు. అట్లాంటి తను పోరు బాట కమ్యూనిస్టు వాళ్ళు అనేటప్పటికి ఎంత పిరికితనంగా ఆలోచించాడు. అదే విషయాన్ని తన మనుమడు ఎంత తేలిగ్గా తీసుకున్నాడు. తనకూ తన ఆలోచనలకూ ముసలితనం వచ్చేసిందా. మనుమడు ధైర్యాన్నిస్తే, దాంతో తను నింపాదిగా ఆలో చించే స్థాయికి చేరుకున్నాడా.

ఎంతయినా తన మనుమడు పులి!

ఇంత పెద్ద పట్నంలో వాడంటే అందరికీ హడలే.

వ్యాపారస్తులు రౌడీ మామూళ్ళు ఇస్తారు.

ఆఫీసర్లు వాడు టాక్సీ దిగుతుండగానే పనులన్నీ చేసిపెడతారు.

ఏమంటే ఆ సన్యాసికి ఆడపిచ్చి..

అది లేకుంటే వాడు మొగోడు ఎట్లయితా డులే.

హనుమంతరెడ్డి మనుమడిని తలుచుకు న్నప్పుడల్లా... ఎందుకో తన ప్రాయపురో జుల్లో చాలా పోగొట్టుకున్నట్లు అనిపిస్తూం టుంది. ఏదో కూలికి వచ్చే ఆ అలగాజాతి ఆడమనుషుల్ని నయానో భయానో లొంగ తీసుకునేవాడు. అంతే...

తన మనుమడు అలాకాదు. కోరిన పూవుపై వాలాలంటాడు. అందులో ఎటు వంటి మొహమాటాలూ ఉండవు. అవతలి వాడు అధికారి కావచ్చు మిత్రుడు కావచ్చు.

ఒక సంఘటన బాగా జ్ఞాపకం తనకి.

ఒక సివిల్ ఇంజనీరు కొత్తగా ట్రాన్స్‌ఫరై ఆ ఊరు వచ్చాడు.




ఏదో విందులో పరిచయమయ్యాడు శ్రీధర్‌కు. అప్పుడప్పుడు మందు పుచ్చుకుంటూ ఉండేవాళ్ళు. అలా మిత్రుడు కూడా అయ్యాడు. ఒకరోజు తన ఇంటిలోనే చాలా మందికి విందు ఏర్పాట్లు చేశాడు ఆ ఇంజనీరు. శ్రీధర్ కూడా వెళ్ళాడు. అప్పటికే మందువల్ల బాగా కిక్కు ఎక్కి ఉంది. ఆ వయసులో కూడా ఒక ఫుల్ బాటిల్ తాగినా చెదరడు, అడుగులూ తడబడవు. విందులో భోజనాలు అవుతున్నాయి. ఒక అందమైన అమ్మాయి వడ్డిస్తోంది. అంతే ఆమె చెయ్యి పట్టుకుని వదలలేదు.

"ఏయ్, ఆమె ఎవరనుకున్నావు ఇంజనీరు భార్య" అని చెప్పాడు శ్రీధర్ దగ్గరి మిత్రుడు.

"నోర్ముయ్, నాకు కావల్ల ఇది. ఎవరి భార్య అయినా నాకేం సంబంధంలేదు. నాకు లెక్కలేదు" అంటూనే జరజరా ఈడ్చుతున్నట్లు ఆమెను లాక్కొని పోతూ వుంటే, ఆమె ఏడ్చి మొత్తుకుంటూ ఉంది.

ఇంజనీరు అడ్డుపడ్డాడు.

జేబులోంచి కత్తితీసి "చంపేస్తా నా గురించి నీకి తెల్దు. దీన్ని వదలను. ఇప్పుడే చెప్తున్నా, పోలీసు కంప్లయింట్ చేసినా నాకు భయంలేదు" అంటూనే ఇంటిబయట ఉంచిన టాక్సీలోకి ఎక్కించుకుని డ్రైవర్ని డ్రైవ్ చేయమన్నాడు.

ఆ తర్వాతిరోజు ఇంజనీరు తనతో మొర పెట్టుకుంటే 'మూడురోజుల తర్వాత' వాడే పంపిస్తాడు పోవయ్యా వాడు ఏ లాడ్జిలో ఉన్నాడో, మరి ఎక్కడున్నాడో మాకు కూడా తెలీదు అని చెప్పి పంపించాడు. కరెక్టుగా మూడురోజులకి ఆమెని వదిలేశాడు. అంతే... వాడి పని అంతే. మూడురోజుల కంటే ఏ ఆడదానితోనూ ఉండలేడు. అవమానం భరించలేక ఇంజనీరు పెండ్లాం ఉరేసుకున్నది అని తనకు తెలిసి తన మనుమడి కోరిక తీర్చింది ఎక్కడన్నా చావనీలే అనుకున్నాడు. ఇలాంటివి అరుదుగా తనకు జ్ఞాపకముంటాయి. మామూలుగా నెలలో రెండు మూడు కేసులు ఇంటికొచ్చి తన కూతుర్నో, చెల్లెల్నో, పెళ్ళాన్నో జీపులో ఎత్తుకుపోయినాడని ఫిర్యాదులు వస్తుంటాయి. 'మూడురోజుల తర్వాత వస్తుందిలే' అని యథాలాపంగా చెప్పడం ఒక అలవాటుగా మారిపోయింది తనకి' ఆలోచనల్లో మునిగిపోయాడు హనుమంతరెడ్డి.

★ ★ ★

రాత్రికల్లా హనుమంతరెడ్డి కొడుకూ, మనుమడూ వచ్చేశారు. అర్థరాత్రి వరకూ ముగ్గురూ చర్చించారు.

కమ్యూనిస్టులు ముందుగా కాలుపెట్టే చోటు మాలమాదిగ గేర్లే కాబట్టి అక్కడ ఎట్టి పరిస్థితుల్లోనూ ఎవర్నీ రానియ్యకూడదు. ఈ విషయాన్ని పోలీసులకి తెలపడం మంచిది. కొత్తవాళ్ళు చిన్న కొత్తపల్లికి ఎవరు వచ్చినా అరెస్టు చేయమని ఉత్తర్వులు వేయిద్దాం.

ఇలా చర్చించారేకానీ వాళ్ళకే అంచనా లేదు ఎట్లా పోరుబాట వాళ్ళని ఎదుర్కోవాలో.

పూర్తిగా పోలీసులపై ఆధారపడడం అంత మంచిదికాదు. భవిష్యత్తులో తమ అరాచక పనులకి అడ్డంకిగా మారి ముందు కాళ్ళకి బంధాలుగా మారే ప్రమాదం ఉంది.

ఇది ఎవరికివాళ్ళే అనుకుని పైకి ఏమీ అనలేక వెళ్ళి పడుకున్నారు.

★ ★ ★

ఉదయమే కాఫీ తాగుతున్నాడు హనుమంతరెడ్డి పేపరు చూస్తూ.

"అయ్యా కొరియర్‌లో వచ్చింది. నిన్న వచ్చిండే దాన్ని ఈరోజు ఇచ్చినాడు" అంటూ పనిమనిషి అతని చేతిలో పెట్టిపోయింది.

కవరుమీద కొరియర్ ముద్ర వుంది. ఫ్రమ్ అడ్రస్‌లో సెక్రటరీ, పో.బా. కేంద్రం, పెన్నగిరి అని వుంది. పో.బా. అంటే

పోస్టుబాక్స్ అయివుంటుంది. అయితే దానికి కేంద్రం పెన్నగిరా? పెన్నగిరి అటవీ ప్రాంతంకదా.

కవర్ని చించాడు.

తెల్లకాగితంలో చిన్న ఉత్తరం రాసి ఉంది.

"చిన్న కొత్తపల్లి ఫ్యాక్షనిస్టు హనుమంత రెడ్డీ... ఈ పాటికి మా గురించి వినే ఉంటావు. ఇంక నీ పట్టుకొమ్మ అయిన చిన్న కొత్తపల్లిమీద ఆశ వదులుకో. అక్కడున్న దళితవాడలలో రైతు కూలి సంఘాలు ప్రారంభించినాము. దాని నాయకుల్ని కానీ ఆ సంఘసభ్యుల్ని కానీ ఏమైనా చేసినా, వారికి ఏమైనా అపకారం తలపెట్టినా సహించం. మీ ఊరికి రావచ్చు పోవచ్చు అయితే మరే దౌర్జన్యం, జులుంలతో కూడిన వ్యవహారాలు నడపకూడదు. అట్లా ఏదయినా జరిగిందా మీ ఉనికికే ప్రమాదం. ముఖ్యంగా నీ శవానికి తల ఉండదు"

- పెన్నగిరి దళం,
పోరుబాట"

కాళ్ళకింద భూమి కదిలినట్లయింది.

చిన్నకొత్తపల్లిని గడగడలాడించిన తనేనా ఇట్లయిపోతున్నది.

ఉదయమే చిన్నకొత్తపల్లినుంచి వచ్చిన శ్రీరాముల్ని రమ్మని పనిమనిషికి చెప్పాడు హనుమంతరెడ్డి.

ఆరోజు ఉదయమే వస్తానని రెండురోజుల కిందట చిన్నకొత్తపల్లికి పోయినాడు శ్రీరాములు. అతన్ని అడిగితే అక్కడి విషయాలు ముఖ్యంగా మాలమాదిగ గేరుల్లోని విషయాలు తెలుసుకోవచ్చునని హనుమంత రెడ్డి ఉద్దేశం.

'గొంచికాడా' అంటూ వినయంగా కొంచెం వంగి నిలుచున్నాడు శ్రీరాములు.

"ఎంత సేపయిందిరా వచ్చి?"

"ఇప్పుడే గొంచికాడా"

"సరే అక్కడి విశేషాలు ఏమున్నాయ్ వాయ్"

"గొంచికాడా, విశేషాలూ..." అంటూ ఎట్లాంటివి అన్నట్టు నెత్తి గీరుకుంటూ నిలబడ్డాడు.

"నీ తలకాయలో తెలివితేటలు ఉండాయా అని. విశేషాలు అంటే...ఊర్లో ఏం జరిగింది. మీ మాలగేర్లో ఏం సంగతులు. అట్లే మాదిగ్గేర్లో సంగతులు. ఇప్పుడేదో పోరుబాటా అదేందో బాటవాళ్ళు వచ్చినారంట నిజమేనా" అంటూ వాడికి ఫలానా వాటికి సంబంధించినవి వుంటే చెప్పు అని పాయింట్లు ఎత్తించాడు. తనకు పెద్ద ఇంట్రస్టు లేకుండానే అడుగుతున్నట్టు ఉండాలని.

"ఆ... అవును గొంచికాడా. రైతుకూలీ సంఘమని పోరుబాటోళ్ళు అని ఎవరో వచ్చి పెట్టినారు. దానికి మాయన్న రంగయ్యని నాయకుణ్ణి చేసినారు"

"ఈ విషయాలన్నీ నేను అడగకనే చెప్పే పనిలేదా తిక్క నాకొడకా! ఎక్కడో పరారీలో ఉండే మీ యన్న రంగయ్యగాడు రైతుకూలీ సంగం నాయకుడు అయినాడు అంటే అంతకంటే విశేషం వుందేరా! మామూలుగా వచ్చింటే వాన్ని నరికి పారేస్తామని తెలుసు మీయన్నకి. అందుకే ఆ పోరుబాట నాయాండ్లతో కల్సి ఊర్లేకి వచ్చినాడు"

తప్పుచేసినట్లు తల వంచుకుని గమ్మున ఉండిపోయాడు శ్రీరాములు.

"ఇంకనుంచీ నువ్వూ, ఈశ్వరిగాడూ, ఓబిశేసుగాడూ మన ఊరికి పోయివచ్చినారంటే అక్కడి సంగతులన్నీ మాకు తెలపల్ల ఏమీ"

"అట్లానే గొంచికాడా!"

"పో... పని చూసుకో, పో"

శ్రీరాములు వెళ్ళిపోయాడు.

★ ★ ★

రామచంద్ర యూనివర్సిటీ లైబ్రరీలో అంబేద్కర్ రాసిన కులనిర్మూలన పుస్తకం చదువుతున్నాడు. అప్పటికే అంబేద్కర్ పుస్తకాలు, పూలే పుస్తకాలు, మహాత్మాగాంధీ




ఆత్మకథ చదివేశాడతను. ఇప్పుడు ఈ పుస్తకం ఒక వ్యాసంకోసం చదవడం రెండో సారి.

"ఇక్కడున్నారా? " అన్న మాటలు విని తలెత్తి చూశాడు.

ఎదురుగా లత. మెల్లగా మాట్లాడమన్నట్లు సైగచేశాడు.

"క్లాసు వదలగానే ఎక్కడికి పోయినారో అని క్యాంటీన్ అంతా వెదికివచ్చాను" అంది మెల్లగా.

"నేను ఎక్కడికి పోతాను. ఈ లైబ్రరీలో పడి ఉంటాను. అవునూ నాకోసం ఎందుకు వెతికారు? "

"ఏవైనా డౌట్స్ ఉంటాయికదా ఈ మట్టి బుర్రకి"

"ఆత్మనిందకు పాల్పడకండి"

"అట్లా బయటికి వెళదామా. గొంతు తగ్గించి మాట్లాడలేక చచ్చిపోతున్నా. అవును ఏదన్నా ఇంట్రస్టింగ్ సబ్జెక్టు చదువుతున్నారా? " అంటూ అతని చేతిలోని పుస్తకంవైపు చూసింది.

పుస్తకంపేరు ఆమెకు కనపడేలా పట్టుకుని "ఇది ఇంతకుమునుపు చదివిందేలెండి. ఉండండి దీన్ని అరలో ఉంచి వస్తాను" అంటూ వెళ్ళి, నిమిషంలో వచ్చేశాడు.

ఇద్దరూ కలిసి బయటకి వెళ్ళారు.

"క్యాంటీన్‌కు పోదామా? టీ తాగినట్లూ ఉంటుంది, కొంచెంసేపు మాట్లాడినట్లూ ఉంటుంది" అన్నాడు రామచంద్ర.

"సరే"

క్యాంటీన్‌లో కూచున్నారు- టీకి ఆర్డరిచ్చారు.

"మీ ఫ్రెండ్ ఉషగారు రాలేదా? "

"అదీ వాళ్ళ ఊరికి పోయింది. రేపొస్తుంది"

మౌనంగా ఉండిపోయారిద్దరూ.

టీ వచ్చింది.

తాగుతూ ఉన్నారు.

"ఫ్యాక్షనిజం మీద మంచి వ్యాసం మీది" అంది లత.

"మళ్ళీ మెచ్చుకుంటున్నారు. రెండోసారి కంగ్రాట్స్ చెప్పేస్తారా కొంపదీసి" నవ్వుతూ అన్నాడు రామచంద్ర.

ఆ మాటకు తనూ నవ్వేస్తూ "అట్లేమీ చెప్పనులెండి. నాకో సందేహముందండి. అది తీర్చుకొనేకే ఇక్కడికొచ్చింది ఆక్చుయల్‌గా. ఇప్పుడు గ్రామాల్లో ఆధిపత్యం పోరు వల్లనే ఫ్యాక్షనిజం ఏర్పడుతుందని మీరు రాశారుకదా. ఇక్కడ నాకో సందేహం. అదేమిటంటే మన రాష్ట్రంలో అన్ని గ్రామాల్లోనూ పొలంగట్ల దగ్గర కొట్లాటలు జరుగుతుంటాయి. పెద్దరికం కోసం ఘర్షణలు, పంతాలూ, పట్టింపులు, భూమి తకరార్లు ఇట్లాంటి వాటితో దండిగానే హింసాయుతమైన ఘర్షణలు జరుగుతూ ఉంటాయి. అవునా... అయితే ఎక్కడాలేనిది ఒక్క రాయలసీమ జిల్లాలలో అంటే ఒక్క చిత్తూరును వదిలేస్తే కడప, కర్నూలు, ఇప్పుడిప్పుడే అనంతపురంలో అవి హత్యల రూపం, ప్రతిహత్యల రూపం ఎందుకు తీసుకుంటున్నాయి. ముఖ్యంగా సాయుధ ముఠాల రూపం ఎందుకు తీసుకుంటున్నాయి. ఇకపోతే రెండోది.

భూస్వామ్య పెత్తనమన్నది లేనిది ఎక్కడ? అది రాజకీయాలలోకి ఎక్కడ విస్తరించడం లేదూ? ప్రజాస్వామ్య విలువలు ఎక్కడ పతనం కాలేదూ? అంతటా అవి జరుగుతూనే ఉన్నాయి. ఇకపోతే అడ్డదారులు తొక్కి ఆస్తినీ, అధికారాన్నీ సంపాదించుకునే సంస్కృతి కూడా అంతటా ఉంది. మరి ఈ తుపాకులూ, బాంబులూ పట్టుకుని బెదిరించి భయపెట్టి బీభత్సాన్ని సృష్టించి అధికారాన్నీ, ఆస్తినీ, సంపాదించుకునే రాజకీయ సంస్కృతి బహుశా కడప, కర్నూలు, ఇప్పుడైతే అనంతపురం ఈ జిల్లాలోనే ప్రబలడానికి కారణమేమిటి? మొన్న మీ పేపరు చదివినప్పటినించీ నా తల్లో ఈ సందేహాలు తొలుస్తావున్నాయి"

"మంచి సందేహాలే. వీలయినంతవరకూ మీ సందేహాల్ని నివృత్తి చేసేందుకు ప్రయత్నిస్తాను" అంటూ అల్లా చుట్టూ ఓసారి కలయచూశాడు- విహంగ దృష్టితో.

కేంటిన్‌లో ఉన్న నాలుగు టేబుళ్ళలోనూ ఒక టేబులు దగ్గర ముగ్గురు అబ్బాయిలు క్రికెట్ విషయంలో పాకిస్తాన్ టీమ్‌ని దుమ్మెత్తిపోస్తున్నారు.

రామచంద్ర అలా విహంగ దృష్టితో చూడడం కేవలం విషయాన్ని ఎలా మొదలుపెట్టాలో నిర్ణయించుకోడానికే. లత మాత్రం అతని కళ్ళల్లోకి చూస్తూ వుంది.

"మీ మొదటి సందేహం తీర్చడం ఇంచుమించు అసాధ్యమేనండీ లతగారూ! పగ, కక్ష, పట్టింపు, మరొకరి పెద్దరికాన్ని సహించని తత్వం, దెబ్బకి దెబ్బ తీయనిదే నిద్రపోని ప్రతీకారం. ఇవన్నీ ఎందుకింత బలంగా ఉన్నాయని ఏ ఫాక్షనిస్టుని అడిగినా 'ఈ పెన్నసీళ్ల అట్లాటివి, ఈ నల్లరేగడి నేల అట్లాటిది' అని చెప్తారు. ఇట్లాటి జవాబులు అర్థరహితమైనవే. అయితే అంతకంటే అర్థవంతమైన జవాబు దొరకడం కష్టమేమో.

"ఇకపోతే మీ రెండో సందేహానికి జవాబుని రాయలసీమ చరిత్రలోనే వెతికే ప్రయత్నం చేయొచ్చు. ఒకవేళ పూర్తిగా జవాబు దొరకకపోయినా కొంచెం అవగాహన పెరుగుతుంది. పోతే మొదటి సందేహానికి కూడా ఈ జవాబునే వాడుకున్నా కొంత అర్థవంతంగా ఉంటుందేమో"

"చెప్పండి చెప్పండి" అంటూ ముందుకు వంగింది లత ఉత్సాహంగా.

"శ్రీ కృష్ణదేవరాయలు తన సైన్యాలతో తమిళదేశాన్ని జయించడానికి దక్షిణాదికి పోయినప్పుడు, ఆ సైన్యంలో భాగంగా పోయిన సాయుధ పెత్తందార్లు చాలా మంది తమిళదేశంలోని కొండలూ, అడవులూ ఉన్నచోట స్థిరపడిపోయినారు. తమతోపాటు తీసుకుని పోయిన జనంచేత భూమిని సాగుచేయించి చిన్న చిన్న సంస్థానాలు ఏర్పాటు చేసుకొని చుట్టూ ఉన్న తమిళ గ్రామాల్ని దోచుకుంటూ బతికేవారు. దీన్ని రాయలవారి సామంతులైన మధుర నాయకులు నమూనాగా తీసుకొని తమ రాజ్యంలో వ్యవస్థీకరించారు. కొన్ని గ్రామాల్ని కలిపి ఒక పాలెంగా గుర్తించారు. దాని అధిపతిని 'పాలయక్కారన్' అంటే మన భాషలో పాలెగాడు అంటూ పిలిచారు. వాళ్ళకి సైన్యాలు పోషించి పరిపాలించే అధికారిని కూడా కల్పించినారు. తమిళనాడులో పెద్ద సంఖ్యలో ఒకప్పుడు ఉండినది తెలుగు పాలెగాళ్ళే. ఆశ్చర్యమేమంటే ఇప్పుడు మన జిల్లాల్లో మాదిరి అక్కడ ఫ్యాక్షన్ సంస్కృతి కనిపించదు.

"ఇట్లా సమాజాన్ని దౌర్జన్యంగా శాసించే పాలెగాళ్ళు సాయుధులైన బలగాలతో ఒకప్పుడు రాయలసీమలో ఉండేవాళ్ళు. అంటే క్రీస్తుశకం 1800లో అన్నమాట. అప్పటి దత్తమండలాన్ని అంటే ఇప్పుడు కర్నాటకలో ఉన్న బళ్ళారి జిల్లాతో కలుపుకుని అనంతపురం, కడప, కర్నూలు అన్నమాట. వీటిని హైదరాబాదు నిజాం నవాబు బ్రిటిష్‌వారికి దత్తం చేసేనాటికి ఈ సీమలో 80 మంది పాలెగాళ్ళు ఉండేవాళ్ళు. ఈ దత్తమండలానికి మొదటి కలెక్టరుగా వచ్చినవాడు సర్ థామస్‌మన్రో. ఆయనకి ఈ పాలెగాళ్ళని లొంగదీసుకోవడం పెద్దపని అయిపోయింది. మొత్తం 80 మంది పాలెగాళ్లలో 22 మంది పాలెగాళ్ళు కర్నూలు జిల్లాకు చెందినవారు. వీళ్ళలో కొందర్ని జమిందార్లుగా గుర్తించారు. కొందర్ని అణచివేసి అధికార భ్రష్టుల్ని చేశారు. కొందరికి నష్టపరిహారంగా పింఛనులను ఇచ్చి వదిలించుకున్నారు. ఎక్కడికక్కడ స్థానిక పెత్తందారులు స్వంత సైన్యాలూ, సాయుధముఠాలూ పెట్టుకొని తమ శాసనాన్ని అమలు చేసే సంస్కృతి మటుకు మిగిలిపోయింది. అదే మన రాయలసీమ సంస్కృతిలో భాగ

మయింది. అందుకే తుపాకులతో, బాంబులతో బెదిరించి, భయపెట్టి బీభత్సాన్ని సృష్టించడాలు జరుగుతుంటాయి. దానికి ఆ వారసత్వమే కారణం. ఇదంతా పూర్తిగా నా స్వంత విశ్లేషణ కాదండీ లతగారూ! పౌర హక్కుల సంఘం వారి విశ్లేషణని నా మాటల్లో చెప్పినాను" అన్నాడు చిరునవ్వుతో.

"బాగుంది... మీ వివరణ"

లత గురించి రామచంద్ర అడిగినప్పుడు తన తండ్రి ఎట్లాంటి పరిస్థితులలో ఫ్యాక్షనిస్టు సిద్ధారెడ్డి దగ్గర చేరిందీ... ఆ తర్వాత ఏం జరిగిందీ చెప్పింది. ఆ అనుభవంతోనే ఆ పేపరు రాసినట్టుగా కూడా చెప్పింది.

లత హాస్టల్‌కి వెళ్ళాక ఫర్వాలేదు అబ్బాయి బాగానే ఉన్నాడు అనుకుంది.

★ ★ ★

రంగయ్య చిన్న కొత్తపల్లి తిరిగి చేరినప్పటినుండి కొంత జాగ్రత్తగానే ఉంటున్నాడు. హనుమంతరెడ్డి వర్గం మనుషుల విషయంలో మరీ జాగ్రత్త తీసుకుంటున్నాడు. బయటి ఊర్లకు దాదాపు పోవడమే లేదు. రాత్రిళ్లు మాత్రం పోరుబాటవాళ్లు వస్తేనే తప్ప ఇంట్లోంచి బయటికి అడుగు పెట్టడు.

గంగమ్మలో ఇప్పుడు ఎక్కడలేని తృప్తి చోటు చేసుకుని ఉంది. ఎంతయినా సొంత వూరు సొంత వూరే పరఊరు పరఊరే అనిపించింది.

పగటి సమయంలో మాలగేర్లోనూ, మాదిగ గేర్లోనూ గడుపుతూ ఉంటాడు రంగయ్య.

ఇంటిస్థలాలు మంజూరుకుగాను సంవత్సరం కిందట పెట్టుకున్న అర్జీలు పట్టుకుని ముందురోజు వచ్చాడు రెవిన్యూ ఇన్‌స్పెక్టరు. మాలల్లోనూ, మాదిగల్లోనూ ఇండ్లూ ఇండ్లస్థలాలు లేనివారి జాబితాలు తయారు చేసి రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకు ఇచ్చాడు.

'మాదిగ దండోరా నాయకులుగా ఉన్న పిల్లోల్లు ఎందుకో తన మాటల్ని, తనని సంశయిస్తున్నట్లుగా అనిపిస్తూ వుంది. ఇతను మాలవాడుకదా ఇతని మాట మేమెందుకు పట్టించుకోవడం అని నిర్లక్ష్యంగా ఉన్నట్లు అనిపిస్తూ వుంది' రంగయ్య అనుకుంటాడు.

ఆరోజు సాయంత్రం ఇంటిముందర కూచుని వుంటే కుంటితిమ్మప్ప వచ్చి 'రంగడూ! మాదిగ దండోరా పిల్లనాయాండ్లు చానా అతిపడుతున్నారురా! నేను ఇట్ల దారెంబడి వస్తుంటే ఏమంటున్నారో తెల్సునా... 'ఏమప్పా! కుంటితిమ్మప్పా! మీ ఆయప్ప రైతుకూలి సంఘం నాయకుడైతే మాలోళ్లకి ఇండ్లస్థలాలు ఎక్కువిస్తారా? మీ మాలోల్లలో ఇండ్లస్థలాల అర్హులయినవారు 50 మంది ఉంటే 70 ఇండ్ల స్థలాలు ఎట్లొస్తాయి. మా మాదిగవాళ్లు 80 మంది ఉంటే కేవలం 40 మందికి మాత్రమే ఇండ్ల స్థలాలు ఇస్తారా?, అంటున్నార్రా" అన్నాడు.

"వాళ్ళు అట్ల అనుకొనేకి కూడా ఆస్కారముందిలే మామా! మనవాళ్ళు ఇండ్ల స్థలాలకోసరం అర్జీలు ఇచ్చివుండేది సంవత్సరం కిందట. మాదిగవాళ్లలో అప్పట్లో అర్జీలు ఇచ్చినోళ్లు ఇప్పుడు లేరు. ఊరు విడిచి వెళ్ళిపోయినారు. బహుశా మళ్ళీ రావొచ్చు. మన మాలోల్లలో పెద్ద వలసపోలేదు. కొందరు పోయినా కాకతాళీయంగా విచారణ జరిగే సమయంలో తిరిగీ వచ్చినారు. ఆ విషయం రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకు కూడా తెలిపినాను. దానికి, ఆయన మేము విచారించేదానికి వచ్చినప్పుడు ఉండాలండీ! అదీ మాకు ముఖ్యం. గేర్లో లేనివాళ్ళ కథ మళ్ళా చూసుకుందాంలే, అన్నాడు మామా!" అన్నాడు రంగయ్య.

"అట్లనా! ఎందుకోరా వాళ్ళట్ల మాట్లాడతా ఉంటే నాకెట్లో అయిపోయె"

కుంటితిమ్మప్ప బీడీ తాగేసి వెళ్ళిపోయినాక కూడా అట్లే కూచుండిపోయినాడు. 'మాదిగ దండోరా నాయకుల పిల్లల మన

స్పర్థలు ఎక్కడివరకూ దారితీస్తుందో పోరుబాట నాయకులతో మాట్లాడల్ల" అనుకుంటూ మరో బీడీ అంటించుకున్నాడు.

★ ★ ★

ముల్లును ముల్లుతో తీయాలన్న సిద్ధాంతాన్ని ఎప్పుడూ నమ్ముతాడు హనుమంత రెడ్డి.

'పోరుబాట' సంస్థకు సరితూగగల కమ్యూనిస్టు పార్టీకోసం ఆరా తీశాడు.



వెదకపోయిన తీగ కాళ్ళకి తగిలినట్టు 'ఎదురుదాడి' గ్రూపు అనే సంస్థ 'పోరుబాట'కు పోటీగా నిలిచే సంస్థ అనీ దానికి అనంతపురం జిల్లాలోనూ శాఖ ఉందని తెలిసింది.

ఆ రెండు గ్రూపుల పోటీతత్వాన్ని రాయలసీమ ముఠాతత్వంలోకి మళ్ళించి ఎదురుదాడి గ్రూపును హనుమంతరెడ్డి తన వర్గానికి ముసుగు సంస్థగా ఉపయోగించుకోవచ్చు కూడా.

అందుకే 'ఎదురుదాడి' గ్రూపు నాయకుల్ని కలిశాడు. చర్చించాడు, ఒప్పించాడు హనుమంతరెడ్డి.

ఎదురుదాడి నాయకులకీ కావలసింది 'పోరుబాట'ని ఎదిరించడం దాని ఎత్తుగడ లని నీరు గార్చడం.

ఆ మరుసటిరోజే 'ఎదురుదాడి' నాయకులచేత చిన్న కొత్తపల్లిలో రైతు సంరక్షణ సంఘం ఏర్పాటుచేశారు. అందులో సభ్యులు వెనుకబడిన కులాలవాళ్ళు, అగ్రకులాలవాళ్ళు. ప్రెసిడెంటుగా ఈడిగ పక్కీరప్ప సెక్రటరిగా మాల శ్రీరాములు, సంయుక్త కార్యదర్శులుగా ఈశ్వరినీ, ఓబులేసులను చేశారు. దాంతో అన్ని కులాలవాళ్ళకి ప్రాతినిధ్యం కల్పించినట్టుగా ప్రకటించుకున్నారు.

అక్కడితో ఊరుకోకుండా చిన్న ఉపన్యాసం కూడా చేయాలనుకున్నాడు, 'ఎదురుదాడి' నాయకుడు నాగరాజు.

"ఇది రైతులందర్నీ సంరక్షించే సంఘం. మన ఈ సంఘానికి ఇతర సంఘాలకున్నట్లు స్వార్థం లేదు. ఇందులో రైతు అన్నవాడు మన సంఘంలో సభ్యుడు అయినా కాకున్నా అతన్ని సంరక్షించే బాధ్యత మనందరిదీ.

"...మన ఊరి గొంచికాడు అయిన హనుమంతరెడ్డికి శ్రోత్రియం భూములు 500 ఎకరాలున్నాయి. వాటిని భూములు లేని రైతులకు ఆ రెడ్డే పంచనున్నాడు. ఉన్నవారు లేనివారికి ఇవ్వడం సమ సమాజానికి శుభ సూచికంగా మేం భావిస్తున్నాం. ఇందులో వెనుకబడిన కులాలవాళ్ళు షెడ్యూలు కులాలవాళ్ళు ఉన్నారు. వాళ్ళందరికీ ఈ భూములు పంచుతాం"

తన శ్రోత్రియం భూమిని పోరుబాట వాళ్ళు పంచితే తనకు ఒక్క సెంటు కూడా దక్కదు. అని తెలుసు హనుమంతరెడ్డికి. అదే ఎదురుదాడి వాళ్ళతో పంచేటట్లు చేస్తే బినామీ పేర్లతో ఇంచు మించు భూమంతా చెక్కుచెదరకుండా ఉంటుందని తెలుసు. అందుకే నాగరాజుతో ఆ విషయాన్ని చెప్పించాడు.

★ ★ ★

మధ్యాహ్నామైంది.

శ్రీకృష్ణదేవరాయ యూనివర్సిటీ ఉమెన్స్ హాస్టల్ చేరుకుంది శ్రీప్రియ. తన సూట్‌కేసును గదిలో పారేసి మంచంమీద అడ్డంపడింది. అలుపు వచ్చి కళ్లు మూసుకుంది.

ఆ యూనివర్సిటీలోనే ఎమ్మెస్సీ పూర్తిచేసింది. ప్రస్తుతం ఆమె కెమిస్ట్రీలో ఎం.ఫిల్. చేస్తూవుంది.

నిత్యం నేరాల గొడవలతోనూ, ఫ్యాక్షన్‌కు సంబంధించిన వాతావరణంతోనూ ఉన్న తన ఇంటికంటే ఆ హాస్టలు గదే స్వర్గంలాగ ఉంటుంది.

ఎందుకో తెలీదుకాని తనకు ఆ వాతావరణం చిన్నతనం నుంచి పట్టలేదు.

"ఏయ్ ప్రియా! నీకు కొరియర్ వచ్చిందే, నేనే సంతకం చేసి తీసుకున్నాను" అంటూ వెడల్పాటి కవరు నొకదాన్ని తెచ్చి ఇచ్చింది రాధ. ఆమె కూడా ఎంఫిల్ చేస్తూ ఉంది.

బ్రౌన్‌రంగు కవరుమీద ఆకుపచ్చటి స్కెచ్ పెన్నుతో రాసిన తెలుగు అక్షరాల్ని చూడగానే కళ్ళు ఇంతలా చేసుకుని ఫ్రమ్ అడ్రసు చూసింది. 'కం...' అనంతపురం అని వుంది.

ఒక్కసారి కవర్ని సున్నితంగా ముద్దు పెట్టుకుని, టేబులు మీద వున్న పల్చటి చాకుతో దాన్ని తెరిచి అందులో ఉన్న గ్రీటింగ్‌ని బయటికి తీసింది. అది పుట్టిన రోజు శుభాకాంక్షలు తెలిపే గ్రీటింగ్ కార్డు. చక్కని రంగులలో అడవి, దాని మధ్యలో సెలయేరు పారుతూ వుంది. ఒడ్డున జింక పిల్ల నీళ్లు తాగుతూ వుంది. అంత చిన్న కార్డుమీద పెద్ద అద్భుతం సృష్టించడం ఒక్క 'కం'కి మాత్రమేనేమో చాతనయ్యేది.

'కం' అసలు పేరు 'అభిషేకం'. శ్రీప్రియకి అతనంటే పిచ్చి అభిమానం.

అసలు 'అభిషేకం' అంటే ఎవరో తెలీక ముందునించి 'కం' అనే ఆర్టిస్టుని ఆరాధించింది శ్రీప్రియ. వడ్డాది పాపయ్యా బొమ్మ

ల్లోని లాలిత్యం, అందం, అమెరికా ఆర్టిస్ట్ బోరిస్‌లోని నిండుతనం, గాంభీర్యం 'కం' బొమ్మలలో ఉంటుంది అని ఆమె ఉద్దేశం.

ఆరునెలల క్రితం ఒకరోజు తన గది ముందు ఒక పసుపురంగు కరపత్రం పడి వుంది. ఎందుకో అనుకోనివిధంగా ఆ కాగితాన్ని నిలబడే చదివింది. పెద్ద అక్షరాలతో 'కం' ఆర్ట్ ఎగ్జిబిషన్ అని వుంది హెడ్డింగు. వెంటనే చేతికి తీసుకుని చదివింది.

ఆరోజు సాయంత్రం ఐదు గంటలకు స్థానిక లలితకళా పరిషత్తులోని నాటక విద్యాలయంలో అని వుంది.

ఎగిరి గంతేసింది శ్రీప్రియ. తన అభిమాన చిత్రకారుడిని కలుసుకోబోతున్నదన్న మాట!

సాయంత్రానికల్లా ఆర్ట్ ఎగ్జిబిషన్ చేరుకుంది. అప్పటికే ప్రారంభపు మీటింగ్ అయిపోయి ఆర్ట్‌ని తిలకిస్తున్నారు ప్రేక్షకులు. పెయింటింగ్ గురించి వివరిస్తున్న ఒక అబ్బాయిని అడిగింది 'మీరేనా అభిషేకం?'

"నేను కాదు మేడం, అరగంట తర్వాత వస్తాడు. ఏదో కాస్త పని ఉందని బయటికి వెళ్ళాడు" అన్నాడు.

టేబుళ్ళమీదా, గోడలకు ట్రాన్సుపరెంట్ టేపుతో అతికించిన రకరకాలయిన ఆయిల్ పెయింట్స్, నీటిరంగులు, పెన్సిల్‌తో వేసిన బొమ్మలూ అన్నిరకాలూ ఉన్నాయి. ఒక్కో చిత్రం ఒక్కో అద్భుతంగా ఉంది.

ఏ బొమ్మ గీసినా తాదాత్మ్యం చెంది వేసినట్లు అనిపిస్తుంది. చిత్రకళను తపస్సులాగ ఏకాగ్రతతో చిత్రీకరిస్తే తప్పా అంత గాఢత చిత్రంలో కనిపించదు.

బాధల్ని, సంతోషాల్నీ, పండగల్ని, కరువునీ, అన్నిటిపట్లా చిత్రకారుడు ఎంత అంకితభావంతో వేశాడో అంత మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి- ఆ చిత్రాలు.

కరువు ప్రాంతంలో లేకలేక వచ్చిన వానలో తడుస్తున్న నాలుగేళ్ళ పల్లెటూరి పిల్ల అమాయకపు నవ్వులో ఆమె కళ్ళు చిక్కుకుని పోయాయి.

"మేడం! అభిషేకంగారు వచ్చారు. ఇందాకా మీరు అడిగారుకదా!" అన్నాడు ఇందాక తను అడిగిన కుర్రాడు.

"అవునండీ!" అంటూ అతనివైపు చూసింది.

"అదిగో... అతనే" చూపించాడతను. తెల్లటి జుబ్బా, పైజామాలో ఉన్న పాతికేళ్లున్న అబ్బాయి ఎవరితోనో మాట్లాడుతూ ఉన్నాడు. అతని దగ్గరకు చేరుకుంది శ్రీప్రియ.

అమాయకమైన మొహం, తుమ్మెదరెక్కల్లాంటి కనురెప్పలున్న కళ్లు, వత్తుగా ఉన్న జుట్టూవున్న తన అభిమాన కళాకారుడిని చూస్తూ ఉండిపోయింది.

అందాక మాట్లాడుతున్నవాళ్లు వెళ్ళిపోతూనే శ్రీప్రియవైపు చూశాడు అభిషేకం. 'మీ గురించి చెప్పండి' అన్నట్టు మృదువుగా చిరునవ్వు నవ్వాడు.

తనని పరిచయం చేసుకుంది శ్రీప్రియ. గత రెండేళ్లుగా 'కం' బొమ్మలంటే ఇష్టపడుతున్నట్టు చెప్పింది. అక్కడ ఉంచిన చిత్రపటాలూ చిత్రాలూ అన్నీ అద్భుతంగా ఉన్నాయంది.

అతని గురించి వివరాలు అడిగింది.

తన సొంత ఊరు ఉరవకొండ అనీ తను ఎం.ఏ, ఇంగ్లిష్ లిటరేచర్ చేసినట్టు చెప్పాడు. ప్రస్తుతం ఒక ప్రైవేటు కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేస్తున్నానన్నాడు.

"ఒక సందేహం... మీరు ఇంగ్లీషు లిట్ చేసినారు. మీ చిత్రాలకి చివర్లో తెలుగు లిపిలోనే 'కం' అని రాస్తుంటారు. ఎందుచేత?"

"ఇంగ్లీషులో రాస్తే కొందరే చదువుతారని"

అట్లా మొదలయింది ఇద్దరి పరిచయం. వాళ్ళ అభిరుచులూ, ఇష్టాఇష్టాలూ, వాళ్ళు ఇష్టపడే సినిమాలు, రచయితలూ అన్నీ



ఒకటే కావడంతో బాగా దగ్గరయ్యారు.

వారానికి ఒకటి రెండుసార్లు కలుసుకోవడం కాకుండా వారానికి ఏడురోజులూ కలుసుకునే పరిస్థితి ఏర్పడింది.

ఒకసారి అతని రూమ్‌కు వెళ్లినపుడు గోడకున్న క్రీస్తు బొమ్మని చూసి "ఇదేమిటీ జీసస్ బొమ్మ పెట్టుకున్నారు? " అంది.

"నేను క్రైస్తవుణ్ణి ప్రియగారు" అన్నాడు.

"మీరు క్రైస్తవులా? నాకట్లా అనిపించలేదే" అంది ఆశ్చర్యంగా.

"అవును దళిత క్రైస్తవుణ్ణి. కుల రీత్యా మాల వాడిని. ప్రస్తుతం మా నాన్న మతం క్రైస్తవం ,అయినందున నేనూ అదే మతస్థుడినయినాను. అందుకే నా పేరు అభిషేకం అని పెట్టారు నాన్న. అమ్మ మాత్రం మతం మారలేదు మాలగానే ఉంది"



అప్పుడే తన గురించీ తన కులం గురించీ చెప్పింది. పనిలోపనిగా తాతని ఫాక్షనిస్టుగా కూడా పరిచయం చేసింది శ్రీప్రియ.

హాస్టలుకు వెళ్లాక కూడా 'అభిషేకం' గురించి ఆలోచించింది. మాల, మాదిగల్ని తన ఇంట్లో ఎట్లా చూస్తారు? తను అక్కడి వాతావరణంలో పుట్టి పెరిగి ఒక మాల మనిషితో స్నేహాన్ని ఎందుకు కొనసాగిస్తున్నది. ఇప్పటికైనా మానుకుంటే మేలు అనుకుంది. ఒక అంటరాని వాడితో స్నేహమేమిటి. అభిషేకం అంటరానివాడా?

అతని బొమ్మలు ఇష్టపడ్డప్పుడు లేని అంటరానితనం, అతని పరిచయాన్ని మహాభాగ్యంగా భావించినపుడు లేని అంటరానితనం, అతనితో స్నేహంగా ఉండాలని మరింత దగ్గరవ్వాలని కోరుకున్నప్పుడు లేని అంటరానితనం ఇప్పుడు అడ్డువస్తోందా?

ఆ రాత్రంతా మథనపడి మథనపడి నిద్రపోయింది శ్రీప్రియ.

పొద్దున్నే మేల్కొనేటప్పటికి కొత్త శ్రీప్రియగా అయింది.

ఈ రోజునించీ అభిషేకం తనకు పూర్తి స్థాయి స్నేహితుడు. అతన్ని పిలవడం లోనూ, పిలిపించుకోవడంలోనూ బహువచనం అన్నది ఇంక ఉండదు.

ఆ సాయంత్రం అతన్ని లైబ్రరీ దగ్గర కలిసినపుడు చెప్పింది. నవ్వాడు. సరేనన్నట్టు తలూపాడు.

భావ సామీప్యమున్న వాళ్లిద్దరి స్నేహం ప్రేమగా మారేందుకు ఎక్కువ రోజులు పట్టలేదు.

రెండు రోజుల క్రితం హైదరాబాదుకు వెళ్లాడు అభిషేకం ఎవరిదో ప్రసిద్ధ చిత్రకారుడి ఆర్టు ఎగ్జిబిషన్ చూసేందుకు. మరో రెండు రోజుల తర్వాత కానీ రాడు. అయినా ఈ రోజు నా పుట్టినరోజు ఎలా గుర్తుకు వచ్చిందో అని ఆశ్చర్యపోయింది శ్రీప్రియ.

ఎంత అదృష్టం తనది!

ఒక మంచి ఆర్టిస్టు తనకి ప్రియుడు అవడం.. తన పుట్టినరోజు నాడు ఒక అద్భుతాన్ని కార్డుమీద సృష్టించి పంపడం.

ఉదయం పదిన్నరకల్లా రామమూర్తి ఆఫీసు చేరుకున్నాడు. తన ఛేంబర్స్‌లో ఒంటరిగా కూచున్నాడేకానీ తన ఆలోచనలన్నీ పరిపరి విధాలుగా పోతున్నాయి.





ఉన్నట్టుండి కుర్చీలోంచి లేచి టేబులు ముందున్న ఖాళీ స్థలంలో అటూ ఇటూ తిరుగుతాడు. మరికాసేపు అట్లా నిలబడి పోయి రెండు చేతులూ కందిపోయేటట్లు నలుపుకుంటాడు. అదయిపోతూనే కుర్చీలో కూచుని భృకుటిముడివేసి పైకప్పు వైపు చూస్తూ ఉంటాడు. ఆ పైకప్పులో ఏవేవో దృశ్యాలు కనబడతాయి. అన్నీ గతంలో జరిగిన సంఘటనలే. వాటిని తలుచుకుని మరికాసేపు దిగులుపడతాడు. ఆ తర్వాత గతంలోని సంఘటనలకి భవిష్యత్తులో జరుగబోవు సన్నివేశాలు ప్రత్యక్షమవు తాయి. వాటిని తలుచుకుని ఆందోళన పడ తాడు అతను.

రామమూర్తిని అంత ఆందోళనకు గురిచే స్తున్న అతని ఉద్యోగం పేరు ఏరియా ఆఫీ సరు. ఆ ఉద్యోగం స్టేట్ ఫైనాన్సింగ్ కార్పొ రేషన్‌కు సంబంధించినది.

ఆ ఉద్యోగానికున్న స్వభావం లబ్ధిదారు లకు అప్పులు మంజూరు చేయడం, ఇచ్చిన అప్పుల్ని వాయిదాల పద్ధతిపై వసూలు చేసుకోవడం. రెండేళ్లక్రితం రామమూర్తి ఈ ఊరికి రాకపూర్వం చాలా ఆనందంగానూ, ఎంతో ఉత్సాహంగానూ ఉద్యోగం చేసే వాడు. అతనికి వయసు 40 ఏళ్లు ఉన్నా ఆనందం, ఉత్సాహం అతని ఉద్యోగంలో పుష్కలంగా ఉండటంతో ముప్ఫయి అయి దేళ్ల మనిషిలా కనిపించేవాడు. ఈ రెండు నెలల్లో అతని వయసు మరో అయిదేళ్లు ఎక్కువయి నలభై అయిదేళ్ల మనిషిలా కని పిస్తున్నాడు.

జిల్లాలో ఎట్లాంటివారితోనైనా ఏమాత్రం ములాజా లేకుండా మాట్లాడి బాకీ వసూలు చేయగలడు, ఒక్క ఫ్యాక్షనిస్టుల నించి తప్ప.

ఒక్క హనుమంతరెడ్డే ఎస్.ఎఫ్.సి.కి ఒక కోటిన్నర రూపాయలు బాకీ ఉన్నాడు. ఏడాదిన్నర కిందట వాళ్ల లారీల, బస్సుల కొనుగోళ్లకుగానూ రుణాలు మంజూరు చేసే టప్పుడు తనే హనుమంతరెడ్డి జీతగాళ్ల పేరిట, మరి కొంతమంది మాదిగల పేరిట బినామీ పేర్లతో మంజూరు చేయించాడు. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు హైదరాబాదు హెడ్ ఆఫీసునుంచి ఫ్యాక్సు అందింది అరగంట క్రితం. అందులో సారాంశం ఇదీ "ఎక్కువ మొత్తం బకా యిలు పడ్డవాళ్ల దగ్గరనుంచి వెంటనే అరి యర్స్‌తోపాటూ వసూలు చేయవలసింది. ఆదేశాలు ఇస్తూ ఒకవేళ లబ్ధిదారులు బకాయి చెల్లించనిచో అప్పుద్వారా కొను క్కున్న వాహనాన్ని సీజ్ చేయమని" కూడా ఆదేశించారు. అది చూసినప్పటినుంచి వెన్నులో చలి మొదలైంది రామ్మూర్తికి.

★ ★ ★

హనుమంతరెడ్డి పర్సనల్ గది ముందున్న కుర్చీలో కూచుని ఉన్నాడు రామ్మూర్తి. పక్క కుర్చీలో అతని గుమాస్తా ఫైలు పట్టుకుని కూచుని ఉన్నాడు. అతనికి అటువైపు అటెండరు నిటారుగా నిలబడి ఉన్నాడు.

అప్పటికి అరగంట అయింది పర్సనల్ గదిలో హనుమంతరెడ్డి ఎవరితోనో మాట్లా డబట్టి.

రామ్మూర్తిలో సహనం నశిస్తూ ఉంది.

"సార్! మీరు రావల్లంట" అన్నాడు ఓ లావాటి మనిషి.

వెంటనే హనుమంతరెడ్డి గదిలోకి ముగ్గురూ ప్రవేశించారు.

నిర్లక్ష్యంగా చూస్తూ "ఏమప్పా! వచ్చి నావు" అడిగాడు హనుమంతరెడ్డి. వాళ్లెవ్వ రినీ చివరకు రామ్మూర్తిని కూడా కూచోమ నలేదు.

నానుస్తూనే వచ్చిన విషయాన్ని వివ రంగా వివరించాడు రామ్మూర్తి.

"సర్లేవయ్యా, ఇప్పుడు నా దెగ్గిర దుడ్లు లేవు. నేను కట్టనంటానయ్యా ఏంజేసుకుం టావు? "

"అట్లంటే ఎట్ల హనుమంతరెడ్డిగారూ!

మీరు కూడా మా మీద పైనించి ప్రెజర్ అట్లవుందని అర్థంచేసుకోవాలి" అన్నాడు రామ్మూర్తి.

"నేను అర్థం చేసుకోనయ్యా. నాకంత కర్మేం పట్టలేదు. నువ్వేం జేసుకుంటావో చేసుకోపో" అన్నాడు మరీ నిర్లక్ష్యంగా.

"డబ్బు కట్టకుంటే బండ్లన్నిటినీ సీజ్ చేయమని ఉత్తర్వులు వున్నాయి"

"ఏందేందీ. బండ్లని సీజ్ చేస్తారా! చెయ్యిమరి. నా బండ్లని సీజ్ చేస్తే నువ్వు మొగోనివేమరి. నువ్వుగానీ మీ పై ఆఫీసర్లు గానీ మీ జేబులో సొమ్ము తీసి నాకి య్యలా. ప్రజల సొమ్ము ఇచ్చినారు. నా ఇష్టమొచ్చినప్పుడు తీరుస్తా. ఎక్కువ మాట్లా డితే తీర్చను. ఇంక పోవచ్చు నాకి చానా పనుంది" అంటూ తరిమేసినంత పనిచే శాడు హనుమంతరెడ్డి.

★ ★ ★

జీపు హనుమంతరెడ్డి ఇంటిముందు నించి కదిలింది.

రామ్మూర్తి మొహంలో కోపం, నిస్పృహా యత గూడుకట్టుకుని ఉన్నాయి.

ఊరుదాటి, రోడ్డుమీద దూసుకుపోతోంది జీపు.

"మరి ఇట్లాంటి వాళ్లనించి డబ్బు ఎట్లా రికవరి అవుతుంది సార్!" అన్నాడు గుమాస్తా.

"నువ్వు ఎన్నాళ్లయింది ఇందులో చేరి? " అడిగాడు రామ్మూర్తి.

"రెండేండ్లు సార్"

"అందుకే అంత అమాయకంగా అడుగుతున్నావ్. మన గవర్నమెంటు లేదా మన డిపార్ట్‌మెంటు కూడా రైతుల్నీ, చిన్న వ్యాపారుస్థుల్నీ ముక్కుపిండి వసూలు చేస్తుంది. ఇట్లా కోట్ల రూపాయల్ని రుణాలుగా ఇచ్చాక కంతులు కట్టలేని వాళ్ల విషయమై అన్ని కోట్లు ఎట్లా ఇచ్చారు అని అసెంబ్లీలో అడుగుతారు. దానికి అప్పటికేవో దొంగసాకులు చెబుతారు మన పై ఆఫీసర్లు. చట్టంలోని లొసుగులలో కొన్ని ప్రత్యేక నిబంధనలు ఉంటాయి. వాటిమేరకు ఈ రుణాలు అన్నీ మాఫీ అయిపోతుంటాయి" అన్నాడు రామ్మూర్తి.

లత ఎదురుచూస్తూ వుంది రామచంద్ర కోసం లైబ్రరీ బయట. యూనివర్సిటీ కాంప స్‌లో విద్యార్థులు, అప్పుడపుడు ప్రొఫెసర్లూ అటూఇటూ తిరుగుతూ ఉన్నారు.

పొద్దున్న 8 గంటలప్పుడు తనున్న హాస్ట ల్‌కు ఫోన్ చేసి, "ఇంచుమించు 11 గంట లకి నేను కలుస్తాను. అక్కడ ఉండాలి నువ్వు. ఒక ముఖ్యమైన విషయం చర్చిం చాలి. ఉంటావుకదూ" అని చెప్పాడు.

అందుకే కాచుకుని ఉంది లత. తను చెప్పిన టైము 11 గంటలు ఇప్పుడేమో 11.30 గంటలవుతుంది. మాట చెప్పి మరి చిపోయినాడేమో అనుకుని రెండడుగులు వేసిందో లేదో..

"లతా" అన్న పిలుపు దూరంనించి... తిరిగి చూసింది.

కాంపౌండు ద్వారం దగ్గర్నించి చెయ్యి ఎత్తి కొంచెం ఉండు అన్నట్టు సైగచేస్తూ ఉన్నాడు. అతనితోపాటు నీలం పాంటూ, తెల్లచొక్కా వేసుకున్నతను ఎవరో వస్తు న్నాడు.

రామచంద్ర దగ్గరికొస్తూనే "ఇతని పేరు అభిషేకం. మంచి ఆర్టిస్టు. 'కం' పేరుతో బొమ్మలు వేస్తుంటాడు" అంటూ లతకి పరి చయం చేశాడు అభిషేకాన్ని.

"మీ ఇద్దరికీ ఎట్ల పరిచయమైంది? " అడి గింది లత.

"గోపీ అన్న పరిచయం చేసినాడు. అభి షేకంగారి ఆర్ట్ ఎగ్జిబిషన్ కూడా లలిత కళా పరిషత్తులో జరిగింది అప్పుడే. ఆరు నెలలపైనే అనుకుంటా. బొమ్మలు సూప ర్‌గా వేస్తారు. ఇంకో విషయం లతా! వీరి మతం క్రైస్తవం. కులం మీదే" అన్నాడు నవ్వుతూ.

"అదేం కులం? మీదే అనే కులం ఆంధ్ర




దేశంలో ఉందా?" అంది అమాయకంగా మొహం పెట్టి.

రామచంద్ర నెత్తిగీరుకుని, "అబ్బా చాల్లే లతా! నీకు అన్నీ జోకులే. మీవాళ్లే, వీళ్లూ మీ మాలవాళ్లే" అన్నాడు.

"మీరేమీ అనుకోకండి అభిషేకంగారూ! మా మధ్య గొడవలేకపోతే కలిసిన ఫీలింగే ఉండదు. అందుకే చిన్నదానికీ, పెద్దదానికీ ఇట్లా చిలిపి కొట్లాటలు పెట్టుకుంటూ ఉంటాం. మీకు తీరిక వున్నప్పుడు మీ బొమ్మలు రామచంద్రకి ఇచ్చి పంపండి. చూసి ఇస్తాను. లేదా మీ రూమ్ ఎక్కడుందో చెప్పండి నేనూ రామచంద్ర వచ్చేస్తాం"

"చాలా బాగుంటాయి వీరి బొమ్మలు. నువ్వయితే వదలవు ఆ బొమ్మల్ని" అన్నాడు రామచంద్ర.

"అయ్యో వారి మాటలు అతిశయోక్తులు లెండి. మామూలు బొమ్మలు నావి"

"నాకు కవిత్వమంటేనూ, బొమ్మలంటేనూ చాలా ఇష్టమండీ"

"ఆ రెండేకాదు అభిషేకంగారూ! ఫ్యాక్షనిజం సబ్జెక్టు కూడా ఇష్టమే. అదే మా ఇద్దర్నీ దగ్గర చేసింది"

"దగ్గర అంటే?" అడిగాడు అభిషేకం నవ్వుతూ.

"మేం ఒకర్నొకరు ఇష్టపడినాం సార్" అన్నాడు రామచంద్ర.

"ఎంత బాగా చెప్తున్నాడో చూడు. నేనేం ఇష్టపడలేదు. నేనేంది మాదిగ అబ్బాయిని ప్రేమించడమేంది ఛఛ" అంది చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ.

"ప్లీజ్ ప్లీజ్! ప్రేమించవా?"

"సారీ సారీ మా అమ్మానాయినా ఒప్పుకోరయ్యా. ఎవర్నయినా నీకు తగిన అమ్మాయిని చూసి ప్రేమించుకో"

వీరిద్దర్నీ చూసి నవ్వుతున్నాడు అభిషేకం.

"సరేకానీ సార్! కాఫీ తాగొద్దాం రండి" అన్నాడు రామచంద్ర.

"ఒద్దండీ రామచంద్రగారూ! శ్రీ వస్తుంది. ఇక్కడికే రమ్మన్నాను. తీరా ఆమె వచ్చేవేళకి మనం లేకుంటే ఎట్లా? ఆ వేపచెట్టు కింద నీడ ఉంది. అక్కడ కూచుందాం రండి" అన్నాడు అభిషేకం. ముగ్గురూ వెళ్లి చెట్టు నీడన కూచున్నారు.

"శ్రీ ఎవరండీ" అడిగింది లత.

"అభిషేకంగారి లవ్వు"

"ఆమె ఇప్పుడు వస్తారా"

"ఊఁ" అన్నట్టు తల ఆడించాడు అభిషేకం.

"ఆమె మీ కులం అమ్మాయా?" లత అడుగుతోంటే తల పట్టుకుని "ఇంక అయిపోయింది మీ కథ. ఇంటరాగేషన్ మొదలు. ఆ అమ్మాయిది మీ కులమా కాదా కాకుంటే ఏ కులం. ఆమె జన్మస్థలమేది? పల్లెనా పట్టణమా? ఆమె మీకు ఎట్లా పరిచయమైంది. పరిచయం ప్రేమగా ఎట్లా మారింది. అలా మారడానికి ఎన్ని సంవత్సరాలు, ఎన్ని నెలలు, ఎన్ని వారాలు, ఎన్ని గంటలు అయ్యుంటుంది?" అంటూ లత ఎంక్వయిరీని తమాషా చేశాడు రామచంద్ర.

"ఇంతకీ ఇన్ని అడిగినావ్ ఆ వివరాలన్నీ నీకంత అవసరమా?" అంది లత రివర్స్ గేర్లో అతన్ని అడ్డుకుంటూ.

"నాకు కాదమ్మా! నీకు అవసరమని నేనే నీ తరఫున అడిగా"

"సారీ నాకేం అవసరం లేదుగానీ నువ్వు ఊరికే అన్నిటికీ అడ్డురావద్దు"

నవ్వుతూనే శ్రీప్రియ గురించిన వివరాలు అన్నీ చెప్పాడు. వాళ్ల తాత పెద్ద ఫ్యాక్షనిస్టు కూడా అని చెప్పాడు రామచంద్ర.

"పేరు?"

"హనుమంతరెడ్డి"

"ఆ అమ్మాయి పేరు"

"శ్రీప్రియ" అన్నది లత.

"అయితే మీకు ముందుగానే తెలుసా"

# ఏరిన ముత్యాలు

* ఒక మంచి స్నేహితుణ్ణి పొందడానికి చాలా సంవత్సరాలు పడుతుంది. ఒక మంచి స్నేహితుణ్ణి పోగొట్టుకోవడానికి కేవలం ఒక గంట సమయం చాలు.

*- చైనా సామెత*

* అలవాట్లు మన చెప్పుచేతల్లో ఉండే సేవకులూ కాగలవు, మనల్ని లొంగ దీసుకుని మనపై పెత్తనం సాగించే యజమానులూ కాగలవు.

*- సిసిరో*

* మిడిమిడి జ్ఞానం గలవాడు గతం గురించి మాట్లాడతాడు, తెలివైనవాడు గడుస్తున్న కాలం గురించి మాట్లాడతాడు, తెలివి తక్కువవాడు భవిష్యత్తు గురించి చెప్తాడు.

*- మేడమ్ డ్యూ డిప్పార్జ్*

* గజరాజు పోరాడుతున్నప్పుడు నేలపై పచ్చగడ్డి బాధకు గురవుతుంది.

*- ఆఫ్రికన్ సూక్తి*

* జంతువులు ఆకలి వేసినప్పుడు మాత్రమే తిని, దాహం వేసినప్పుడు మాత్రమే నీళ్లు తాగుతాయి. మనిషిమాత్రం ఆకలి లేనప్పుడు కూడా తిండితిని, దాహం వెయ్యనప్పుడు సహితం నీళ్లు తాగుతాడు.

*- మార్క్ ట్వెయిన్*

* మన ఆధీనంలో ఉన్న అతి విలువైన వస్తువు వంటిది మన ఆరోగ్యం. తృప్తి చెందడం మనవద్ద సమృద్ధిగా ఉన్న ధనం వంటిది. నమ్మకం అనేది ఉత్తముడైన మిత్రునివంటిది.

*- ధమ్మపద*

* ప్రతి మనిషీ చంద్రునివంటివాడే. చంద్రునికి ఉన్న నలుపు మనుషులందరికీ ఉంటుంది. ఏ మనిషీ తన నలుపును మరొకడికి చూపడు.

*- మార్క్ ట్వెయిన్*

* నలుగురిలో ఆవులించడం మంచి పద్ధతి కాదు. అయినప్పటికీ తన అభిప్రాయాన్ని తెలియచేసే మంచి పద్ధతి కూడా అదే.

*- బాబ్‌హోప్*

* ఉదయాన్ని ప్రార్ధనతో ప్రారంభించడం ఓ తాళం చెవితో ఆ రోజును తెరవడం వంటిది. రాత్రిపూట ప్రార్ధన చెయ్యడం ఆ రోజును తాళం కప్పతో మూయడం వంటిది.

*- సిసిరో*

సేకరణ: **కొడిమెల శ్రీరామమూర్తి**

అడిగాడు అభిషేకం.

"తెలీదుగానీ ఇప్పుడయితే వాళ్లు పట్నం చేరుకున్నారు. ముందు మా ఇద్దరిదీ ఒక ఊరే, మా ఊరి గొంచికాళ్ల పిల్లేకదా! ఎప్పుడూ ఈ యూనివర్సిటీ కాంపస్‌లోనే చూస్తుంటాను. అయితే ఆమెతో మాట్లాడా లంటే ఎందుకో జంకేదాన్ని. పల్లెల్లో చూపించిన అంటరానితనం. అహంకారం ఇక్కడ చూపిస్తే నాక్కూడా ఇబ్బందిగా ఉంటుందని మాట్లాడించలేదు. అందు లోనూ ఆమె కూడా నన్ను గుర్తుపట్టి వుండదు" అంది లత.

"అట్లనా. శ్రీ ఎట్లాంటిదో మీకు ఒక్క నిమిషంలో తేలిపోతుంది"

"ఎట్ల? "

"అదిగో అక్కడ వస్తూ ఉంది" చూపిం చాడు అభిషేకం. చేతిలో చిన్న సూట్‌కే సుతో అక్కడికి చేరుకున్నది శ్రీప్రియ.

అభిషేకం రామచంద్రని పరిచయం చేశాక లతని చూపిస్తూ "శ్రీ ఈమె పేరు లత. ఇంతకుమునుపు ఎక్కడయినా చూశావా? " అడిగాడు.

లతకి దగ్గరగా కూచుంటూ "ఊహూ గుర్తులేదు. మీది ఈ యూనివర్సిటీ యేనా? " అంది శ్రీప్రియ.

అవును అన్నట్టు తల ఆడించింది చిరున వ్వుతో.

"అయితే చూసే ఉంటాను. నాకు కొంచెం జ్ఞాపకశక్తి తక్కువేలెండి. ఏమనుకో వద్దు"

"అబ్బే అదేం లేదులెండి"

"అదికాదు శ్రీ! నువ్వు చూసినట్టే జ్ఞాపకం లేదుకదా! అయితే ఈమె నిన్ను చిన్నప్పటి నించి చూసింది తెలుసా!" అన్నాడు అభి షేకం.

"అవునా నిజమా" అంది కళ్లు ఇంతలు చేస్తూ.

కళ్లు మూస్తూ అవునన్నట్టు తల పంకించి "మాదీ మీ ఊరే కాబట్టి చూశాను"

"మా ఊరా? "

"నాదీ సిన్నకొత్తపల్లేనమ్మా సిన్నగొంచి కత్తె" అంది పూర్తి పల్లెయాసలో

శ్రీప్రియ ఆశ్చర్యానికి అంతులేదు.

అప్పుడు చెప్పింది లత తను ఎవరయి నదీ.

లత నల్లప్పకి మేనకోడలని తెలిశాక మరింత పరిచయమున్నట్టు అనిపించింది.

అభిషేకానికి నల్లప్ప దేహ దారుఢ్యం గురించి చెప్పింది.

"నువ్వు అతని బొమ్మ గీసి వుంటే 'ఆంధ్ర బోరిస్' అయిపోయేవాడివి" అంది.

లత మురిసిపోయింది. తన దగ్గరి బంధువు గురించి ఒక గొప్పింటి అమ్మాయి పొగుడుతూ ఉంటే.

"పొద్దున ఫోను చేసినప్పుడు ఏదో ముఖ్యమైన విషయాన్ని చర్చించాలన్నావు. ఇక్కడికి రమ్మన్నావు. మళ్లీ చర్చిద్దామా రామూ" అంది లత.

"ఇప్పుడే కాదు లతా! శ్రీప్రియగారి కోసమే వెయిట్ చేసింది. మన చర్చ సఫలం కావాలంటే మనందరం ఒకరికొకరు అర్థం కావల్లకదా! అందుకే ఇంతసేపూ ఊరుకున్నది. ఇప్పుడు ఎవరెవరు ఏమిటే మిటో అన్నది అర్థమయిందా? మన ఇద్దరం ఈ మిత్రులిద్దరికీ పెండ్లి చేయడా నికి వీలయినంతవరకూ సహకారాన్ని అందించల్ల. అది ముఖ్యమైన అంశము"

"ఓకే! అట్లే చేద్దాంలే. మరి శ్రీప్రియ గారేమో సూట్‌కేసుతోపాటూ వచ్చినారు. ఊరికి పోతా ఉన్నారా! బస్సు ఎక్కించే ద్దామా"

"ఇదే మరి ఓవర్ యాక్షన్ అనేది" అన్నాడు రామచంద్ర లత నెత్తిపై సున్ని తంగా మొట్టికాయ వేసి నవ్వుతూ...

"ఓవర్‌కాని యాక్షన్ ఎట్లుంటుందో చెప్తే దాన్నే ఫాలో అవుతాం కదా!"

"అదికాదు లతా! నేను సూట్‌కేసుతో

ఊరికి పోవాలని కాదమ్మా వచ్చిందీ, ఇంకెప్పుడూ ఊరికి వెళ్లకూడదు అని" అంది శ్రీప్రియ.

"నిజంగా, నాకైతే ఏం అర్థం కాలా" అంది లత అయోమయంగా మొహం పెట్టి.

శ్రీప్రియకి అమెరికా సంబంధాన్ని తెచ్చాడు హనుమంతరెడ్డి. అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా ఉద్యోగం చేస్తున్నాడు అబ్బాయి. ఆ ఇంట్లో అందరికీ ఆ సంబంధం చాలా నచ్చింది. ఒక్క శ్రీప్రియకి తప్పా. తనకసలు ఇష్టంలేదంది శ్రీప్రియ.

తిట్లతో ముంచెత్తాడు తాత.

అగ్గి కురిపించాడు మాటల్లో తండ్రి. సూటిపోటీ మాటలతో పొడిచాడు అన్నయ్య. శ్రీప్రియ నిర్ణయం మరింతగట్టి పడింది. అభిషేకాన్ని ఏమైనాసరే చేసుకొంటుంది.

ఆ మాటే ఆవేశంతో అందరి ముందూ అంది.

అందరూ రెచ్చిపోయారు.

శ్రీధరరెడ్డి అక్కసు పట్టలేక శ్రీప్రియ చెంప ఛెళ్ళుమనిపించాడు.

"దీన్ని ఇల్లు కదలనీయొద్దు" అని శ్రీప్రియ తల్లికి చెప్పాడు.

హనుమంతరెడ్డికి రక్తపోటు మరీ పెరిగిపోవడంతో నారపరెడ్డి, శ్రీధరరెడ్డి అతన్ని బెంగళూరు తీసుకుపోయి మణిపాల్ ఆస్పత్రిలో చేర్పించారు.

తాత, తండ్రి, అన్న ఆ తర్వాతిరోజుకు కాని రారు కాబట్టి రాత్రంతా ప్లాను వేసుకుంది. అమాయకురాలైన తల్లికి టోపీ వేయడం పెద్ద కష్టం కాలేదు ఆమెకు.

అంతే-

సులభంగా తప్పించుకుని వచ్చేసింది అనంతపురానికి.

అలా జరిగిన విషయాన్ని అంతా లతకి వివరించింది శ్రీప్రియ. అయితే శ్రీప్రియకి వచ్చిన కష్టం మామూలుది కాదు అనుకుంది లత.

"లతా! ముందు శ్రీప్రియగారిని నీ గదికి తీసుకుపో" అన్నాడు రామచంద్ర.

★ ★ ★

ఆ మధ్యాహ్నం ఒంటిగంటకల్లా బెంగుళూరునుంచి పేటకి చేరుకున్నారు హనుమంతరెడ్డి, అతని కొడుకూ, మనమడూ.

'శ్రీప్రియ ఇంట్లోంచి వెళ్ళిపోయింది' అన్న విషయాన్ని శారదమ్మ చెప్పింది. హనుమంతరెడ్డిని అక్కడే ఉండమని నారపరెడ్డి, శ్రీధరరెడ్డి తలా ఒక టాక్సీలో బయల్దేరారు ప్రైవేటు సైన్యాలతో.

"రేయ్! ఆ పిల్లనేమనవద్దంట్రా. అది ఉత్త అమాయకంది. వాన్ని మాత్రం ముక్కలకింద నరకండ్రి" అన్నాడు కొడుకూ, మనుమల్ని ఉద్దేశించి.

ముందు యూనివర్సిటీ చేరుకున్నారు.

లత రాబోయే ప్రమాదాన్ని శంకించి దాదాపు కిటికీ వద్దే ఒక కన్నేసి ఉంది.

హాస్టల్ బయట ఏదో వాహనం వచ్చి నిలిచిన శబ్దమయితే కిటికీలోంచి తొంగిచూసింది. శ్రీధరరెడ్డి కిందనే నిలబడి వెతికిరమ్మని మనుషుల్ని పంపించాడు. శ్రీప్రియని బాత్‌రూంలోకి పంపించింది వెంటనే.

ఐదుగురు వచ్చారు. ఒక్కోరు ఒక్కోగదిని వాకబు చేస్తూ గాలిస్తున్నారు.

తలుపుమీద టక్‌టక్ శబ్దమైతే లత వెళ్ళి తీసింది.

"ఎవరు కావాలండీ? " అడిగింది సౌమ్యంగా లత.

"శ్రీప్రియమ్మ" అడిగాడు గడ్డపువాడు.

"ఆమె ఎవరో మాకు తెలీదు. ఏయ్ రాణీ సుజాతా ఎవరో శ్రీప్రియ అంటే ఏ హాస్టల్లో ఉన్నారో మీకు తెలుసా? " అడిగింది. తను అట్ల అడిగితే ఎదురుగా ఉండే హాస్టల్లో ఉండచ్చు. ఈ హాస్టల్లో మాత్రం ఎవరూ లేరని సమాధానమివ్వమని చెప్పింది. వాళ్ళు అట్లాగే సమాధానమిచ్చారు.




"ఊc సరేసరే" అనేసి వెళ్ళిపోయాడు గడ్డంవాడు.

★ ★ ★

ఆరోజంతా పిచ్చిపట్టినట్లు టాక్సీల్లో శ్రీప్రియ కోసం గాలించారు. ఫలితం లేక పోయింది. రాత్రికి నారపరెడ్డి, శ్రీధరరెడ్డిలు ఇల్లు చేరుకున్నారు.

అనంతపురం సబ్ రిజిష్ట్రారు ఆఫీసులో శ్రీప్రియ అన్న పేరుగల ఆడపిల్ల వస్తే పెళ్ళి రిజిస్టరు చేయకూడదని, ఒకవేళ చేస్తే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని హెచ్చ రించి వచ్చారు. పట్టణంలోని కొన్ని ముఖ్య మైన గుళ్ళల్లో పూజార్లని కూడా పెళ్ళి చేయ వద్దని బెదిరించివచ్చారు.

★ ★ ★

అభిషేకం, శ్రీప్రియల పెళ్ళి విషయాన్ని మాలమహానాడు, మాదిగదండోరా నాయ కులతో చర్చించాడు రామచంద్ర.

"ఒక మంచి పనికి మేమెప్పుడూ సిద్ధమే" అన్నారు రెండు ఉద్యమాల జిల్లా నాయ కులు.

ఆరోజు ఉదయమే.

రెండు సంఘాలవాళ్ళూ రెండు జీపుల్లో వధూవరులను పెన్నహోబిలం తీసుకు పోయి నరసింహస్వామి ఆలయంలో పెళ్ళి చేశారు.

అక్కడినుంచి నేరుగా అనంతపురం సూప రింటెండెంటు ఆఫ్ పోలీస్‌గారి ముందుకు తీసుకెళ్ళి 'వధూవరులకు రక్షణ కల్పించండి' అంటూ కోరుతూ విషయాన్ని వివరిం చారు.

ఎస్పీగారు శ్రీప్రియ తాత, తండ్రి, అన్న లని మధ్యాహ్ననికల్లా పిలిపించారు. ఎస్. పి.గారి ఎదురుగా కొత్త దంపతులు, వాళ్ళ పక్కన రామచంద్ర, లత, మాలమహానాడు, మాదిగ దండోరా నాయకులు ఇరవైమంది దాకా వున్నారు.

శ్రీప్రియను చూడగానే వాళ్ళ ముగ్గురి మొహాలు మలమల మాడిపోయాయి.

"ఎంతపని చేసినావే ముదనష్టండానా!" అంటూ హనుమంతరెడ్డి తిట్టడానికి మొద లుపెడుతుంటే...

"ఏమండీ! హనుమంతరెడ్డిగారు! మీరు పెద్దవాళ్ళు కొంచెం సహనం పాటించాలి. మీ అమ్మాయి మేజరు. తన అభీష్టంమేరకే వివాహం చేసుకున్నది. దాన్ని మీరు గుర్తిం చాలి" అన్నారు ఎస్.పి.

"మేం గుర్తించం!!" అంటూ గర్జించాడు శ్రీధరరెడ్డి.

"ఎవరయ్యా నువ్వు. నేనేదో పెద్దాయ నతో మాట్లాడుతూ ఉంటే ఏంది రంకె వేస్తున్నావు. ఇది ఎవరి ఆఫీసో తెలుసుకునే కేకలేస్తున్నావా? " అంటూ సీరియస్‌గా అరి చాడు ఎస్.పి.

"రేయ్ ఊరుకోరా... నీకు ఎక్కడ ఎట్ల మాట్లాడాలో తెలీదు. ఎస్.పీ.కాడ అట్ల అరి సినట్లు మాట్లాడకూడదు" అన్నాడు నారప రెడ్డి గొణుగుతున్నట్లు.

"సార్! ఎవర్ని అనీ ఏం లాభము. మా బంగారం మంచిదయివుంటే మేము ఇక్కడికి ఎందుకు వస్తాము. దేశంలో ఇంకె వరూ లేనట్ల ఒక అంటరానివానితో, మాల వానితో మూడు ముళ్ళు ఏయించుకుం దంటే... దాని రాత అట్లుందేమో" అన్నాడు నారపరెడ్డి తల ఎత్తకుండానే.

"దాని రాత ఏందిరా శాతగాని నాయాలా!" అన్నాడు హనుమంతరెడ్డి పళ్ళు నూరుతూ.

"ఇద్దో పెద్దాయనో... వాళ్ళిద్దర్లో ఎవరి కైనా హాని తల పెట్టినారా మేం ఇక్కడ మాలమహానాడు, మాదిగదండోరా సంఘాల వాళ్ళముండాము. రాష్ట్రవ్యాప్తంగా ఉద్యమం లేవదీస్తాము. మీ పునాదులను కదిలిస్తాము" అన్నాడు ఒక నాయకుడు.

వాళ్ళవైపు గుర్రుమంటూ చూశాడు హను మంతరెడ్డి.

"హనుమంతరెడ్డిగారూ! వధూవరులు ఇద్దరూ ఇష్టపడి పెళ్ళి చేసుకున్నారు. ఇంక

వాళ్ళమానాన్న వాళ్ళని బతకనీయండి. వాళ్ళ జీవితాలకు ముప్పు తెచ్చే ప్రయత్నం చేశారో మీ ఇంటిల్లిపాదినీ అరెస్టు చేసి జైల్లో కూచోపెడతా"

"నాయనా! అది సచ్చిపోయిందిరా నాయనా! దానికి దినాలు జేసుకుందాంరా" అంటూ తండ్రినీ, కొడుకుని బయటికి తీసుకువచ్చాడు నారపరెడ్డి.

మరునిమిషంలో వచ్చినదారినే వెళ్ళిపోయాయి రెండు టాక్సీలు.

ఎస్.పీ. బంగ్లానించి బయటకు వచ్చారు కొత్తదంపతులు. పక్కన రామచంద్ర, లతలు. వారివెంట దళితసంఘాల నాయకులు.



సాయంత్రం అవుతుంటే రాములగుడి ముందర మాలయువకులంతా ఒక చోట చేరి ఉన్నారు.

వాళ్ళు ఎదురు చూస్తున్నది రంగయ్య కోసం.

ఆరోజు పొద్దున పదిగంటల ప్రాంతంలో 'పోరుబాట' నాయకులు రంగయ్యతో ఒక ముఖ్యమైన విషయాన్ని చర్చించాల్సి ఉందని కబురు వచ్చింది. దాంతో అతనొక్కడే వెళ్ళాడు.

చర్చించాల్సింది ఎంతో ముఖ్యమైనదైతే కాని అట్లా పెన్నగిరి అడవిలోకి పిలవరు అన్నది అక్కడున్న అందరికీ తెలుసు.

ఆ ముఖ్యమైన విషయం మరేదో కాదనీ గత వారంరోజులుగా మాదిగ యువతలో పెల్లుబుకుతున్న అసంతృప్తేననీ, ఆ అసంతృప్తి కూడా ఇండ్లస్థలాల పంపకంలో మాలలు ఎక్కువ లబ్ధిపొందేలా చేయడం అనీ...

మరింత లోతుగా చూస్తే ఇవన్నీ కూడా అసలు కారణానికి సాకులు మాత్రమేనని తెలుస్తుంది. మరి అసలు కారణం ఏదంటే ఇన్నాళ్ళుగా మాలలు అన్నిట్లోనూ ముందుంటున్నారు. అట్లాంటివాళ్ళకే పోరుబాట కూడా ప్రాధాన్యత నివ్వడం మాదిగలకు అయిష్టంగా వుంది. అయితే పోరుబాట వాళ్ళు కూడా మాదిగలపోరు పడలేకే రంగయ్యని పిలిపించి ఉంటారనుకుంటున్నాను.

చీకటిపడుతుండగా రంగయ్య వచ్చాడు. అతని మొహం దీనాతిదీనంగా ఉంది. మెల్లగా కట్టమీద కూచున్నాడు. యువకులంతా అతని చుట్టూ చేరారు. కుంటి తిమ్మప్ప వచ్చి అక్కడ చేరాడు.

"పోరుబాటకీ, మనకీ ఇంక సంబంధం తెగిపోయినట్లేనర్రా! మన నాయకత్వాన్ని వాళ్ళు నమ్మడంలేదు. మాదిగోళ్ళకి ఇండ్లస్థలాల విషయంలో నేను వ్యవహరించిన తీరు పక్షపాత ధోరణిలో ఉన్నాదంటననీ మాదిగదండోరా నాయకులు ఆరోపిస్తా ఉండారు. నాకెందుకో నిజాన్ని రుజువు చేసుకొనేది కూడా అవివేకమే అనిపిచ్చింది" అన్నాడు రంగయ్య.

"అందుకని రాజీనామా చేస్తివారా? " అడిగాడు తిమ్మప్ప.

"మనకి ఆ అవకాశము ఇయ్యలేదు మామా! వాళ్ళే నన్ని ఆ సంఘంనించి తొలగించినట్లు తెలిపినారు"





"ఇది అన్యాయం మామా", "ఇది అన్నేలం సిన్నాయన!", "పెద్దయ్యా ఇది మాత్రం చానా అన్నేయం!" అంటూ అక్కడ చేరిన పిల్లలందరూ బాధతో అంటూ ఉన్నారు.

"చాలా అన్నేయంరా! ఇది మాత్తరం చానా చానా అన్నేయంరా! పోరుబాటవాళ్ళు కూడా అన్నేయం జేస్తే ఇంగ యాడికి పోతాంరా మనమూ" అన్నాడు కుంటితిమ్మప్ప.

"నువ్వు ఎప్పుడయితే రైతుసంఘంలో లేవో ఇంక మేము కూడా ఉండం. అక్కడ మాకేంపని!" అన్నారు యువకులంతా.

"నా నాయకత్వం ఇష్టం లేక తొలగించినారు. మీరు సభ్యులుగా ఉండడానికేమిరా" అన్నాడు రంగయ్య యువకులనుద్దేశించి.

"ఆఁ బాగా జెప్తావుగదరా! ఇది కేవలం రంగయ్యకీ, పోరుబాటవాళ్ళకీ జరిగిన యవ్వారం కాదు. ఈ పిల్లోల్లు నువ్వు అడివిలోకి పోయినప్పటినించి అంటానే ఉండారు. మాదిగవాళ్ళకి మనమంటే, మన నాయకత్వమంటే సరిపోదు. అందుకే రంగయ్యన్నని ఉండనియ్యరు నాయకునిగా అని. అదే జరిగింది. అట్లాదప్పుడు మేము అంతా దాంట్లో సభ్యులుగా ఎందుకుంటాము? వాళ్ళే ఏలుకోని ఆ సంగాన్ని" అన్నాడు కుంటితిమ్మప్ప. అతని మాటల్లో ఆవేశం పాలు ఎక్కడా కనిపించలేదు కానీ యువకుల నరాల్లో నెత్తురు ఆవేశం కక్కుతూనే ప్రవహిస్తోంది.

"దానికి పోటీగా మనమొక సంగం పెడదాం మామా!"

"అవునన్న రంగయ్యన్నా మనం ఏరేగా సంగం పెడదామి!"

"అవునవును సంగం పెడదామి. పెడదామి..."

అందరూ సంఘాన్ని పోటీగా పెట్టాలన్న ఉత్సాహంతోనూ, కుతూహలంగాను, ఆవేశంతోనూ ఉన్నారు.

రంగయ్య ఒక్కసారి యువకులందర్నీ చూసి జేబులోంచి బీడీకట్టతీసి బీడీ అంటించుకుని పొగని గాల్లోకి ఊదుతూ.

"సంగం పెడదామంటే పెడదామని ఉరుట్లాగుతా పెట్టేసివాడు ప్రెసిడెంటూ, వీడు సెక్రటరీ అని అనుకొంటే అక్కడికి అయిపోతుందేంరా. ఇదేం గుడుగునాట (కబడ్డీట) కాదు. గుక్క తీసుకోకుండా 'గుడు గుడు గుడు' అంటూ గీత దాటిపోయి అవతలోన్ని దెబ్బేసి ఎందరు పట్టుకున్నా గుక్కవిడసకుండా వచ్చి గీత అంటేసుకొనేకి. మనం సంఘం పెడుతా ఉండేది ఎవరికి పోటీగా అది ఆలోచించల్ల. మాదిగోళ్ళకి పోటీగానా కాదు కాదు... మన రాష్ట్రంలోనే విప్లవ కమ్యూనిస్టులుగా పేరుగాంచి గవర్నమెంటు వాళ్ళే నిషేదించిన పార్టీకి చెందిన పోరుబాటవాళ్లకి పోటీగా అనే విషయాన్ని మర్సిపోగూడదు"

"అట్లయితే వాళ్ళని జూసినప్పుడల్లా మనం వణుకుతా ఉండల్లా" అన్నాడు ఒక యువకుడు.

"ఇద్దో శంకరా! నేను జెప్పేది పూర్తిగా విని. ఆనెంక మాట్లాడప్పా! మీరు పిల్లోల్లు ఉడుకునెత్తురుకదా ఇట్లే మాట్లాడేది. నేను అంతేరా నా ప్రాయంలో ఇట్లే... పోరుబాటువాళ్ళు ఇట్ల చేస్తున్నారంటే ఎందుకు చేస్తున్నారు? అని ఆలోచించల్ల! అది వాళ్ళ ఎత్తుగడ అయితే మనం దానికి ఏం చేయాలి. ఎట్లా మనం ముందుకు అడుగు వేయాలి అని కొంచెం నిబ్బరంగా ఆలోచిద్దాం"

"ఒరే వాళ్ళనెందుకు చల్లబరచాలని జూస్తావు. ఇంత వయసొచ్చీ మీసాలూ, గడ్డాలూ, తలకాయీ అన్నీ నెరిసిపోతావుండాయి నాకే చాతకాలే. నేనే సంఘాన్ని పెట్టేస్తునా అనిపిస్తావుందే. ఇంక ఆ పిల్లోల్లు ఎట్లుంటార్రా!" అన్నాడు ఆరిపోయిన తుంటబీడీని అంటించుకొని కుంటితిమ్మప్ప.



"పిల్లోల్లల్లో నువ్వు ఇంకా పిల్లోనివి అయి పోతావు మామా! నువ్వు సుతారిచ్చుకో, వాళ్ళని సుతారించు" అంటూ అక్కడినించి లేచి వెళ్ళిపోయాడు రంగయ్య.

★ ★ ★

విషయం తెలుసుకున్నప్పటినుంచి గంగమ్మ బాధపడుతూనే ఉంది. "ఉన్నె ట్టుండి పోరుబాటోళ్ళూ నీకు ఇరోదులయిరి కదా. ఇల్లు రోశె ఇల్లాలు పడరోశె అనీ... ఎట్లజేస్తావేమడీ..." అంది.

"అదేనే నాకి తోచకోకుండా ఉండాది. మనం ఏ సంఘంలో ఉండామని ధైర్యంతో ఈ ఊర్లో అడుగు పెట్టినామో... ఏ పోరు బాటవాళ్ళు మన ఎనకల ఉండార్లే అని దొమ్మపొగరుతో ఉండామో, వాళ్ళే మనకి దూరమైపాయిరి. మనకి ఇంక రక్షణ ఏదే?" అంటున్న రంగయ్య గొంతులో నిస్స హాయత, దైన్యం గూడుకట్టుకుని ఉన్నాయి.

"నిజమే మనకే అన్నీ ఎందుకిట్ల అయితా ఉండాయి" అంది చేటలో బియ్యాన్ని ఏరుతూ. గంగమ్మ మనసు మనసులో లేదు.

సాయంత్రం మాదిగ గేర్లో రైతుసంగం నాయకుడిగా 'మాదిగ దండోరా' పిల్లోడు పెద్దన్నని ప్రెసిడెంటు చేసినట్లు వార్తలు అందాయి రంగయ్యకి, రాముల గుడిముం దర ఉన్న పిల్లలకీ.

ఇదంతా జరిగిన రెండురోజుల తర్వాత- చీకట్లు ముసురుకుంటున్నవేళ రంగయ్యా కొట్టంలోనే బీడీ తాగుతూ ఉన్నాడు.

అంతవరకూ బయట ఉన్న గంగమ్మ గబగబా లోపలికి వచ్చి గుసగుసగా "ఈడిగ పక్కీరప్ప అన్న వచ్చినాడు" అంది.

"ఏం రంగడూ! ఏంపా... బాగుండావు కదా" అంటూ తనే లోపలికి వచ్చాడు ఈడిగ పక్కీరప్ప.

పైకి లేస్తున్న రంగయ్య భుజంమీద చెయ్యేసి అట్లా కూచోబెడుతూ, తనూ కిందనే కూచున్నాడు.

"పక్కీరప్పన్నా! లెయ్యన్నా! చాపేస్తాను కింద" అన్నాడు రంగయ్య ఆ పక్కనే ఉన్న ఈతచాప చుట్టని అందుకుంటూ.

ఈడిగ పక్కీరప్ప హాయిగా గోడకి ఆను కుంటూ- "నీతోనే పనిఉండి వస్తినప్పా రంగయ్యా"

"నాతోనా అన్నా! నేను చెయ్యగలిగేది ఏమన్నా ఉంటే చేస్తాలేన్నా" అన్నాడుకాని తనకు ఏదన్నా ప్రమాదాన్ని తెచ్చిపెట్టే ప్రయత్నమేమన్నా జరుగుతున్నదా. రైతు సంఘంలో కనీసం సభ్యుడుగా కూడా లేనం దున ఏదైనా హెచ్చరికలు చేసేందుకు వచ్చి నాడా? ఇప్పుడు హనుమంతరెడ్డి వర్గం వాళ్ళు తనని కత్తికి ఒక కండగా నరికినా తను ఏం చేయగలడు.

"ఏమన్నా! మాట్లాడుకోకుండా ఊరికే అయిపోతివి" అన్నాడు రంగయ్య.

"అదే... ఎట్లా మొదలుపెట్టల్లా అని ఆలోచిస్తా ఉండా" అంటూ నవ్వుతూ చూసి నాడు పక్కీరప్ప.

"అట్లనా..." ఎందుకో కొంత ఆందోళనగా అనిపిస్తావుందతనికి.

"ఏంలేదు రంగడూ... నువ్వు రైతుసం ఘంనించీ బయటికి వచ్చినావని వింటిని... నిజమేనా!"

"ఔనన్నా!"

"మరింకేం... మన సంఘంలో చేరు. నీకిష్టమైతేనేనప్పా! ఇందులో బలవంత మేమీ లేదు. అయితే రైతు సంరక్షణ సంఘానికి అధ్యక్షునిగా నాకి కొంచెం స్వార్థం వుంది రంగడూ. ఏమంటే ఒక మంచి నాయకునిగా రైతు సంఘంలో ఉండేవాడు మా సంఘానికి వస్తే మాకు గౌరవం. అంతేకాదు నీతోపాటే మీ మాల గేర్లో వాళ్ళు చేరతారుకదా. మా సంఘం మరింత బలపడుతుంది"

"మంచిదేనన్నా మీ ప్రతిపాదన. మా వాళ్ళని విచారించుకోని రేపు ఏమాటా




చెప్తాను" అన్నాడు రంగయ్య. తను ఊహించనివి ఏవీ లేకపోవడం పైగా తమ సంఘంలో చేరేందుకు ఆహ్వానం పలకడంతో లోలోపల చాలా ఆనందించాడు రంగయ్య.

"ఈ విషయమే చెప్పిపోదామని వస్తిని. వస్తునా" అని చెప్పేసి అక్కడినించి వెళ్ళిపోయాడు పక్కీరప్ప.

అతన్ని సాగనంపుతూ అరుగుమీదకొచ్చి నిలబడ్డాడు రంగయ్య.

గంగమ్మ విషయాన్నంతా బయటినించే వింది "ఇంక ఆలోచించవద్దు. ముందుపోయి ఆ సంగంలో చేరు" అంది.

"చూద్దాం చూద్దాం" అన్నాడు నవ్వుతూ పెండ్లాన్ని చూస్తూ.

"ఏంది జూసేది సింతకాయ ఉల్లిగడ్డ. మనమిట్లే ఉంటే పోరుబాటోడు భయపడిస్తాడూ, ఎదురుదాడివాడూ భయపడిస్తాడు మల్ల"

"కరెక్టేరా! ఆ పాప జెప్తా ఉండేది" అన్నాడు కుంటి తిమ్మప్ప. ఎక్కడినించి ఊడిపడినాడా? అని ఆశ్చర్యంగా అతన్ని చూశాడు రంగయ్య.

"నువ్వు జెప్పు సిన్నాయనా! ఇప్పుడు యాపక్కా లేకుండాపోతే రేప్పొద్దున్న ఈ ఊరు విడసాల్సిందేకదా!"

"అదికాదే. సిద్ధారెడ్డి గొంచికాని కొడుకు సుధాకర్‌కి పోరుబాటవాళ్ళతో కలిసి ఉంటానని మాట ఇచ్చినాను. రేపొద్దున్న ఆయనకి నేను ఏమని సమాధానమిచ్చుకోవల్ల చెప్పు" అన్నాడు రంగయ్య.

"సుధాకరయ్యకి అన్నీ పోరుబాటోళ్ళే చెప్పుకుంటార్లే... మేమే అతన్ని తీసిపారేసినామని. నీకేల భయం? అంతగా అతనొచ్చి అడిగినప్పుడుకదా. నీ ప్రాణాలకే ఎసరుపెట్టే కత కనబడతావుండాది"

గంగమ్మ మాటలు సరయినవేననిపించేటట్టు కుంటితిమ్మప్ప మాటలున్నాయి. రంగయ్య రైతుసంరక్షణ సంఘంలో చేరాలని అప్పుడు నిర్ణయించుకున్నాడు.

ఆ విషయం రాముల గుడిముందర చెప్పినప్పుడు మాల యువకులంతా కేరింతలు కొట్టారు. విజిల్లు కొట్టారు. ఎగిరి గంతులు వేశారు.

కుంటి తిమ్మప్పతో "మాలగేర్లోని రంగయ్యా యువకులు కొందరూ మీ సంఘంలో చేరాలనుకున్నారు. రేపు చేరుతున్నారు" అని ఈడిగ పక్కీరప్పకి చెప్పి పంపిచ్చినారు.

★ ★ ★

మరుసటిరోజు ఉదయం పదిగంటల దాటాక మంచి ఘడియలు ఉన్నాయని ఈడిగ పక్కీరప్ప చెప్పడంతో రంగయ్య ఊరేగింపుగా వూర్లోకి వచ్చి ముందు హనుమంతరెడ్డి కాపురమున్న భవనంలోని వరండాలో రైతు సంరక్షణ సంఘంలో సభ్యుడిగా చేరాడు.

అక్కడ పాత నేస్తగానికోసం ఎదురుచూసిన ఈశ్వరి రంగయ్యకు దగ్గరగా వెళ్ళి సంతోషంగా అతని కళ్ళల్లోకి చూశాడు. ఎంతకాలం తర్వాత తిరిగి ఇద్దరూ ఒక్కచోట! ఈశ్వరి కళ్ళల్లో నీటిపొర. అది చూస్తూనే నేస్తగాడిని గుండెలకి హత్తుకున్నాడు రంగయ్య. చుట్టూ చూస్తున్నవాళ్ళు చప్పట్లు చరుస్తున్నారు.

"నువ్వు దయచూపిన జీవితంరా ఇది" అన్నాడు రంగయ్య.

"నేస్తగాడ్ని సంపుకుంటానేంరా" అన్నాడు ఈశ్వరి గొణుగుతూ.

★ ★ ★

లత ఉగాది పండగకు చిన్నకొత్తపల్లికి వచ్చింది.

ఈసారి ఎట్లయినా సరే రామచంద్ర విషయం తల్లిదండ్రులతో చెప్పేయాలనుకుంది.

మధ్యాహ్నం పండుగ భోజనాలు అయినాక రంగయ్య గోడకి ఆనుకుని వక్కాకు వేసుకుంటూ వున్నాడు.



గంగమ్మ ఏదో మాట్లాడుతూ, "నీకేం దిగుల్లేదులే... ఉంటే అట్లెందుకుంటావు" అంది.

"నాకేం దిగులే. లతమ్మ పెండ్లి ఒకటీ అయిపోనీ మీసంమీద పూలేసుకుని తిరుగుతాను" అన్నాడు రంగయ్య.

"ఎప్పుడు చేస్తావు మడి లతమ్మకి పెండ్లి"

"ఆయమ్మ ఎప్పుడు కావలంటే అప్పుడు ఏమ్మా లతమ్మా" అంటూ కూతురివైపు ప్రేమగా చూస్తూ వక్కాకు నోటితో ఎర్రగా నవ్వాడు.

ఇదే అదను అనుకుని "చేసుకుంటాను నాయనా! నాకిష్టమైనవాళ్ళనే" అంది.

"సరేనమ్మా... మన బంధువుల్లో ఎవుర్ని కోరితే వాళ్ళనే"

"కాదు నాయనా. రామచంద్ర అని మా క్లాసు పిల్లాడు ఉన్నాడు" అంటూ అతని కులంతోపాటు అంతా చెప్పింది.

మండిపడ్డాడు రంగయ్య.

"నా పాణం ఉన్నంతవరకూ నేను అట్లాటివి వినలేనమ్మా. కాదు, కూడదు చేసుకుం



టాను అంటివా నీ మొగం ఇంక ఎప్పుడూ నాకు చూపద్దు" అన్నాడు.

"మీ నాయన చెప్పిందే కరెక్టు. ఇంక ఎప్పుడూ అట్ల మాట్లాడొద్దు తల్లీ" అంది లత గడ్డం పట్టుకొని గంగమ్మ.

అంతా విన్నాక "నేను పెండ్లి అంటూ చేసుకుంటే రామచంద్రనే చేసుకుంటా లేదంటే పెండ్లే చేసుకోను" అంది.

"అది మేలు మాకు అపకీరితి తెచ్చేకంటే" అన్నాడు విసుగుతో రంగయ్య.

★ ★ ★

తెల్లవారుతోంది.

అప్పుడే మెలకువ వచ్చింది రంగయ్యకు. లేచి కూర్చున్నాడు. బీడీకట్ట, అగ్గిపెట్టెని అందుకున్నాడు.

గంగమ్మ పడుకున్నచోటువైపు చూశాడు. ఖాళీగా ఉంది. 'నీళ్ళకి పోయుంటుంది' అనుకున్నాడు.

తడిక తలుపు అడ్డమేసి ఉంది. తడికసందుల్లోంచి వెలుతురు కనిపిస్తోంది.

బీడీ అంటించుకున్నాడు.

మెల్లగా తాగుతూ ఉన్నాడు.

నిద్రమత్తు పూర్తిగా వదిలినట్టులేదు, ఆవలింతలు వస్తున్నాయి.

బయట 'అన్నా', 'మామా', 'చిన్నాన్నా' అంటూ మెల్లమీదుగా తలుపు దగ్గరకు పిల్లలు వచ్చిన శబ్దం తడిక సందుల్లోనుంచి రవ్వంత రవ్వంత కనిపిస్తూ ఉన్నారు.

"రంగయ్యన్నా..."

"రంగయ్య మామా..."

"రంగయ్య చిన్నాయనా..."

కలగాపులగంగా వరసలు పిలుస్తూ గొంతులు.

"ఏంరా... లోపలికి రాండిరా" అన్నాడు కొంచెం గట్టిగానే. తలుపు తీసుకుని వచ్చారు పదిమంది పిల్లలు.

"శ్రీరాములు మామని నాగులకట్టతాన నరికేసినారు మామా" అన్నాడొక యువకుడు.

నమ్మలేనట్లు చూస్తూ "ఎవుర్నిరా! మన శ్రీరాములన్నా? " అన్నాడు కంగారుగా.

"అవునన్నా! నీ తమ్ముడు శ్రీరాములే. తెల్లారే ఫస్టుబస్‌కు పేటకి పోవాలని నాగులకట్టకాడ ఉన్నాడంట. అప్పుడు ఎవరో నలుగురు మనుషులు ఆ అన్న చుట్టూరా కమ్ముకొన్నేరంట. ఆయన పారిపోయేకి జూసినాడంట. వేటకొడవలితో అక్కడికక్కడే కిందపడేసి నరికారంట" చెప్పాడు ఇంకొక యువకుడు.

"చుట్టూ ఉన్న ఇండ్లల్లో కసవులు ఊడుస్తున్న ఆడోళ్ళు, పొద్దున్నే నీళ్ళకి పోతున్న వాళ్ళు అందరూ చూసినారంట. మసక చీకటి ఉండేదాన్నింటి వాళ్ళ మొగాలు కనబడలేదంట" అంటూ మరొక యువకుడు చెప్పాడు.

జవసత్వాలు ఉడిగినట్టు అయిపోయిన రంగయ్య యాంత్రికంగా పైకి లేచాడు.

ప్లాస్టిక్ బిందెతో గంగమ్మ లోపలికి వచ్చింది.

విషయమంతా చెప్పారు ఆ పిల్లలు.

అట్లే బిందెను దించేసి తల పట్టుకొని "ఎంత పనయిందప్పా" అంటూ ఏడుస్తూ కూర్చుండిపోయింది.

"పదంద్రా పోదాం" అంటూ బయల్దేరాడు రంగయ్య. యువకులంతా వెంటపోతున్నారు.

★ ★ ★

శ్రీరాములు శవాన్ని పేట ఆస్పత్రిలో పోస్టుమార్టం జరిపించి తీసుకువచ్చేటప్పటికి రాత్రి ఏడుగంటలయింది.

శ్రీరాముల్ని హత్య చేసింది పోరుబాటవాళ్ళేనని ఊర్లో అందరి అభిప్రాయం. మాలగేర్లోనూ అదే అభిప్రాయం.

ఎందుకు అతన్ని హత్య చేయాల్సివచ్చింది అన్న ప్రశ్నకు ఒకటి పోరుబాటవాళ్ళంటే హడలు పుట్టించడం, రెండు మాదిగల ఇండ్లస్థలాలు విషయంలో ఎమ్మార్వో ఆఫీసులో విచారణ లేకుండానే ఊర్లో లేనివారికి

పట్టాలు మంజూరు అయినాయి కాబట్టి వాటిపై పునర్విచారణ జరిపేవరకూ ఎమ్మార్వో ఆఫీసుముందు ధర్నాచేస్తాను అని అంతకుముందు రోజు ప్రకటించడం... ఇక మూడు... ఆ ఊర్లో తిరుగులేని ఫ్యాక్షనిస్టు హనుమంతరెడ్డికి గట్టిగా వార్నింగ్ ఇవ్వడం. అంటే ఏదో కరపత్రంతో కాకుండా ఒక మరణంతో జవాబివ్వడం ద్వారా వాళ్ళగుండెల్లో గుబులు పుట్టించడం.

ఇవీ శ్రీరాములును దారుణంగా నరికివేయడానికి వెనుక ఉన్న విషయాలని ఈడిగ పక్కీరప్ప, రంగయ్యలు ఊహించారు.

పోరుబాటవాళ్ళు శ్రీరాములు హత్యతో దళితుల విషయంలో వేసిన తప్పటడుగుగా ఆ మరుసటిరోజు సాయంత్రం మాలగేర్లో జరిగిన సంతాపసభలో రంగయ్య అన్నాడు. ఇది ఇట్లా జరిగితే మాదిగలకూ, మాలలకూ దూరాలు పెరుగుతూనే ఉంటాయి. మరణదండనే ప్రతి విషయానికీ పరిష్కారమా? ఈ విషయాన్ని పోరుబాట గుర్తిస్తే బాగుంటుంది" అంటూ ఈడిగ పక్కీరప్ప ఆవేశంగా మాట్లాడాడు.

★ ★ ★

తర్వాతిరోజు అన్ని ప్రముఖ దినపత్రికల్లోని టాబ్లాయిడ్లలో... 'అక్రమ సంబంధమే శ్రీరాములును చంపింది' అన్న శీర్షిక ఉంది.

అందులో వివరాలు ఇలా ఉన్నాయి. 'క్రితంరోజు పెన్నగిరి అడవుల్లో పోరుబాటవారు పత్రికా విలేఖరుల సమావేశాన్ని ఏర్పాటుచేసి చిన్నకొత్తపల్లి ఫ్యాక్షనిస్టు అయిన హనుమంతరెడ్డి తొత్తుగా ఉంటున్న ఎదురుదాడివాళ్ళు శ్రీరాములును చంపింది మా వాళ్ళేనని ఆరోపణ చేశారు. ఆ ఆరోపణ పూర్తిగా అబద్ధమని మేం ఖండిస్తున్నాం.

శ్రీరాములుకు మాలవీధిలోనే వివాహేతర సంబంధం ఉంది. అందువల్ల మాల కులస్థులే ఒక పద్ధతి ప్రకారం నాగులకట్ట వద్ద హత్యచేశారు. కేవలం రాజకీయ లబ్ధి కోసం మాత్రమే మాపైన ఆ నేరం మోపారు. దళితులపట్ల మేం ఎప్పుడూ కఠినవైఖరి అవలంభించలేదు. ఇంకముందు అవలంభించబోమని కూడా విజ్ఞప్తి చేస్తున్నాం" అని ఉంది.

'పోరుబాట'వాళ్ళు ఏ ఉద్దేశ్యంతో పత్రికలలో ప్రకటించారోకానీ అది పూర్తిగా వ్యతిరేకదిశలో పనిచేసింది.

ఊరంతటికీ మాలగేరి అంతా తెలుసు, మాలగేరి వాళ్ళకి శ్రీరాములు ఎట్లాంటివాడో తెలుసు. అతనికి అక్రమ సంబంధాన్ని అంటకట్టడం అన్నది తప్పించుకోచూసే వ్యవహారమేనని తెలుసుకున్నారు.

ఊర్లోని జనాలకీ, మాలలకీ పోరుబాట మీద ద్వేషాన్ని కలుగచేసింది. అలాగే పోరుబాట ఆత్మగా ఉంటున్న మాదిగలపై పరోక్షంగా ద్వేషాన్ని రగిలించింది. ఇప్పుడు పోరుబాట, మాదిగలు వేర్వేరుగా కనిపించడంలేదు. ఒక్కటిగానే అనిపిస్తున్నారు.

★ ★ ★

జిల్లేడుకుంట శ్రోత్రియం భూములను రెండు, మూడు రోజులలో ఊరిలో భూములు లేనివాళ్ళకి పంచుతున్నట్టు ఈడిగ పక్కీరప్ప రైతు సంరక్షక సంఘం సమావేశంలో చెప్పాడు. పైగా మరొక్క మాట కూడా చెప్పాడు. అదేమిటంటే "ఇంతకుముందే ఆ శ్రోత్రియం భూములను శ్రోత్రియం దార్ల దగ్గరనుంచి కొని ఉంటే ఎన్ని ఎకరాలు కొని వుంటే అన్ని ఎకరాలను వారికే కేటాయించుతాము. ఇంకా మిగిలిన భూమిని ఏ రైతుకైతే భూమి ఉండదో అతనికి మూడు ఎకరాలవరకూ భూమి ఇస్తాం. ఇందులో భూమిలేనివాళ్ళందరూ మాకు సమానమే. కులాల ప్రసక్తే లేదు. వాళ్ళు మాల అయినా, మాదిగ అయినా మరింకేదైనా మాకు ఒక్కటే" అని కూడా చెప్పాడు.

అంతా బాగానే ఉంది కానీ 'ఈ కులాల ప్రసక్తి లేకుండా' అని అనడంలో మెలిక ఏదో ఉన్నట్టుగా అనిపించింది రంగయ్యకు. ఆమాటే పక్కీరప్పను అడిగాడు కూడా.

"నీ భూమీ, నీ తమ్ముని భూమీ ఎవరిది వాళ్ళకి వచ్చిందికద రంగడూ... తక్కిన వాళ్ళ జాబితాని ఎదురుదాడి నాయకులతో చర్చించినాక తయారుచేస్తాం. అప్పుడు చూపిస్తానులే" అన్నాడు పక్కీరప్ప.

తక్కినవాళ్ళ జాబితా అంటే బినామీ పేర్లతో హనుమంతరెడ్డికి చెందనున్న భూముల జాబితా అని ఊహించలేదు రంగయ్య. భూపరిమితి చట్టంనుంచి బయట పడ్డానికే ఈ వ్యవహారమంతా నడుపుతున్నాడు హనుమంతరెడ్డి.



తిరిగీ తనకి సంక్రమించనున్న మెత్తని నేలలో సగం తన తమ్ముని కుటుంబానికి ఇయ్యాలని నిర్ణయించాడు రంగయ్య.

పోరుబాటవాళ్ళు ఎంత అసాధ్యులంటే...

రాత్రి జరిగిన రైతు సంరక్షక సంఘం సమావేశంలో ప్రస్తావించిన శ్రోత్రియం భూముల విషయం ఎట్లా తెలుసుకున్నారోగానీ పొద్దున్నే నాగులకట్ట దగ్గర వాల్‌పోస్టరు ఒకటి అంటించారు. అందులో ఇలా ఉంది...

"జిల్లేడుకుంట శ్రోత్రియం భూములు పంచుతున్న 'ఎదురుదాడి'కి సవాల్!

నరరూప రాక్షసుడైన ఫ్యాక్షనిస్టు హనుమంతరెడ్డి జేబు సంస్థ అయిన 'ఎదురుదాడి' కమ్యూనిస్టుల్లారా! జిల్లేడుకుంట శ్రోత్రియం భూముల్ని రైతులకి పంచుతున్నారా? అవి ఎవరి అబ్బవి! జిల్లేడుకుంట శ్రోత్రియం దార్లయిన బ్రాహ్మణుల నోట్లో దుమ్ముకొట్టి దౌర్జన్యంగా ఆక్రమించుకొన్న భూములవి. భూ పరిమితి చట్టంలోని లొసుగుల్ని ఆసరాగా చేసుకొని బూటకపు పద్ధతిలో భూముల్ని ప్రజలకు పంచడం అన్నది పచ్చిమోసం. అందుకే ఆ పచ్చిమోసాన్ని ఎండగట్టి మేం ఎంతో న్యాయంగా అదే భూముల్ని పేదప్రజలకి రేపటిరోజున పంచుతున్నాం. చాతనైతే అడ్డుకోండి.

- పోరుబాట"

ఆ వాల్‌పోస్టర్ చదివిన రైతుల నోట్లో తడారిపోయింది.

ఎవరి భూమి వారికే వస్తుందనుకున్న సమయంలో ఇట్లా జరగడంతో మునుపు శ్రోత్రియం భూములు కొన్న రైతులు గుండెల్లో గుబులు రేగింది.

పక్కీరప్ప మాత్రం "మీరు ఊరికే అదిరిపోకండ్రా... సూద్దాం వాళ్ళేం చేస్తారో మనమేం ఒంటిగాళ్ళంకాదు. మనల్ని నడిపించేవాళ్ళు తక్కువోళ్ళుకాదు. మేధావులు... మహామేధావులు" అంటున్నాడు నిబ్బరంగా.

రంగయ్యకి పక్కీరప్పలో నచ్చేగుణం అదే.

ఎంతటి ప్రమాదం వస్తుందన్నా, మిన్ను విరిగి మీదపడుతుందన్నా చాలా తేలిగ్గా తీసుకుని తనూ ఆందోళనపడడు... ఎదుటి మనిషినీ పడనియ్యడు.

★ ★ ★




చిన్న కొత్తపల్లి గ్రామపొలం పొలిమేరలో పెద్ద షామియానా వేసి ఉంది. శ్రోత్రియం భూములు అక్కడినుంచే మొదలవుతాయి. మాదిగ గేరంతా అక్కడే ఉంది. జిల్లేడు కుంట మాజీ గ్రామ పరిపాలనాధికారి శివ రావు సహాయంతో మాదిగలు పోరుబాట నాయకులు చెప్పినట్టుగానే శ్రోత్రియం భూముల్ని ఒక్కొక్కరికీ మూడు ఎకరాల వంతున పంచారు. పంచినవాళ్ళకి సర్వే నంబరూ, భూమి హద్దులూ అన్నీ ఒక కాగితంపై రాసి ఇచ్చారు, భవిష్యత్తులో భూమి తకరార్లు ఏవీ తలెత్తకుండా.

ఆ కార్యక్రమాన్ని దూరంగా ఉండే రైతు సంరక్షణ సంఘం వాళ్ళూ, ఇంకా ఇతర రైతులూ చూస్తూ ఉన్నారు.

మాదిగల తర్వాత మాలలకు భూములు పంచుతున్నట్లు ప్రకటించారు. ఒక్కొక్కరి పేరునే పిలుస్తూ పిలిచినవారిని వెంటనే వాళ్ళ దగ్గరకు చేరుకోవాల్సిందిగా కోరారు. మాలలు ఎవ్వరూ కదలలేదు. వెనుకబడిన కులాలవాళ్ళని పిలిచారు పేరుపేరునా. వాళ్ళలోనూ ఎవరూ పోలేదు.

శ్రోత్రియం భూముల్ని ముందుగా కొన క్కున్న రంగయ్యలాంటి రైతులు తమ కళ్ళ ముందరే తమ భూముల్ని మాదిగలకి పంచేశారు.

అది ఏమాత్రం సహించలేకపోతున్నారు వాళ్ళు.

మాదిగలమీద ద్వేషం అంతకంతకూ రెట్టింపు అవుతోంది మాలల్లోనూ, వెనుకబ డిన కులాల్లోనూ, ఇతర కులాల్లోనూ.

★ ★ ★

మధ్యాహ్నంనుంచి మాలలూ, ఊర్లోని ఇతర కులాల రైతులూ గురవుతున్న నిరా శానిస్పృహలు చూసి పక్కీరప్ప తట్టుకోలేక పోయాడు.

సాయంత్రమవుతుండగా తన సంఘస భ్యుల్ని, ఇంకా ఇతర రైతుల్ని నాగులకట్ట దగ్గరకు రప్పించాడు.

పెద్దగుంపే తయారయింది అక్కడ.

అందర్నీ ఉద్దేశించి నాగులకట్ట ఎక్కి మాట్లాడాడు.

"ప్రియమైన రైతు సోదరులారా!

ఈరోజు 'పోరుబాట'వాళ్ళు భూమి పంపకం చేసినది కేవలం దౌర్జన్యంతోనే. ఇది మీ అందరికీ తెలుసు.

అక్రమానికి ఆయుష్షు తక్కువ. సక్ర మమే చిరకాలం ఉండేది. ఇది గుర్తుంచు కోండి మీరు.

శ్రోత్రియం భూముల్ని పంచడం అంటే ఏదో పోరంబోకు భూముల్ని పంచినట్టు పంచి, గవర్నమెంటు ఆఫీసర్లని బెదిరించి పట్టా కాగితాల్ని రాయించుకొనేదికాదు.

శ్రోత్రియం భూమి అంటే ఇది పోరం బోకు భూమికాదు. శివాయజమ భూమి కాదు. దీనికో చట్టం ఉంది. దానిపేరు ఎస్టేటు రద్దు చట్టం. దానిమేరకే బ్రాహ్మ ణుల శ్రోత్రియం భూముల్ని మన గొంచి కాడు హనుమంతరెడ్డిగారు కొన్నారు. అంతే గానీ దొంగదారినో, దొడ్డిదారినో పొందిన భూములు కావు. ఆ భూముల్ని ఎవరైనా ఆక్రమించినా చట్టం ఊరుకోదు. మనకు కోర్టులున్నాయి, న్యాయం ఉంది.

రేపే ఈ విషయమై కోర్టులో దాఖలు చేస్తాం అర్జీని. అనంతపురంలో ఈ చట్టాన్ని బాగా అవగాహన చేసుకున్న లాయరుతో వకాల్తా వేయిద్దాం. ఈ దెబ్బతో న్యాయం, ధర్మం ఎవరి వైపో తెలుస్తుంది.

సోదరులారా! మీరు ధైర్యంగా ఉండండి.

ఈరోజున ఎవరివోగా ఉన్న భూములు రేపటి రోజున మనవే అవుతాయి.

ఇది ముమ్మాటికీ సత్యం!

ఇంతటితో ముగిస్తున్నాను... నమ స్కారం"

ఆనందంతో చప్పట్లు కొట్టారంతా.

ఆ గుంపులో మాదిగ పిల్లలు కూడా ఉన్నారని తెలుసు పక్కీరప్పకి. అందుకే

కొంచెం ఆవేశంగా కూడా మాట్లాడాడు.

పక్కీరప్ప మాటల్లోని తీవ్రత, నమ్మకం అందరికీ ఎక్కడలేని ధైర్యాన్ని కలిగించింది.

★ ★ ★

తొలి కోడి కూసి ఉంటుందంతే...

రంగయ్యకి ఎందుకో మెలకువ వచ్చింది.

తనపక్కనే గంగమ్మ పడుకునే ఉంది.

కొట్టం బయట దబదబా ఎవరో పరుగెత్తుకు పోతున్న శబ్దాలు.

గబగబా వచ్చి తలుపు తీసి చూశాడు. చీకట్లో మాలగేర్లో ఎవరో పరుగెడుతున్నారు.

"ఏమైంది. ఎందుకు పరుగెత్తుతున్నారు" అనడిగాడు ఎవర్నో.

"రంగయ్య మామా! ఈడిగ పక్కీరప్పని ఎవరో నరికినారంట. చూసేకి పోతండాం" అని చెప్పేసి వెళ్ళిపోయాడు ఆ పిల్లాడు.

పక్కీరప్ప చావు వార్త వింటూనే వెన్నులో చలి పుట్టినట్లయి అక్కడనుంచి కదలలేక అలాగే కూర్చుండిపోయాడు. యాంత్రికంగానే బీడీ అంటించుకుని తాగుతూన్నాడు.

"ఏరా ఇంకా ఇక్కడే ఉండావు. పదరా నీ పాసుగాల... పాపం ఆ పక్కీరప్ప మామని నరికేసింటే... నేనప్పుడే ఊర్లేకి పోయింటి. నువ్వు ఆడ లేకపోతే నీ కోసరమే వస్తి" అంటూ కుంటి తిమ్మప్ప లేపాడు రంగయ్యని.

"ఎంతపనాయ మామా" అన్నాడు రంగయ్య బలహీన స్వరంతో

"ఇదంతా ఆ పోరుబాటవాళ్ళ పనే అని ఊర్లో అందరికీ తెలిసిపోయిందిరా. ఈడిగోళ్ళ పిల్లలూ, కురువోళ్ళ పిల్లలూ, మన సంగమోల్లూ అందరూ ఈ మాదిగ నాయాండ్లని దెబ్బతీస్తే పోరుబాటోళ్ళని దెబ్బతీసినట్లే అని అనుకుంటూ ఉండారురా" అన్నాడు తిమ్మప్ప. బీడీ అంటించుకుని పీలుస్తూ

"పదరా! పోదాం" అన్నాడు.

ఇద్దరూ ఊర్లోకి బయల్దేరారు.

★ ★ ★

తూర్పు ఇంకా ఎర్రబడలేదు.

చిన్నకొత్తపల్లి ఊరిలోంచి మాదిగగేరి వైపుకు ఏభైమంది పైగానే ఉన్న సమూహం కోపంతో వెర్రికేకలు పెడుతూ వడివడిగా అడుగులు వేస్తున్నారు. ఊపందుకుని ఉరుకులూ పరుగులూ పెడుతున్నారు.

అందరి చేతుల్లోనూ కొడవలో, కత్తో, గండ్రగొడ్డలో, ఈటో ఉన్నాయి. ఇవేవీ లేని వాళ్ళు బాణాకట్టె పట్టుకొని పరుగెడుతున్నారు. వాళ్ళలో అన్ని వయసులవాళ్ళూ, అన్నికులాలవాళ్ళూ ఉన్నారు.

మాదిగగేరి చేరుకోవడమే ఆలస్యం కేకలు పెట్టారు.

'బయటికి రాండ్రా' అని బూతులు తిడుతూ గద్దించారు.

మాదిగలు నిద్రమత్తులో వున్నారు. ఏం జరిగిందో తెలీదు. ఏం జరగనుందో తెలీదు. ఎవరికేకలో, ఎందుకు పెడుతున్నారో తెలీదు.

బయటికి వచ్చిన మాదిగల్ని చిక్కినవాళ్ళని చిక్కినట్లుగానే నరికేస్తున్నారు.

వాళ్ళ కొట్టాలకి నిప్పంటించారు. క్షణాల్లో ఎటుచూసినా ఏడుపులు, పెడబొబ్బలూ, గావుకేకలు... ఎగిసిపడుతున్న అగ్నిజ్వాలలు.

అలవికాని బీభత్సం...

అంతటా భీతావహ వాతావరణం...

అప్పుడప్పుడే తెల్లవారుతోంది.

దొరికినవారిని దొరికినట్టుగానే చంపారు.

చంపినవారిని కసితీరక ముక్కలుగా నరికారు.

అక్కడికీ కసితీరక మంటల్లోకి వేశారు ముక్కల్ని.

యువకుల్ని, స్త్రీలని, పిల్లల్ని, చివరికి వృద్ధులతో సైతం ఎవర్నీ వదిలిపెట్టకుండా...

కొన ఊపిరితో ఉన్న వారిని ఈడ్చి





మంటల్లోకి వేశారు.

మాదిగపేట ఆనవాళ్ళు లేకుండా పోవాలనే ప్రయత్నం...

ఇదిలా కొనసాగుతూ ఉంటే అక్కడి నుంచి తప్పించుకున్నవాళ్ళు చీకట్లో సత్తువ కొద్దీ దూరంగా పరిగెత్తారు.

పోరుబాటవాళ్ళకి శ్రోత్రియభూముల పంపకంలో సహకరించినందుకు మాజీ గ్రామపరిపాలనాధికారి శివరావు మాదిగ దండోరా ఆఫీసులో నిద్రపోతూ ఉంటే అతన్ని కూడా గొడ్డలితో నరికేశారు.

పొద్దు పుడుతుందనగా...

అప్పుడు వెళ్ళిపోయారు అక్కడినుంచి.

★ ★ ★

ప్రసార సాధనాలు శక్తిమంతమైనవి కావడంతో చిన్నకొత్తపల్లిలో జరిగిన మారణ కాండ ఆంధ్రదేశానికంతా ఉదయం పదిగంటలలోపే తెలిసిపోయింది.

కాలి బూడిదయిపోయిన మాదిగ గేరంతా రెవెన్యూ, పోలీసు, ఫైర్‌సర్వీస్ శాఖలవారి అధికార బృందాలతో నిండిపోయింది.

కాలిపోయిన ఓ శవాన్ని పరిశీలిస్తూ దాన్ని వివిధ కోణాల్లో ఫొటోలు తీస్తుంటే గమనిస్తూ వున్న ఎస్.పి.గారి వద్దకు ఒక సి.ఐ. వచ్చి సెల్యూట్‌చేసి "సార్! దళిత సంఘాలవాళ్ళూ, మానవహక్కుల, పౌరహక్కుల, ఓ.పి.డి.ఆర్. సంఘాలవాళ్ళూ ఇక్కడికి రావాలని బయల్దేరుతుంటే నాగులకట్ట దగ్గరే ఆపేశాను. పంపించమంటారా?" అనడిగాడు.

"ఇప్పుడే వద్దు ఇక్కడ మన పనికి ఆటంకం. మరి కాసేపటికి నేను చెబుతా. అప్పుడు పంపించు" అన్నాడు ఎస్.పి.

★ ★ ★

రంగయ్య పొద్దుటినుంచీ కనబడలేదు. ఏమయిపోయినాడో అర్థంకాలేదు ఆమెకి. కనబడ్డ ప్రతి మనిషినీ విచారించింది. "ఈడిగ పక్కీరప్ప పీనుగకాడిగి పోయేవరకూ నాతోనే ఉన్నాడమ్మా. ఆ తర్వాత ఉన్నట్టుండి గలాటా రేగి మాదిగ్గేరి దిక్కు కొందరు జనాలు పోయినారు. అప్పుడు రంగయ్య కూడా పోయినాడేమో. ఆనెంక నాకు కనబడలేదు" అని కుంటి తిమ్మప్ప వివరణ.

తెల్లవారుజామున జరిగిన సంఘటనలో ఎవరు ఎవర్ని నరికారో తెలీకుండా ఉంది. రంగయ్యని కూడా నరికి మంటల్లోకి వేశారేమో అని గంగమ్మ అనుమానం. లోపల్లో పలే ఏడ్చింది. ఊర్లోకి పోయి యూనివర్సిటీ హాస్టల్‌కి ఫోన్ చేసింది లతకోసం. విషయమంతా చెప్పింది.

లతకు ఏం చేయాలో పాలుపోలేదు. రామచంద్రను తోడుగా తీసుకుని చిన్నకొత్తపల్లి చేరుకుంది.

అక్కడి పరిస్థితి చూస్తే ఎవర్నీ నాగులకట్ట దాటి పోనిచ్చేటట్టులేరు. ఆఖరికి మాలగేర్లోకి కూడా...

దళిత సంఘాలూ, హక్కుల రక్షణ సంఘాలూ అన్నీ నాగులకట్టని ఆశ్రయించి ఉన్నాయి. అప్పటివరకూ వాళ్ళకి అందిన సమాచారాన్ని బట్టి అక్కడి పరిస్థితిమీద మంచి అవగాహన కనబడుతూ ఉంది వాళ్ళ మాటల్లో.

ఆయా సంఘాల ముఖ్య నాయకులతో నిజనిర్ధారణ కమిటీని ఏర్పాటుచేశారు.

కొంచెం ఆలస్యంగా రావడంవల్ల గోపి స్పాట్‌కు వెళ్ళలేకపోయాడు., దాంతో లత, రామచంద్రలని మాట్లాడించి, అక్కడే ఉన్న చిన్న గుండుమీద కూర్చుండిపోయాడు.

లత కళ్ళలో నీళ్ళు ముఖంలో దిగులూ చూసి రామచంద్ర చలించిపోతున్నాడు. "మీ నాయినకేమీ కాదులే లతా. అక్కడ చనిపోయింది అంతా మాదిగలే. మాలలు ఎవ్వరూ చనిపోలేదు. తక్కినవాళ్ళతో పాటూ పారిపోయి ఉంటాడులే. రాత్రికో రేపో వస్తాడు" అన్నాడు.



"మా నాయన కూనీ చేసి ఉండడు" అంది స్థిరంగా లత.

రామచంద్ర నవ్వుతూ, "ఎవరన్నారు అంతమాట. తక్కినవాళ్ళతో పాటు పోయి ఉంటాడు. పోలీసులు అనుమానిస్తారని. అంతే"

లత మనసు కొంచెం కుదుటపడింది.

'ఎంత తెలివిగల పిల్లమాదిరి కనబడుతుంది. భలే అమాయకపు పిల్ల' అనుకున్నాడు రామచంద్ర.

దగ్గరలో ఉన్న హోటల్నించి టీలు తెప్పించాడు గోపి వాళ్ళ ముగ్గురికీ.

లత టీ తాగుతూ, "మా ఊరు మరో కారంచేడు, మరో చుండూరు అయిపోయిందికదా గోపన్నా" అంది.

రామచంద్ర లతవైపే చూస్తున్నాడు.

గోపి టీ తాగాక సిగరెట్ వెలిగించుకుని పొగవ

దుల్తూ, "నువ్వు పొరబడుతున్నావమ్మా లతా. కారంచేడు, చుండూరులలో దళితులపైన జరిగిన దాడులకీ, ఇక్కడ జరిగిన సంఘటనకీ తేడా చాలా ఉందమ్మా



వాటిల్లో అటు ఫ్యాక్షనిస్టు పాత్రాలేదు, ఇటు కమ్యూనిస్టు పాత్రాలేదు. అప్పటికి 'మాదిగ దండోరా', 'మాల మహానాడు' ఉద్యమాలు లేవు. మాలల్ని మాదిగలనుండికానీ, మాదిగల్ని మాలలనుండికానీ వేరుచేసి ఇలా ఊరుమ్మడి దాడిలో, మూకుమ్మడి దాడిలో బలిచేసిన విషాద సంఘటనలు అప్పట్లో లేనేలేవు.

ఇప్పుడు అదనంగా తోడయిన ఈ మూడు పాయింట్లున్నాయే... ఏవి? ఈ ఫ్యాక్షనిజం, కమ్యూనిజం, ఎస్సీల ఏబీసీడీల వర్గీకరణ కోసం వచ్చిన స్పర్ధలు... వీటివల్లనే ఈ పొద్దు ఈ దాడి. ఆ కారంచేడు, చుండూరులలో జరిగినదానికంటే భిన్నంగా ఉంటుందనిపిస్తూ ఉంది. అంతేకాదమ్మా, ఆ ఊర్లదాడుల్లో కేవలం దళితుల ఆత్మగౌరవ పోరాటమే జరిగింది.

దళిత బహుజనులకు రాజ్యాధికారాన్ని చేజిక్కించుకునే దశలు 'దళితుల ఆత్మగౌరవం అంతంకాదిది ఆరంభం' అంటూ చాటింది. అయితేనమ్మా! ఇక్కడ దళితుల గౌరవ పోరాటాన్ని అణచివేయడమే కాకుండా అన్ని కులాలకి చెందిన శ్రామికుల్ని ఒకవర్గంగా వర్గపోరాటంలో ఐక్యం కానియ్యకుండా దెబ్బతీయడం జరిగింది.

ఇందులో ఫ్యాక్షనిస్టు హనుమంతరెడ్డి పాత్ర చెప్పుకోతగ్గది. అసలు ఈ ఎదురుదాడి దళం ఉందే దీన్ని ఆయన ఇక్కడ అదేపనిగా సృష్టించాడు. ఇప్పుడు అదే దళానికి అనుకూలంగా ఉండే సంఘసభ్యులే మాదిగగేరిని అతలాకుతలం చేసింది" అంటూ చెప్పుకుపోతూ ఉంటే,

"మరి పోరుబాటవాళ్ళ తప్పు ఏమీ లేదంటారా? "

"అయ్యయ్యో! పోరుబాటవాళ్ల జోక్యం లేకపోవడమేమిటి? మాదిగలకి ఇంటిస్థలాలు, శ్రోత్రియం భూముల పంపకం విషయాలలో అధిక న్యాయం చేయడమే ఇటు మాలవాళ్లకీ, అటు ఊరిలోని ఇతర కులాల వాళ్ళకీ అసూయ కలిగింది. శ్రోత్రియం భూముల విషయంలో మేం న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తాం అని అన్న రైతు సంరక్షక సంఘం ప్రెసిడెంటుని చంపేశారు.

"అయితే లతా! ఇక్కడ పోరుబాటవాళ్ళు ఒక పొరపాటు చేస్తున్నారమ్మా. అదేమిటంటే తెలంగాణా ప్రాంతానికీ, రాయలసీమ ప్రాంతానికీ గల స్వభావాన్ని అంచనా కట్టడంలో వైఫల్యం. రాయలసీమని అర్థం చేసుకోవాలంటే వర్గ విశ్లేషకుల విశ్లేషణలు సరిపోవు. దీని ముఠా సంస్కృతి గురించి కూడా అర్థం చేసుకోవాలి. మరొకటి రాయలసీమ హింస గురించి ప్రత్యేక జాగ్రత్త వహించాలి. సీమలో హింసాత్మక చర్య ఒకసారి మొదలయిందంటే అది ఒక వలయంగా మారి డజన్లకొద్దీ ప్రాణాల్ని తీస్తుంది. ఆ ప్రాణాలు కూడా ఎవరివి... పేద, దళిత, బహుజనులవే అని అంటాడు బాలగోపాల్ ఒక వ్యాసంలో"

ఈలోగా 'రావచ్చు' అంటూ ఒక పోలీసు కానిస్టేబుల్ వచ్చి చెప్పాడు.

అన్ని సంఘాలవాళ్ళూ గోపీ, లతా, రాములూ బయల్దేరారు.

దార్లోనే గంగమ్మ ఎదురయింది. లత, రామచంద్రలు ఆమెతో మాట్లాడ్డానికి ఉండిపోయారు.

"మీ నాయన ఏమయిపోయినాడో చూడే. ఎవరన్నా సంపేసినారేమోనే" అంది కీచుబోతున్న కంఠంతో.

"అట్లేమీ కాదులేమ్మా. రామూ అంటా ఉండాడమ్మా 'మీ నాయిన ఊర్లోవాళ్ళతో పాటి కలిసి ఎక్కడన్నా పోయి ఉంటాడు' అని" అంది లత.

"అంతే జరిగి వుంటుందమ్మా!" అన్నాడు రామచంద్ర గంగమ్మకి మరింత ధైర్యాన్ని వ్వాలని.

"అట్లేకానీ సామీ! నీనోటిమాట పుణ్యమా అని అట్లేజరిగితే నీనోట్లో చెక్కెర పోస్తా" అంటూనే గంగమ్మ బిడ్డని చూస్తా... "ఈ

పిల్లోడేనా నువ్వు ఆపొద్దు చెప్పిండె పిల్లోడు' అంది.

అవునన్నట్టు రామచంద్రని ఓరకంట చూస్తూ తల ఆడించింది. గంగమ్మ మళ్ళీ ఒకసారి రామచంద్రని చూసి బాగున్నాడన్నట్టు తల ఆడించింది.

అక్కడినుంచి అంతా మాదిగగేరి చేరుకున్నారు.

ఇంకా పొగలు రగులుతూనే ఉన్నాయి కాలిపోయిన కొట్టాల్లోంచి.

అక్కడే ఉన్న ఈశ్వరి గంగమ్మని చూస్తూనే దగ్గరకొచ్చాడు. అప్పటికే అతని కండ్లలో నీళ్ళు నిండుకుని ఉన్నాయి. "వదినా! నాకు దిక్కులేకుండా పొయెకదమ్మా. నా పెండ్లాం పాయె, నా బిడ్డ పోయె. అందర్నీ సంపేసినారమ్మో. చూసేకి పీనిగలు కూడా లేకుండా చేసిరి కదమ్మా" అంటూ బోరుమని ఏడ్చేశాడు.

"నిజమాన్నా! లేదులేన్నా... అట్లేమీ జరిగి ఉండదులే" అంది గంగమ్మ. అంతకుమించి ఏమి మాట్లాడాలో తెలియలేదు ఆమెకి.

"లేదమ్మా. నా బతుకు నాశనమైపోయె. రాత్రి ఈడ ఉండినా బాగుండు. పేటలో గొంచికానితాన వుంటిని. అదే చెడబాటు అయిపాయె. నా పెండ్లాం పిల్లల్తోపాటి నేనూ సస్తుంటి" అంటూ ఏడుస్తూ ఉన్నాడు ఈశ్వరి.

"నీ జతగాడు కూడా తెల్లారినుంచి కనబడలేదన్నా. ఎవురన్నా సంపేసి అగ్గిమంటల్లో ఏసినారో ఏమో" తనూ బోరుమంది గంగమ్మ.

★ ★ ★

పొద్దుగూకుతూ ఉంది.

అల్లంత దూరాన్నుంచి పడమటివైపు...

ఐదుగురి ఆకారాలు కదిలి వస్తున్నాయి.

వాళ్ళు ఎవరైందీ ఎవరూ గుర్తించలేకపోతున్నారు.

ఒకరికొకరు చెప్పుకోవడంలో...

అటు ప్రభుత్వ అధికార్లు, ఇటు నిజనిర్ధారణ కమిటీవాళ్ళూ, ఇంకా ఇతరులూ అందరికళ్ళూ అటే చూస్తున్నాయి.

వాళ్ళు దగ్గరకొచ్చాక తెలిసింది.

అందులో ఒకరు రంగయ్య.

తర్వాతి ఇద్దరూ ఈశ్వరి భార్య, బిడ్డ.

తక్కిన ఇద్దరూ ఏడు, ఎనిమిదేళ్ళ ఆడ, మగపిల్లలు.

అక్కడున్న అందరూ వాళ్ళమీద ప్రశ్నల వర్షం కురిపించారు.

రంగయ్య ఒక్కడే మాట్లాడాడు.

"నిజానికి నేను కూడా పక్కీరప్పన్న శవాన్ని చూసినాక అందరిమాదిరే ఆవేశపడిపోయాను. మాదిగ్గేరికి వచ్చినాను. అప్పటికే ముందుగా పోయినవాళ్ళు చేతికి అందినవాళ్ళని నరికేస్తా ఉండారు. అది ఎందుకో నాకు చాతకాలే. ఆ పక్కకొట్టమే మా ఈశ్వరిగానిది. వాని పెండ్లామూ, బిడ్డా... 'అన్నా కాపాడన్నా అంటా' నా కాడికి వచ్చిరి. ఏడుస్తా వుండారువాళ్ళు. ఆ కండ్ల నీళ్ళు నాకు చూసేకే కాలేదు. వాళ్ళని కాపాడేకి జాగ్రత్తగా తోలుకుపోతా ఉంటే... ఇగో ఈ పిల్లదీ, ఈ పిల్లనాయాలూ వాళ్ళనాయినా, అమ్మల్ని నరికేసింటే ఏడుస్తా ఉండారు. అసలే ఉగ్రులయి ఉండారు. ఊర్లోవాళ్ళూ, మాలోల్లూ. ఈ పిల్లోల్లని ఒక్కేటుకి నరికినా నరుకుతారని . ఇద్దర్నీ సంకలోకి ఏసుకొని, వీళ్ళిద్దర్నీ ఎంటపెట్టుకొని అట్టే ఉరికితి" అంటూ కండ్లల్లో నీళ్ళతో చూశాడు.

అక్కడే ఉన్న తన జతగాడయిన ఈశ్వరిని.

"రేయ్. రంగడూ నువ్వు దేవుడురా నాకి" అంటూనే రంగయ్యని గట్టిగా హత్తుకున్నాడు. ఈశ్వరి కళ్ళల్లో నీళ్ళు రాసాగాయి.

గంగమ్మ ఆనందంతో ఏడుస్తోంది.

తన తండ్రి చేసిన మంచి పనివల్ల

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి లతకి.

తండ్రి కుడిభుజాన్ని రెండుచేతులతో పట్టుకుని ఆత్మీయంగా తలని ఆనించింది లత.

దిక్కులేని పిల్లలిద్దరూ బిక్కుబిక్కుమంటుంటే... వాళ్ళ దీనమైన మొహాల్ని చూసింది గంగమ్మ. మోకాళ్ళమీద అట్లే కూచుని ఇద్దర్నీ దగ్గరికి తీసుకుని ప్రేమగా తల నిమిరింది.

రంగయ్య మురిపెంగా పెళ్లాన్ని చూస్తుంటే...

"ఈ పిల్లోల్లని" అంది గంగమ్మ.

రంగయ్యకి తెలుసు గంగమ్మ మనసు.

"వాళ్ళు దిక్కులే నోళ్ళు ఎట్లయితారే... మన మంతా ఉండాం కదా" అన్నాడు.

ఇదంతా చూస్తున్న రామచంద్ర తృప్తిగా అక్కడినుంచి కదిలి అటుగా పోయాడు.

ఈశ్వరి సంతోషంగా అక్కడే కిందకూచుని పెండ్లాన్ని, బిడ్డనీ చూసుకుంటూ ఏదో మాట్లాడ్తూ ఉన్నాడు.

గంగమ్మకూ రామచంద్ర విషయం చెప్పాలని ఉబలాటం...

"ఆ పిల్లోడు వచ్చినాడే... అదే మన లతమ్మ ఇట్ల పడుంటే ఆ పిల్లోడు" అంది.

ఎప్పటిమాదిరి అతన్లో అయిష్టం. అసహ్యం లేవు.

ఒక బీభత్సం జరిగాక ఎన్నో నష్టాలు. మరెన్నో కష్టాలు. ఒకటీ, అరా మంచి కూడా జరగవచ్చునేమో అన్నదానికి ఉదాహరణే రంగయ్య. అతన్లో ఇప్పుడు కొండంత మార్పు చోటుచేసుకుంది.

"ఎక్కడమ్మా నాకు కాబోయే అల్లుడు" అనడిగాడు లత తలని గోముగా సవరిస్తూ, లత మొహంలోకి చూసి.

టక్కున సిగ్గుపడి తల వంచుకుని "ఇక్కడే ఇంతసేపూ ఉన్నాడు నాయినా" అంటూ వెదికింది అతనికోసం.

తండ్రి చేయి పట్టుకుని వెతుకుతూ వెళుతోంది.



వేపమానికట్ట దగ్గర మారెమ్మ గుడిముందర ఎవరితోనో ఆవేశంగా, "మన దళితులపై అగ్రకులతత్వ దాడుల్ని నిరోధించాలంటే ఒకే ఒక్క శక్తి వుంది. అది ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనారిటీ శక్తి. అదొక్కటే ఇట్లాంటివాటిని ఎదుర్కొనగలదు. శాశ్వతంగా నిరోధించగలదు" అంటున్న రామచంద్రని చూపించింది లత.

'నీకు సరైన జోడీనేనమ్మా' అన్నట్టు తృప్తిగా కూతురి కళ్ళల్లోకి చూస్తూ తల ఆడించాడు.

పేటలో... హనుమంతరెడ్డి తన భవంతిలో ఈజీఛైర్‌లో కూచుని మద్యంసేవిస్తూ ఉన్నాడు. మాదిగగేరి నాశనం అయినందుకు పోరుబాటను దెబ్బతీసినందుకు తృప్తిగా ఉందతనికి.

అయితే... సుధాకర్ అనే మృత్యువు తననీ, తన కుటుంబాన్నీ కబళించేస్తుందని ఊహించలేదు. కథ మళ్ళీ ఇప్పుడే మొదలయిందని తెలీదు పాపం.






# చతుర ప్రపంచం

## వికలాంగులకు వరప్రసాదం

కర్నాటకలో అంగవైకల్యంతో బాధపడే పిల్లలు వున్న ఒక కేంద్రానికి బి.ఎన్. కిషోర్‌కుమార్ అనే వ్యక్తి వెళ్ళాడు. ఆయన్ను చూడగానే పిల్లలంతా ఆనందంతో చప్పట్లు కొట్టారు, ఆదరంగా ఆహ్వానించారు.




అంతకు కొద్ది రోజులముందే ఆ పిల్లలు, తమ కేంద్ర నిర్వాహకులు చెప్పగా విన్నారు... కిషోర్‌కుమార్ తమవంటి బాధితులకోసం ఓ రోబోట్ తయారుచేశాడనీ, అది అంగవైకల్యంతో వున్నవారికి ఆహారం తినిపించి, పానీయం తాగించి, ఎప్పటికప్పుడు వారికి తగిన జాగ్రత్తలు సూచిస్తుందనీ, అంతే కాక ఆ రోబోట్ తమకోసం టీవీ స్విచ్‌వేసి కాలక్షేపాన్ని అందిస్తుందని కూడా ఆ పిల్లలు విన్నారు.

కిషోర్ అనేకమంది అంగవైకల్యం గలవారి బాధలు చూసి చలించాడు. వారు తమ శక్తిని కూడగట్టుకుని ఆటలు ఆడడం చూసి అతనికి ఆనందం కలిగేది.

"వీరు వైకల్యంతో వున్నప్పటికీ తెలివైన వారు" అన్నాడు కిషోర్.

ఆయన బెంగుళూర్‌లోని 'రోబో ఇంటర్నేషనల్'ను నిర్వహిస్తున్నాడు. తన రోబోటిక్స్ ద్వారా వికలాంగులకు తోడ్పాటు ఇవ్వాలనే దృఢసంకల్పం అతనికి కలిగింది. కిషోర్ తను ఊహించిన రోబోట్ రూపకల్పన చెయ్యడంకోసం 3 సం.లు విశేష కృషి సలిపాడు. ఇళ్ళల్లో వుంటున్న వికలాంగులైన బాలలను, స్కూళ్ళలో చదువుతున్నవారినీ, వారితీరునూ క్షుణ్ణంగా పరిశీలించాడు. రోబోట్‌లను గురించి చాలాకాలం అధ్యయనం చేశాడు. చివరికి అతను కన్న కల సాకారమైంది. రోబోట్ ఉద్భవించింది.



అది చూపులకు మనిషివలే ఉంటుంది. బరువు 32 కేజీలు. చక్రాలపై కదుల్తుంది. దానికి ఓ శిరస్సు, పైన ఓ యాంటినా అమర్చబడ్డాయి. రిమోట్ కంట్రోల్ ద్వారా ఆదేశాలు అందుకొంటుంది. ఇన్‌ఫ్రా రెడ్ రేస్‌తో కూడిన కళ్ళు దానికి అమర్చబడ్డాయి. వాటి సహాయంతో పిల్లలను ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూ ఉంటాయి వారి దారికి అడ్డుగా వున్న అవరోధాలు గురించి. రోబోట్ ఇంగ్లీషులో గానీ, పిల్లల మాతృభాషలో గానీ మాట్లాడుతుంది. ఆ సాధనాలకు ఒక ట్రే అమర్చబడింది. దాని సహాయంతో పిల్లలు తమ ఆహారం తీసుకోవడానికి తోడ్పాటు ఇస్తుంది. నీరు తాగడానికి సహాయపడుతుంది.

ఆ రోబోటిక్స్ బ్యాటరీ సహాయంతో కార్యక్రమాలు సాగిస్తుంది. బ్యాటరీలలో శక్తి తగ్గిపోయి, అది పని చెయ్యనిస్థితికి రావడానికి రెండు గంటలముందు, తనను వినియోగిస్తున్నవారికి ఆ విషయం తెలియచేస్తుంది. పిల్లలు వారి శరీర నిర్మాణానికి అనువైన ఎక్సర్‌సైజ్‌లు చెయ్యవలసి ఉంటుంది. ఏయే సమయాల్లో వారు వాటిని చెయ్యవలసిందీ రోబోట్ వారికి చెప్తుంది. వృద్ధులకు అనారోగ్యానికి గురి అయిన వారికీ, ప్రమాదంలో గాయపడిన వారికి కూడా అది సహాయాన్ని అందిస్తుంది.

కిషోర్ ఆ రోబోట్‌కు స్టీల్ బాడీ ఏర్పాటుచేశాడు. దాని విడి సామాన్లన్నీ సులభంగా లభిస్తాయి. ఇంత అద్భుతమైన రోబోట్‌ను రూపొందించిన కిషోర్‌కుమార్ నిజంగా అభినందనీయుడు.

---

## దోమానందలహరి

ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవలకాలంలో గడగడలాడిస్తున్న జ్వరాలకు కారణం ఎక్కువగా దోమలే అంటున్నారు వైద్యులు. తాగడానికి కడుపునిండా నీళ్లు దొరక్కపోయినా మురికి నీళ్లూ, వాటిపై వాలే మశకసమూహాలకూ మాత్రం లోటుండట్లేదు.

'ఇది చల్లని వేళయిన్నా, ఇది వెన్నెల రేయయినా, నిదురరాదు కనులకు, శాంతి లేదు మనసుకు అన్నాడొక కవి. ఈ వేదనకు కారణం ప్రేమ కావచ్చు దోమ కూడా కావచ్చు

ఇంతకుముందు మీరు వేయి ఈగల్ని చంపి, 'హజార్‌మార్యా' అని బిరుదు తగిలించుకొని, శత్రుసైన్యాన్ని గడగడలాడించిన వీరుని కథ వినేవుంటారు.

అలాంటి వీరుడే మన కలకత్తాలోని 'సాల్ట్ లేక్'కి చెందిన 64 ఏళ్ల, అనుపమ్ చక్రవర్తి అనబడే సివిల్ ఇంజినీరు. వారుండే పరిసరాల్లో దోమల బెడద ఎక్కువగా వుందని ఎన్నిసార్లు ఫిర్యాదు చేసినా చలించని మునిసిపాలిటీ వైఖరికి ఆయన విసుగుచెందారు. దోమల బెడద తీవ్రత గురించి అధికారులకు తెలియచేయాలని నిశ్చయించుకున్నారు. దోమలను చంపి వాటిని భద్రపరచసాగారు. దీని గురించి ఒక ప్రత్యేకమైన గాజు పెట్టెను కూడా తయారుచేయించారు. దోమల శరీరాలు పాడవకూడదని నిపుణులని సంప్రదించి రసాయనాలు వాడారు. మూడు నెలల్లో 1/2 ఘనపుటడుగులు (cft)నిండేంతటి దోమల్ని పోగుచేశారు.

ఈలోగా అధికారులు తమ వైఖరిని మార్చుకున్నా, చక్రవర్తిగారికి దోమల్ని పోగు చేయడం ఒక హాబీ అయి కూర్చుంది. ఇంతకీ ఇన్ని దోమల్ని ఆయన ఎలా పట్టగలిగారని ఆశ్చర్యపోతున్నారా?

ఆయనకు రెండంతస్థుల ఇల్లుంది. కింద అంతస్తులోని నేలకు ఘాటైన రసాయనాలు కలిపిన పెయింటు పూసి, బాతురూము, వంటగదుల కిటికీలు కొద్దిగా తెరిచిపెట్టి, మిగిలిన తలుపులూ కిటికీలూ మూసిపెట్టేవారు.







ఆ కిటికీల్లోంచి ఇంట్లోకి దూరే దోమలు, రసాయనం ప్రభావం వలన చచ్చిపోయి నేలమీద పడిపోయేవి. వాటిని ఏరుకుని ఆయన పెట్టెలో భద్రపరుచుకునేవారు.

పై విధంగా పోగయిన దోమల్ని బట్టి కలకత్తాలోని 'స్టాల్‌లేక్' పరిసరాల్లో అవి సుమారుగా ఎంత రక్తాన్ని పీల్చి వుంటాయో అంచనా వేశారు.

మూడు నెలల్లో ఒక అంతస్తులో $^1/_2$ cft దోమలున్నట్టయితే, మొత్తం ఇంటిలో 1 cft దోమలున్నట్టే గదా! ఇలా లెక్కవేస్తే స్టాల్‌లేక్‌లో అటువంటిళ్లు 16,000 దాకా వున్నాయి. అంటే 160 Cft దోమలున్నాయన్నమాట. సాధారణంగా దోమలు వాటి ఘనపరిమాణం ఎంత వుంటుందో అంత రక్తాన్ని పీల్చగలుగుతాయి. అంటే 160 cft, అనగా 5,600 లీటర్ల రక్తం అన్నమాట!

అనుపమ్ చక్రవర్తిగారు 'దోమల చక్రవర్తి'గా గిన్నిస్ బుక్కులోకి ప్రవేశించాలని ఆశిస్తున్నారు. ఆ ఆశ నెరవేరాకానయినా ఆయన హాయిగా నిదురించాలని మనసారా కోరుకుందాం.

---

# చెట్టుపై సత్యాగ్రహం

కొందరు ధైర్యంతో, పట్టుదలతో, ఎంత శ్రమకు గురిఅయినా తమ లక్ష్యాన్ని సాధిస్తారు! ఆవిధంగా ఎందరికో మార్గదర్శకులు అవుతారు!

ఆ కోవకు చెందినదే జూలియాహిల్. అమెరికాలోని కాలిఫోర్నియాలో ఒక రెడ్‌వుడ్ వృక్షంపై ఆమె 2 సం॥రాలు స్థిర నివాసం ఏర్పరచుకొంది తన నిశ్చయాన్ని నెరవెర్చుకొనడం కోసం! ఆ 2 సం॥రాల కాలం ఆమె చెట్టు దిగలేదు! నేలమీద కాలు మోపలేదు!

కాలిఫోర్నియాలో గల అడవిలో, ప్రాచీన కాలంనుంచీ ఉంటున్న రెడ్‌వుడ్ వృక్షాలను, కొందరు విచక్షణారహితంగా నరకడాన్ని ఆమె నిరోధించింది! అడవిలోని వేలాది వృక్షాలు నేలమట్టమై, అడవి దొంగల అత్యాశకు బలికావడాన్ని చూసి జూలియా సహించలేకపోయింది. చెట్లు నరికి సొమ్ము చేసుకొనేవారి దుర్మార్గాన్ని అరికట్టడం కొరకు జూలియా కనీవినీ ఎరుగని సత్యాగ్రహం ప్రారంభించింది.

అందుకొరకు ఆమె ఓ చెట్టుమీద బైఠాయించి, అడవిదొంగలు తమ దురాగతాన్ని మానుకొన్ననాడే, తాను వృక్షం మీదనుంచి కిందకు దిగుతానని శపథం చేసింది!

చెట్టుపై నివాసం కొరకు 2 అడుగుల పొడవు, 3 అడుగుల వెడల్పుగల ఒకే ప్లాట్‌ఫామ్‌ను ఏర్పాటుచేసింది. సూర్యశక్తితో పనిచేసే ఫోన్, రేడియో రూపొందించింది బయట ప్రపంచంతో సంబంధం ఏర్పడడం కోసం. కొంతమంది జూలియాకు రోజూ ఆహారపానీయాలు అందజేసేవారు. మరి కొందరు మిత్రులు, అభిమానులు ఆమె చంపుతామని బెదిరించారు. అయినా ఆ యువతి మొక్కవోని ధైర్యంతో ఉంది. వారు విసిరిన అనేక ప్రలోభాల వలలో కూడా చిక్కలేదు.

ప్రతీరోజూ వందలాది జనం అడవికి వెళ్ళి జూలియాను చూసేవారు. పత్రికలు, టీవీలు కలప కంపెనీవారిని తీవ్రంగా విమర్శించాయి. ఉవ్వెత్తున ప్రజా ఉద్యమం కూడా రూపుదాల్చుకోసాగింది. కలప కంపెనీవారి గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. చివరికి వారు గత్యంతరంలేక, ప్రజల సమక్షంలో, రెడ్‌వుడ్ వృక్షాలకింద నిలబడి,




నివాసం ఉంటున్న చెట్టుకు రక్షణగా ఉన్నారు వృక్షాలు నరికించే కలప కంపెనీ వారి వలన జూలియాకు ఏ అపకారం జరగకుండా!

ఆమె తనకు ఆశ్రయం ఇచ్చిన చెట్టుకు లూనా అనే ముద్దుపేరు పెట్టుకొంది. పత్రికలవారు ఆమెను 'సీతాకోకచిలుక' అంటూ మురిపెంగా పిలిచేవారు! కలప కంపెనీలు జూలియాపై ఎన్నెన్నో ఒత్తిళ్లు తెచ్చారు. జూలియాకు వాగ్దానం చేశారు. తాము ఆ పరిసరప్రాంతాల్లో వున్న ఏ వృక్షాన్నీ నరకమని!

విజయం సాధించినందుకు జనమంతా జూలియాను అభినందించారు. చివరికి జూలియా రెడ్‌వుడ్ చెట్టుపైనుంచి కిందికి దిగి, 2 సం॥రాల 15 రోజుల పిమ్మట భూదేవిపై కాళ్లు మోపింది! అది ప్రజా విజయం. ప్రకృతిలోని అన్ని వనరులనూ కాపాడుకొని, కాలుష్యాన్ని నిరోధించాలనుకొనేవారికి లభించిన విజయం!



# 'నేనెవరిని?' పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన అత్తలూరి విజయలక్ష్మి నవల 'నేనెవరిని?' పై మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువ ప్రచురిస్తున్నాం

## అంగడిబొమ్మలు

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

వర్ణాంతర వివాహం చేసుకొని అయినవాళ్లకు దూరంగా బతుకుతున్న కుటుంబం, ఆ కుటుంబ యజమాని మరణిస్తే బతుకు తెరువుకోసం ఆ కుటుంబం పడే అవస్థలు, కుటుంబంలోని వాళ్లందరూ చనిపోయి అనాథగా మిగిలిన కూతురు అనుకోని పరిస్థితులలో మోసగించబడి వేశ్యగా మారి వేశ్యగా కూడా మోసపోతూ చివరికి ఆలయంలో సేవికగా మారిపోవడం మొదలయిన విషయాలతో కొంతవరకూ గౌరవ కుటుంబం, వర్ణాంతర వివాహం ఆ తరువాత వేశ్యావాటిక మోసాలుతో హృద్యంగా సాగింది నవల.




చిన్నతనంలో తల్లి మెడలో తాళి బొట్టు చూసి దానిని మెడలో వేసుకోవాలన్న ఉబలాటం, తెలియని ఆకర్షణ, ఇష్టాలతో ప్రారంభమయిన నవల చివరికి ఆ తాళి బొట్టంటేనే భయపడి అసహ్యంతో తెంచి పారేయడంతో ముగుస్తుంది.

అమాయకులైన ఆడవాళ్లు ఎలా మోసపోతున్నారో ఆ మురికి కూపంలో ఎలా మగ్గిపోతున్నారో ఆ పద్మవ్యూహంలో ఎలా చిక్కుకుపోతున్నారో చక్కగా చిత్రించిన నవల. ఆ పౌడర్ల వెనుక, ఆ నవ్వుల వెనుక వున్న కన్నీటి గాధలేమిటో కళ్లకు కట్టినట్లు చెప్పారు రచయిత్రి. అయితే ఆ చీకట్లో మగ్గిపోయేవారికి వెలుగును చూపితే బాగుణ్ణు.

ఆడది అర్ధరాత్రి రోడ్డుమీద ఒంటరిగా నడవ గలిగిన నాడే ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చినట్లని బాపూజీ అంటారు. కానీ పట్టపగలే తనతోపాటు ప్రయాణం చేస్తున్న సాటి స్త్రీయే మోసం చేసి రొంపిలోకి దించిన వైనం, మధు బంతయి వేశ్యగా మారినపుడు రోదించిన వైనం కంట తడి పెట్టిస్తుంది.

కొంతమంది అమాయకులైన ఆడపిల్లలను మోసపుచ్చి అంగడి బొమ్మలుగా మారుస్తుంటే సెక్స్ వర్కర్స్ అని పేరుపెట్టి చట్టబద్ధత కల్పిస్తున్న ప్రభుత్వాలకు ఇదొక చెంపపెట్టు. నాగరిక సమాజంలో స్త్రీలపై జరుగుతున్న దౌష్ట్యాలను, మోసాలను మరొకసారి ఎత్తి చూపిన నవల.

కాకపోతే సినిమా ఫక్కీలో రైలు ప్రయాణం, మధు రైలు దిగి తిరిగి రైలుని అందుకోలేకపోవటం, చెయిన్ లాగాలన్న ఆలోచన ఎవరికీ రాకపోవటం, రైలులోంచి గెంతేస్తున్నప్పుడయినా ఎవ్వరూ ఆలోచించ

కపోవడంలో నవలని నడిపించాలన్న రచయిత్రి తాపత్రయం కనబడుతుంది.

సమస్యను చూపించడంలోనూ, పాఠకులను కంటతడి పెట్టించడంలో కృతకృత్యురాలయ్యింది రచయిత్రి.

– రావాడ సత్యనారాయణ
బొబ్బిలి-535558

## మానసిక పతనం

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

**అత్తలూరి** విజయలక్ష్మి 'నేనెవరిని?' నవలలోని సంఘటనలు, మధుమతి ఆశలు, ఆవేదనలు, ఆమె ఎదురుచూపులు, అమాయకత్వం... అన్నీ కళ్లకు కట్టినట్లు చూపిన రచనాశైలి చాలా అద్భుతం!

మనిషి విధి చేతిలో కీలుబొమ్మ అంటారు. అది మధుమతి విషయంలో అక్షరాలా నిజమయింది. మధుమతిగా కన్నవారితో వున్నప్పుడుగాని, బంతిగా దేవమ్మ దగ్గర వున్న రోజులలోను, అలాగే గిరిబాబు, నర్సిమ్మల దగ్గర చిక్కుకున్నప్పుడు కూడా ఆమె అమాయకత్వం కొంచం కూడా మారలేదు. ఆ అమాయకత్వమే ఆమెకు శ్రీరామరక్షగా వుండి ఆత్మహత్యా ప్రయత్నం నుంచి రక్షించడమేగాక ఆమెను సురక్షితమైన సాయిబాబా అనాథాశ్రమంలోకి చేర్చింది. అంతేగాక ఆ పవిత్రమైన దేవాలయంలోకి వెళ్లినప్పుడే ఆమెకు తానెవరినన్న నిజం, జీవిత పరమార్థం రెండూ తెలిసొచ్చాయి.

రచయిత్రి ఈ నవలలో సంఘ విరోధక చర్యలు ఎంత నిరాటంకంగా, దారుణంగా జరుగుతున్నాయో చాలా యదార్థంగా చిత్రించారు. అమాయకులైన ఆడపిల్లల జీవితం దుష్టుల చేతుల్లో బలికావడం చదువుతుంటే ఈ పిల్లలు చేసిన నేరమేమిటీ? వాళ్లకెందుకీ దుస్థితి? అని వాపోక తప్పదు. కొందరికి ఇంట్లో ప్రేమాభిమానాలు కరువై ఇల్లు విడిచి రావడం, ఇలా మోసపోవడం జరుగుతుంది. మరికొందరేమో సినిమాల మోజులోపడి ఏ అపరిచితులనో నమ్మి అన్యాయానికి గురి అవుతారు. ఇక మధుమతి లాంటి వాళ్లు కటిక దారిద్ర్యంలో పుట్టి పెరిగి పెద్దల కనుసన్నలలో వుండాల్సిన ప్రాయంలో అనాథలైపోతే సమాజంలో వాళ్ల పరిస్థితి ఎంత దారుణమో వూహించుకోవచ్చు.

కాని ఎంతటి దుస్థితికి పాల్పడినా ఒక మనిషి తనను తాను మానసిక పతనం నుంచి కాపాడుకోగలిగితే అంటే మనోబలం, ఆత్మశక్తి పెంచుకుంటే వాళ్లు జీవితంలో సురక్షితంగా వుండటమేగాక మహోన్నతమైన గమ్యం చేరుకో గలరన్నది మధుమతి పాత్రద్వారా రచయిత్రి నిరూపించారు. ఈ నవల యువతరానికొక చుక్కాని అంటే అతిశయోక్తి కాదేమో!

– సుముఖి రాఘవన్
చెన్నై-600020

## సామాజిక స్పృహ

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

**అత్తలూరి** విజయలక్ష్మి రచించిన 'నేనెవరిని' నవల పాఠకుల హృదయాలను కంపింపచేస్తుంది. నేటి సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అఘాయిత్యాలను వివరించిన తీరు కంటినీరు తెప్పించింది. మధు అతి చిన్న వయసులో తీవ్రమైన బాధలను ఎదుర్కొంటుంది. ఇటువంటి సంఘటనలు జరగడం కళ్లారా చూస్తే వీధి వీధిలోకెళ్లి దేవమ్మలాంటి కర్కశ హృదయాలు గల రాక్షసులను నరికి వేయాలనిపించటం హృదయమున్న ఏ పాఠకున్నికైనా సహజం. ఈ




నవల కుటుంబంలో పెద్దల అండ పిల్లలకు తప్పనిసరి అని తెలుపుతుంది. అంతేగాక చిన్న వయసులోనే పిల్లలకు కనీసం సామాజిక స్పృహ తప్పకుండా ఉండాలని వివరిస్తుంది. లేనట్లైతే మధువలె ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. వేశ్యాగృహంలో తన వయసులో ఉన్న ఒక అమ్మాయి దేవమ్మ గుణగణాలను, ఆమె చేసే ఘోర అఘాయిత్యాలను ఎంత వివరించినా మధుకు మొదట అర్థం కాకపోవటం సామాజిక నిస్పృహకి తార్కాణం.

ఈ నవల తల్లిదండ్రులు తమకు సొంత వాళ్లు దూరమైనప్పటికీ కనీసం మిత్రుల నన్నా బంధువులుగా చేసుకుని తమ పిల్లలను వారి దగ్గరకు అప్పుడప్పుడు తీసుకెళ్లాలని వివరిస్తుంది. లేనట్లైతే పిల్లలలో బయట ప్రపంచానికి సంబంధించిన జ్ఞానం కొరవడుతుందని తెలుస్తుంది.

ఈ నవల కులాంతర వివాహాలు పురోగమిస్తాయి అన్న దానిని ప్రతిబింబించడం లేదు. మధు వాళ్ల అమ్మనాన్న, తమ్ముడి పేర్లను గుర్తుంచుకుని తన పేరునే వేశ్యా గృహంలోకి ప్రవేశించిన కొంతకాలానికి మరచిపోవడం అసహజంగా కనిపిస్తుంది. మధు వాళ్ల తల్లిదండ్రులు ఎదుర్కొనే సమస్యలను చూసినట్లైతే ఈ నవల ప్రేమ వివాహాలను ప్రోత్సహించేదిగా లేనట్లు కనిపిస్తుంది.

మొత్తానికి ఈ నవలా రచయిత్రి అత్తలూరి విజయలక్ష్మి పాఠకుల అభిమానాన్ని చూరగొన్నారనడంలో ఎటువంటి సందేహం లేదు.

–పి.లాలూ యాదవ్
పొట్లూరు-501202

## మేలుకొలుపు

*(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

"పుట్టుకతోనే ఎవరూ చెడ్డవాళ్లు కారు. సమాజమే వారిని చెడ్డవారిని చేయిస్తుంది" అన్న నానుడిని నిజం చేస్తూ ఆగస్టు నెలలో ప్రచురితమైన చతుర నవల నేనెవరిని? పాఠకుల హృదయాలలోకి సూటిగా దూసుకుపోయింది.

అమాయకురాలైన, ఒక గౌరవనీయమైన కుటుంబం నుంచి వచ్చిన చిన్న పిల్ల తన తప్పేమీ లేకుండానే సమాజపు స్వార్థానికి బలి అయి సమాజంలో గుర్తింపూ, గౌరవం కోల్పోయి హీనాతిహీనంగా జీవితాన్ని గడపాల్సి రావడం, పోనీ కనీసం వారి శరీరాన్ని పణంగా పెట్టి సంపాదించిన డబ్బు ఆమె అనుభవించే అదృష్టానికి కూడా నోచుకోక ఇతరుల పాలు చేయాల్సి రావడం నిజంగా దారుణం.

ఈ నవల్లో మధుమతి పాత్ర అత్యద్భుతంగా ఉంది. నిజజీవితంలో జరిగే సంఘటనలే నవల్లోనూ కనిపిస్తాయి. కానీ వాటిని పాఠకులకు అందించిన తీరు చాలా బాగుంది. తల్లీతండ్రీ లేని అనాథ పిల్లల్ని, ఒంటరిగా దొరికిన చిన్న పిల్లల్ని, సినిమాల మోజులోనో పెద్దవాళ్లపై కోపంతోనో ఇల్లు వదిలి బయటకు వచ్చిన ఆడపిల్లల్ని ఏ విధంగా మోసం చేసి వారి శరీరాలతో వ్యాపారం చేస్తారో ఏవిధంగా వారి రక్త దాహం తీర్చుకుంటారో రచయిత్రి చిత్రించిన తీరు చాలా హృద్యంగా ఉంది.

అమాయక స్త్రీ పాత్ర చుట్టూ తిరిగే మగవాళ్ల పాత్రలు సమాజంలో మగవారి (కొంతమంది) అసలు స్వరూపాన్ని చూపిస్తాయి. ఆడదాన్ని అందునా వేశ్యగా ముద్ర పడ్డ స్త్రీని ఉద్ధరించటానికి ఎవరూ ముందుకు రారు. తమకు అవకాశం దొరికి నన్నాళ్లు ఆమెను అనుభవించి వదిలి వేస్తారని గులాబి ద్వారా చెప్పించిన తీరు బావుంది.

తాళి ప్రాధాన్యతని, తాళికున్న విలువను గురించిన వివరణ బాగుంది. సమాజంలో దేవమ్మలాంటి రక్త పిపాసులతో బాటుగా

పాపాయమ్మ లాంటి సహృదయులు ఉంటారు. కానీ ఒంటరి ఆడది చిక్కితే వల వేసి పట్టుకోవడానికి ఎదురుచూస్తుంటాయి కొన్ని కాలనాగులు. వాటి చేతికి చిక్క కుండా జాగ్రత్తగా, కొంచెం తెలివిగా ఆలో చించి నిర్ణయాలు తీసుకోవాలి నేటి ఆడపి ల్లలు. ఒకక్షణం... ఆ క్షణ నిర్ణయమే మన జీవితగతిని మార్చేస్తుందని అర్థం చేసుకో వాలి. ఇది ఈనాటి బాలికలకూ, యువతు లకూ రచయిత్రి పాడే మేల్కొలుపు.

– బి.శకుంతలాదేవి
మంగళగిరి-522503

## ఎవరికోసం?

*(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

నేనెవరిని? నవల మొదటిపేజీ నుండీ చివరి పేజీవరకూ చదివించగలిగింది. సమాజంలో పరిస్థితులు, స్థితిగతులు క్షుణ్ణంగా పరిశీలించి రచనలో చూపించగలి గినందుకు రచయిత్రికి ధన్యవాదాలు. కాని తెలుగు సీరియల్‌లో కష్టాలులా ఒకదాని వెనుక ఒకటి మధుమతిని తరిమి తరిమికొ ట్టాయి. తాళి, పెళ్లి, సంసారం అంటే తెలి యని వయసు నుండీ కేవలం తాళి మీద ఆశ తప్ప వేరే ఏ ఆలోచనలేని అమాయ కురాలిగా మధుమతి జీవితం ప్రారంభం అయింది. కనీసం జీవితంలో కొన్ని ఒడిదు డుకులు ఎదురైనా సమాజాన్ని అర్థం చేసి కోలేని అమాయకురాలిగానే నవల ముగి సింది. ఆమెలో ధైర్యాన్ని పెంచి ఆ ఊబి లోంచి పైకివచ్చి సమాజాన్ని ఎదిరించి బత కగలిగేలా మలిచితే దేవమ్మ పంజరంలో కొన్ని పక్షులకైనా మార్గ దర్శకమయ్యేది. వేశ్యాగృహాల్లో పరిస్థితులు, స్థితిగతులు యదార్థంగా కళ్లకు కట్టినట్లు రచించారు. రచయిత్రి నిశితపరిశీలన మెచ్చుకోదగినది. మధుమతి వేశ్యవృత్తిలోంచి బైటకు రావా లనే ఆలోచనేకాని తెగించి ధైర్యం చేయలేక పోవడం, ఆ ఆలోచన రాకపోవడం స్త్రీజాతి పిరికితనం చూపించారు. వార్ని జాగృతి పరిచేలా రచన వుండివుంటే బాగుండేది. వ్యభిచారులను ఉద్ధరించేవారు కేవలం కబుర్లకే పరిమితులనీ వారికి లైసెన్సులు మంజూరు చేయడానికి ప్రభుత్వం అంగీక రించినా అది కాగితాల వరకేనన్నది నగ్న సత్యం. వ్యభిచారుల జీవితంలో మార్పుకు ప్రభుత్వ సహకారం అందటంలేదు. ఎయిడ్స్ ప్రచారంలో కొంత నిధులు వ్యభి చార నిర్మూలనకు కేటాయించాలి. వేశ్యవృ త్తిలోనున్న స్త్రీలు ఆకర్షణ తగ్గి ఆదాయం తగ్గితే మరి కొంతమంది స్త్రీలను వ్యభిచా రంలోకి దింపుతున్నారు. ఈ విషయాలు చర్చించి పరిష్కారం చూపితే బావుండేది.

ఆధ్యాత్మికంగాకాని, వేదాంతపరంగాకాని, తేలికగాకాని దొరకని సమాధానం నేనెవరిని అంటే? అలాగే ఈ నవల ఎవరికోసం అనేది నా ప్రశ్న. సమస్య పరిష్కారం అనేది నవలకి వుండాలి.

– టి.సాయిప్రకాష్
విశాఖపట్నం-27

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78





